శ్రీ

పరవస్తు చిన్నయసూరి కృత

హిందూధర్మశాస్త్ర సంగ్రహము సహితముగ

# చిన్నయసూరి జీవితము


విద్యారత్న. పరిశోధనాపరమేశ్వర

నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ.

మదరాసు విశ్వవిద్యాలయాంధ్ర భాషాశాఖాధ్యక్షుఁడు.



బి ష ర్ :

నిడుదవోలు వేంకటరావు,

81, కార్నేశ్వర్ కోయిల్ స్ట్రీట్,

మైలాపూర్, మద్రాసు-4

# CHINNAYA SURI

FIRST TELUGU HEADMASTER OF
THE MADRAS UNIVERSITY (1853—1862)

# NEETI CHANDRIKA

OR

## MORAL STORIES

BY

P. CHINNIAH SOOREE

TELUGU HEADMASTER OF THE MADRAS UNIVERSITY

VOL 1

MADRAS

PRINTED AT THE

VANEEDARPANUM PRESS

1853

---

*To*

A. J. ARBUTHNOT Esq.

SECRETARY TO THE MADRAS UNIVERSITY
AND COLLEGE OF FORT SAINT GEORGE.

*This work is respectfully dedicated, as a mark of respect.*

BY

His most obedient and humble servant

P. CHINNIAH SOOREE

Telugu Headmaster in the Madras University

---

# విషయసూచిక

శ్రీ

# చిన్నయసూరి జీవితము

—:o:—

## 1. ఉపోద్ఘాతము

శ్రీ పరవస్తు చిన్నయసూరి పందొమ్మిదవ శతాబ్దిని విలసిల్లిన ప్రసిద్ధ పండితులలో ప్రథమగణ్యుఁడు. ఈతఁడు రచించిన గ్రంథములలో బాలవ్యాకరణమును, నీతిచంద్రికయు నూఱేండ్లనుండి పాఠశాలలందును, కళాశాలలందును నియతముగఁ బఠనీయ గ్రంథములై పండితలోకమున ప్రామాణికములైనవి; ఆంధ్రదేశమంతటను నధిక వ్యాప్తి నందినవి. అక్షరాస్యులగు నేటి తెలుఁగువారిలో నీతిచంద్రిక చదువని విద్యార్థి కాని, బాలవ్యాకరణము నెఱుఁగని పండితుఁడు గాని లేఁడని చెప్పుట సత్యోక్తియే కాని యతిశయోక్తి కాదు. ప్రాచీన కాలమున వచనరచనకు, వ్యాకరణరచనకు మార్గదర్శకుఁడగు 'నన్నయ్య' వలె నవీన కాలమున నీ రెండింటికి చిన్నయసూరి మార్గదర్శకుఁ డగుటచేత "ఆనాఁడు నన్నయ్య, యీనాఁడు చిన్నయ్య" యను నానుడి యీతని యెడల సార్థకమైనది.

చిన్నయసూరి పై రెండు గ్రంథములేకాక బహుముఖముగా సంస్తవనీయమగు భాషావాఙ్మయసేవ గావించిన మహా

విద్వాంసుఁడు. ఆంధ్ర వాఙ్మయ చరిత్రమున నవీన యుగ ప్రారంభ దశలో, నసఁగా పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభదశకమున చిన్నయసూరి ప్రభవించెను. అప్పుడే యాంగ్లేయులు మన దేశమున తమ ప్రభుత్వమును సుప్రతిష్ఠితము గావించుకొని తమ భాషయగు నింగ్లీషు భాషను రాజభాషగా నొనర్చి పరిపాలన ప్రారంభించిరి. పశ్చిమఖండవాసులైన యాంగ్లేయుల సమాగమమువలన వారి నాగరికత, సంస్కృతి దేశ భాషలకొక నూతన వికాసము గలుగఁజేసినవి. తెనుఁగున నవ్యయుగ చిహ్నములైన ముద్రా యంత్రములు, వార్తా పత్రికలు, విశ్వవిద్యాలయములు, వచన రచన, ప్రాచీన గ్రంథముద్రణము, భాండాగార స్థాపనము, భాషా వాఙ్మయ పరిశోధనము మున్నగునవి నాఁడే మొలకలెత్తినవి. వానికిఁ దగిన రీతిని దోహదము నిచ్చి యీ నవ్యయుగ నిర్మాణ సౌధమునకుఁ బునాదివైచినవారు భాషోద్ధారకులు బ్రౌను దొరవారు. వారి కాలమునందే చిన్నయసూరి కూలంకషమగు సంస్కృతాంధ్ర భాషా పాండిత్యము సంపాదించి యీ నూతనోద్యమము లన్నిటిని గ్రహించెను

బ్రౌనుదొరవారి పద్ధతి యీ కాలమున నాంధ్ర సారస్వతము నంతటిని నవీనరీతులను పునరుద్ధరించినదయ్యును, పండిత లోకమునకు నుపాదేయమగురీతిని పెంపొంద లేకపోయినది. చిన్నయసూరి యీ నూతనపథకముయొక్క పరిస్థితిని గమనించి యది సంస్కరణార్హమని యెంచి యాయా శాఖ లన్నింటి యందు తాను పరిశ్రమచేసి యా నవీనపథకమును ప్రాచీన

సంప్రదాయములతో సమ్మేళనము చేసెను. ఇట్లీరెండు పద్ధతులను జోడించుటవలన నాంధ్ర వాఙ్మయ చరిత్రలో నొకవిధమగు నూతనచైతన్యము గల సంస్కృతి యుత్పన్నమగుటకుఁ దగిన యవకాశ మేర్పడినది.

ఈపద్ధతి పండితజనసమ్మతమగుట చేత నుత్తమసాహిత్య విద్యావ్యాప్తికి నెంతేని తోడ్పడినది. కాఁబట్టియే చిన్నయసూరిని నవ్యవాఙ్మయయుగపురుషులలో నొకనిగా మనము పరిగణింపవలయును. అతఁడు నవీనోద్యమము లన్నిటియందును పాల్గొని యానాఁటి సాహిత్యప్రపంచమునకు నియంతగా నుండిన మహారథుఁడు.

అయిన నీనాఁటి వాఙ్మయచరిత్రకారుల కేమి, పండితుల కేమి చిన్నయసూరి సమగ్రజీవితము తెలియకపోవుట చేత నవ్యాంధ్రవాఙ్మయ ప్రపంచమున నాతనికిఁ గల యుగ్రస్థానము గుర్తింపఁబడలేదు. రాఁబోవు ప్రకరణములలో నాతఁ డేవిధముగా నీ నవీనోద్యమరథమును నడిపించి యజరామరకీర్తి గడించి శకపురుషుఁ డయ్యెనో చదువుదము.

# 2. జననము – విద్యాభ్యాసము

చిన్నయసూరి చాత్తాదవైష్ణవ సంప్రదాయమునకుఁ జెందినవాఁడు. వీరినే 'సాతాను' లని యందురు. వీ రుభయ వేదాంత ప్రవర్తకులగు వైష్ణవాచార్యులతో సమానప్రతిపత్తి గడించినవారు. చిన్నయసూరి పూర్వీకు లుత్తర దేశస్థులు; పరవస్తు మఠ మను నొక మఠమువారి శిష్యులు. వీరికిని బ్రాహ్మణులవలె సూత్రగోత్రములు గలవు. సూరిగారు ఆపస్తంబ సూత్రులు; గార్గేయ గోత్రులు; యజుశ్శాఖాధ్యాయులు. వీరి తండ్రిగారు వేంకటరంగరామానుజాచార్యులుగా రుభయ వేదాంత ప్రవర్తకులై, చెన్నపురమున తిరువళ్ళిక్కేణిలోని రామానుజకూటమునందు శిష్యులకు వైష్ణవమతసిద్ధాంతములను బోధించుచుండిరి. ఇట్లుండఁగా కొంతకాలమునకు శ్రీ ప్రతివాది భయంకరము శ్రీనివాసాచార్యులవారు వీరి బోధనాశక్తిని గమనించి వీరిని శ్రీ రామానుజులవారి జన్మస్థలమగు శ్రీ పెరంబూదూరునకుఁ దీసికొనిపోయిరి.

అచ్చట కోవెలయందు వీరిని ద్రవిడవేదపారాయణాధ్యాపకులుగా నియమించి, తగిన వసతు లేర్పఱచిరి. శ్రీ పెరంబూదూరున రామానుజాచార్యులవారు నివసించుచు నచ్చటికి వచ్చినవారి నందఱిని వైష్ణవమతప్రవిష్టులుగా నొనరించుచుండిరి. వీరు ద్రవిడవేదమే కాక సంస్కృతము, ప్రాకృతము, ద్రావిడము, తెనుఁగు మొదలగు భాషలు చక్కఁగా తెలిసినవారు. కనుక

బాలురకు పాఠములుకూడ చెప్పెడివారు. రామానుజాచార్యులవారి భార్య శ్రీనివాసాంబ. వారి కొక్క కొమరిత మాత్రమే యుండెడిది. ఆమె పెరిగి పెద్దదై వితంతు వయ్యెను. ఆ దంపతులు లిరువురును పురుషసంతతి లేకపోవుటచే మిక్కిలి చింతించుచుండిరి. చాలకాలము గడిచినను వారి కోర్కె నెఱవేఱలేదు. తుట్టతుదకు వీరి మిత్రులగు శ్రీనివాసాచార్యులవారు పుత్రోత్పత్తికొఱకు నొక యాగమును చేయించిరి. ఆ యాగపాయసమును భుజించినవెనుక నాదంపతులకు క్రీ. శ. ౧౮౦౬ ప్రభవసంవత్సరమున నొక పుత్రుఁడు జన్మించెను. అతఁడే మన కథానాయకుఁడు.

ఈతనికి తల్లిదండ్రులు 'చిన్నయ్య' యని నామకరణము కావించిరి. ఈ బాలునికి కుడికంటియందు నల్లగుడ్డున్న స్థలము కొంచెము మాఱియుండెను. ఇది యొక శుభలక్షణమని, దీనిని గలిగినవారు శాశ్వతమగు కీర్తిని సంపాదింతురని పెద్దలు చెప్పుచుండెడివారు. తల్లిదండ్రులును చాల కాలమునకు జన్మించిన పుత్రుఁడగుటచే నీతనిని మిగుల గారాబముతో పెంచుచుండిరి. ఈ కారణముచేత చిన్నయకు పదునాలేండ్లు వచ్చువఱకు విద్యయందాసక్తిగలుగుటకు నవకాశమే లేకపోయెను. ఇతఁడు తన తల్లితో పేరంటమునకు పోయి పాటలను పాడుచుండెడివాఁడు; ఇతర బాలురతో నాటపాటలతో కాలముఁబుచ్చెడివాఁడు.

ఇట్లుండ నొకనాఁడు తండ్రిస్నేహితులగు కంచి రామానుజాచార్యులవా రితనినిఁజూచి "చదువులేని యీబాలుఁ డెవఁ" డని ప్రశ్నించిరి. విద్యాగంధము లేని బాలుని తన కుమారుఁ డని చెప్పుటకు తండ్రి సంకోచించెను. కాని రామానుజాచార్యులవా రా బాలుని పిలిచి, "నాయనా! మీతండ్రిగారు వయోవృద్ధులే కాక గుణవృద్ధులు, గురుపదారూఢులు నై యున్నారు. మావంటివా రెందఱో వారివద్ద శుశ్రూషలొనర్చి విద్యావంతులైనారు. అట్టి మహా విద్వాంసుని కడుపున నీవట్టి నిరక్షరకుక్షి జన్మించినాఁడు. నీకైనను బాల్యదశ గడచిపోయినది. ఇంకనైన నాలుగక్షరములు నేర్చుకొనకుండ వృథా కాలక్షేపముచేసినట్లయిన నీ తలిదండ్రులకు చెడ్డపేరు తెచ్చెదవు సుమా!" అని చీవాట్లు పెట్టిరి. ఆ మాటలు చిన్నయకు వాడిములుకులవలె మనమున నాటెను. అతఁడు నాఁటి నుండియుఁ దదేక దీక్షతో చదువుటకు పూనుకొనెను. తత్క్షణమే తండ్రిదగ్గఱ కరుదెంచి తనకు పాఠము చెప్పు మని కోరెను. అతఁడు తన స్నేహితులును, శిష్యులును నైన కంచి రామానుజాచార్యులవారికి చిన్నయకు చదువునేర్పుటకు నొక జాబు నిచ్చెను. దానిని తీసికొనిపోయి చిన్నయ వారి కందిచ్చెను.

రామానుజాచార్యులవా రా జాబుచూచి "నీవు చదువువాఁడవా? నాకు చాల సందేహముగా నున్నది" అనిరఁట. కాని చిన్నయ తాను, తప్పక, చెప్పినట్లు విని చదువుకొనెదనని బదులుచెప్పినంతనే యాచార్యులవారు ఇసుకయందు మొదట

ఓనమాలను వ్రాసియిచ్చి చిన్నయను వ్రాయుమని కోరిరి. ఆతఁడు తడుముకొనకుండ నటులనే తిరిగి వ్రాసెను. దానిని చూచి 'యీ బాలుఁడు బుద్ధిమంతుఁ'డని గ్రహించి అచ్చులను, హల్లులను వ్రాసియిచ్చిరి. గురువుగారు భుజించివచ్చునంతలో చిన్నయ వాని నన్నింటిని చక్కఁగా వ్రాసి చూపెను. ఆచార్యులవారు చాల సంతోషించిరి. చిన్నయ హృదయక్షేత్రమున సీరీతిగా నాటఁబడిన విద్యాబీజములు మెఱపుతీఁగెలవలె నతిస్వల్పకాలములో చక్కఁగా వృద్ధిచెంది పుష్పించి ఫలించినవి. పదునాఱేండ్లవఱకు పాండిత్యవాసనయే లేని బాలుఁడు ముప్పదేండ్లకు లోపుననే సాహితీసముద్రమును మథించి పాండిత్య పర్వతశిఖరము నధిరోహించినాఁ డన్న విస్మయావహముకదా! ప్రతిభాశాలురకు పుట్టుకతోడనే ప్రజ్ఞావిశేషము గలుగు నను సూత్ర మీతనియెడల ననువర్తింప లేదు.

సహజముగా గురువులయం దుండెడి భక్తిచేతను, చదువునందలి శ్రద్ధచేతను చిన్నయ త్వరలోనే గుణింతమును, వాక్యలేఖనమును నేర్చెను. లేఖనముతోకూడ వాచకత్వము నలవఱచుకొనుటకు పద్యములు, శ్లోకములు చదువుట ప్రారంభించెను. ఆకాలమున నిప్పటివలె వీథిబడులు, పాఠశాలలు విశేషముగా లేవు. గురువుల వాసగృహములే విద్యాస్థానములు. చదువులు చాలవఱకు లిఖితపుస్తకరూపమునఁగాక వాగ్రూపముగానే యుండెడివి. చిన్నయ యీ పద్ధతి ననుస

రించి సంస్కృతాంధ్ర భాషల రెండింటిని చదువ మొదలిడెను. మొదట బాలరామాయణమును, అమరమును, ఆంధ్రనామసంగ్రహమును వల్లెవేసెను. అతఁ డేకసంథాగ్రాహి యగుటచే వానినన్నింటిని కొలఁదికాలములోనే హృదయంగతము కావించుకొన్నాఁడు. కొంతకాలమునకు తండ్రి యీతనిని పరీక్షింపఁదలఁచి పిలిపించి అమరమున కొన్నిప్రశ్నలను వేసినాఁడు. చిన్నయ ఝటితిస్ఫూర్తితో జవాబిచ్చి తండ్రిని సంతోషాంబుధి నోలలాడించినాఁడు. తన కుమారుఁ డింక సాహిత్యమును చదువ నక్కఱలేదనియు, శాస్త్రమువైపు నాతని దృష్టి ప్రసరింపఁజేయవలయు ననియు, ముఖ్యముగా వ్యాకరణశాస్త్రము నభ్యసించవలసినదనియుఁ బోధించి ఆతఁడు తానే యీ వ్యాకరణవిద్యఁ గఱపుటకు పూనుకొనెను. కాని యింతలో చిన్నయతండ్రికి మదరాసునందు 'ఈస్టిండియా కంపెనీ' వారి *సుప్రీముకోర్టున న్యాయశాస్త్రవేత్తగా నుద్యోగమయ్యెను. దీనికి కారకు లా కాలమందు మదరాసుపుర ప్రముఖులలో ప్రథమగణ్యులగు గాజుల లక్ష్మీనరసింహము

## చెన్నపురి నివాసము

తండ్రిగారితో చిన్నయసూరి చెన్నపురికి వచ్చి వ్యాకరణము మాత్రమేకాక, అరవము, తెనుఁగు, ప్రాకృతము మొద

* ఆ కాలమున, ననఁగా కంపెనీవారి ప్రభుత్వకాలమున నేఁటి హైకోర్టును 'సుప్రీముకోర్టు' అని వ్యవహరించెడివారు.

లగు భాషలను నేర్చెను. కంచి రామానుజాచార్యులవారి యొద్ద తర్కము, మీమాంస, అలంకారముల నభ్యసించెను. శ్రీరామశాస్త్రి లనెడు నొక వైదికవిద్వాంసునియొద్ద వేదమును, వేదార్థమును గ్రహించెను. వారివలననే చిన్నయసూరి యనితరలభ్యమగు హయగ్రీవమంత్రము నుపదేశముపొందెను. ఈ మంత్రోపదేశమువలన చిన్నయసూరి తన పాండిత్యమునకు తోడుగా వేదాంతవిజ్ఞానసంపత్తిం బడసెను. తన కాలములో నంతటి ప్రతిష్ఠ సంపాదించుట కీమంత్రోపాసనాబలమే కారణము. కేవలము ప్రత్యక్షప్రమాణవాదులగు నీనాటివారికి నిట్టి సంఘటనలు విడ్డూరముగాఁ గానవచ్చును. కాని యాకాలమందలి మఱికొంతమంది కవిపండితుల చరిత్రలు పరిశీలించిన నిది యథార్థ మని గోచరింపక మానదు.

# 3. పాండిత్యప్రకర్ష - ఉద్యోగ ప్రయత్నములు

కాలక్రమమునను సహజమగు ప్రతిభాసంపత్తికిఁ దోడుగా హయగ్రీవమంత్రబలముగూడ ననుకూల మగుటచేత ముప్ప దేండ్లు వచ్చునప్పటికి చిన్నయ సంస్కృతాంధ్రద్రవిడము లను మూఁడుభాషలయందు కూలంకషమగు పాండిత్యమును సంపా దించెను. కేవలము లక్షణగ్రంథములగు వ్యాకరణాదిశాస్త్రముల యందు పరిశ్రమఁజేసి లక్ష్యపరిజ్ఞానము నెఱుఁగని కొంతమంది లౌకికపండితులవలెఁగాక చిన్నయసూరి సిద్ధాంతకౌముది నామూలాగ్రముగా నాకళించినవాఁడయ్యు దానికి లక్ష్యములగు సంస్కృతకావ్యపఠనమునుగూడ సంపూర్తిఁ గావించినవాఁడు. తెనుఁగుభాషలో నారీతిగనే లక్షణగ్రంథములగు నాంధ్రశబ్ద చింతామణి, యథర్వణకారికావళి, అప్పకవీయము మున్నగు వానిని చక్కఁగ పరిశీలించుటయేకాక భాషయందు ప్రామా ణికములైన నన్నయతిక్కనాది మహాకవుల కావ్యలక్ష్యగ్రంథ ములను పైవానితో సమీచీనముగా సమన్వయముఁ గావిం చుచు వచ్చెను. వ్యాకరణసూత్రములకును, ప్రామాణికకవి ప్రయోగములకును నైక్యభావము సమకూర్చుట వ్యాకరణరచ నకుఁ బునాదివంటిది. ఈ సమన్వయపద్ధతిని తొలినుండియు

గ్రహించినవాఁ డగుటచేతనే చిన్నయ తరువాతికాలమున బాలవ్యాకరణమువంటి ప్రశస్తగ్రంథమును రచించుటకు సమర్థుఁడైనాఁడు.

## ఆంగ్ల భాషాభ్యాసము.

ఆకాలమున నాంగ్లేయభాషయందే వ్యవహరించు రాజకీయోద్యోగులకు తెనుఁగుదేశమునఁ దెనుఁగుభాష నేర్చుకొనవలసిన యావశ్యకత యేర్పడినది. వారికి తెనుఁగు నేర్పెడు పండితునికి సాటిగనే యాంగ్లేయభాషాజ్ఞాన మావశ్యక మైనది. అయినను మన తెనుఁగుపండితులు సంస్కృతముఁ జదువుకొనినను ఛాందసులగుటచే పాశ్చాత్యభాషయగు నాంగ్లేయభాషను నేర్చుకొనుట నాఁకాలమున నెంతమాత్ర మంగీకరింపరైరి. కొందఱు దానిని మ్లేచ్ఛభాష యని గర్హించిరి. కాని చిన్నయసూరి లోకజ్ఞుఁ డగుటఁజేసి దేశకాలపరిస్థితుల గమనించి తాను గొప్ప సంస్కృతపండితుఁడయ్యు నాంగ్లేయభాషను నేర్చెను. ఈవిధముగా నాంగ్లభాషాప్రాముఖ్యమును గుర్తించు టాతని నవీనదృక్పథమున కొక తార్కాణము. ఈ భాషాపరిచయముతో కంపెనీవారి ప్రభుత్వమునం దుండు నున్నతోద్యోగులతో స్నేహభావమును బెంపొందించుకొని చిన్నయసూరి వారి యనుగ్రహమునకుఁ బాత్రుఁడైనాఁడు. ఇంతియేకాక యీనాఁటి కొంతమంది రచయితలవలె తమ కేదో భాషాజ్ఞానము కలుగఁగానే గ్రంథరచన కుపక్రమించు

నట్లుగాక నికరమును, నిర్దుష్టమును, నిరవద్యమును నగు పాండిత్యము పండఁబాఱిన వెనుకఁగాని చిన్నయసూరి గ్రంథరచన కుపక్రమింపలేదు. విద్యాపరిజ్ఞానముతోఁగూడ ననుభవమును మేళవించి గ్రంథరచన ప్రారంభించుటచే నీతని గ్రంథము లుత్కృష్టములై యలరారుచున్నవి.

ఇట్లుండఁగా క్రీ. శ. ౧౮౩౬-వ సంవత్సరమున వీరి తండ్రి వెంకటరంగరామానుజాచార్యులవారు కాలగతి నొందిరి. అప్పటికి వారి వయస్సు నూటపది సంవత్సరములు. సుప్రీముకోర్టున న్యాయాధిపతిగనున్న తండ్రి కాలధర్మమునొందుటచే సంసారభారమంతయు చిన్నయసూరిపైఁ బడెను. వెంటనే యుద్యోగప్రయత్నము చేసినను లభ్యము కాకపోవుటచే కొంతకాలము వీరి కుటుంబమునకు భోజనవసతులుకూడ సరిగా లభింపని పరిస్థితు లేర్పడెను. చిన్నయసూరి యట్టి క్లిష్టపరిస్థితులలోకూడ తన సాహిత్యవిద్యాపరిశ్రమను సాగించుచు కుటుంబ భారమును నిర్వహించెను. ఇది సులభసాధ్యమైన పని గాదు. కాని చిన్నయసూరి దైవభక్తిపరాయణుఁ డగుటచే నీ విపదంభోధి నెదుర్కొని యచిరకాలములోనే దానిని తరింపఁగలిగెను.

ఆతని యదృష్టవశమున చెన్నపురియందలి 'ఆప్టను' మిషను పాఠశాలయందు కొలఁదివేతనముపై నొక యుపాధ్యాయపదవి లభించెను. ఇంతేకాక యీతని కాంగ్లభాషాపరిజ్ఞాన ముండుటచే కొందఱు క్రైస్తవమతాచార్యు లీతనివద్ద

తెనుఁగుపాఠములు చెప్పించుకొనుచుండిరి. సాహిత్యవిద్యయందనుపమానపాండిత్యము కలవాఁడగుటచే చిన్నయసూరివద్ద పెక్కుమంది విద్యార్థులు పాఠములు నేర్చుకొని పండితపరీక్షలకు వెళ్లెడివారు. ఆ పరీక్షలలో తక్కిన గురువులవద్ద నేర్చినవారికన్న చిన్నయశిష్యులు ప్రతిపరీక్షయందును ప్రథములుగా నుత్తీర్ణు లగుచుండిరి. దీనిచేత నీతని కీర్తిచంద్రికలు చెన్నపురిలో నలుదెసల వ్యాపింపఁజొచ్చినవి. ఈతని పాండిత్యప్రతిభ, బోధనాశక్తి, విషయవైశద్యము, విచక్షణాపరిజ్ఞానము నాకాలమందలి పండితమండలినేకాక పురప్రముఖులలో ముఖ్యు లగు శ్రీ గాజుల లక్ష్మీనరసింహముశ్రేష్ఠి, న్యాయాధిపతి కలువలపల్లి రంగనాథశాస్త్రి, పచ్చయప్పధర్మసంస్థ ప్రధానాధికారి కోమలేశ్వరపురపు శ్రీనివాసపిళ్ళె మున్నగు వారల నాకర్షించి ముగ్ధులను గావించినది. ఆ కాలమునందు చెన్నపురిలో జరుగు పండిత సభలకుఁగూడ నీతని నాహ్వానించుచుండెడివారు.

# 4. పచ్చయప్ప పాఠశాలా పండిత పదవి

చిన్నయసూరి పండితసభల కాహ్వానింపఁబడుట కవకాశము నాతఁడు పాఠశాలలో ప్రవేశించిన రెండవయేఁటనే తటస్థించినది. క్రీ. శ. ౧౮౩౭-వ సంవత్సరమున విక్టోరియా చక్రవర్తినీపట్టాభిషేకమహోత్సవము లండను నగరమున జరిగెను. అప్పటికి హిందూదేశమున ఈస్టిండియాకంపెనీవారి యధికారమే చెల్లుబడి యగుచున్నను నామె సామ్రాజ్యాధికారిణి గావున చెన్నపురినిగూడ నొక మహాసభ యేర్పాటు గావింపఁబడినది. ఆ సభయం దనేకులు విద్వాంసులు, విద్వత్కవులు విక్టోరియాచక్రవర్తిని నాశీర్వదించుచు రచనలను గావించిరి. తెనుఁగుభాషలో చిన్నయసూరి 'విక్టోరియాచక్రవర్తినీమకుటాభిషేకమహోత్సవ పద్యరత్నము' లను పేరతొమ్మిదిపద్యములు రచించి చదివెను. అవి సభ్యులను విశేషముగా నాకర్షించినవి. నిశితమైన పాండిత్యప్రకర్షకుఁ దోడుగా నిరుపమాన మగు కవితారచనకూడ కలుగుటచే చిన్నయసూరి ప్రతిభ సర్వేసర్వత్ర వ్యాప్తిఁ జెందినది. ఆప్టనుపాఠశాలయందలి పండితపదవి యాతని పాండిత్యమునకు సరిపోయినది కాదనియు, నంతకంటె నున్నతమును, ప్రసిద్ధమును నగు స్థానము లభింపవలె ననియు ప్రజలు భావించుచుండిరి.

ఇంతలో చిన్నయసూరిజీవితములోని యుచ్చదశ ప్రారంభమగుట కనువగు పరిస్థితి యేర్పడినది. దానకర్ణుఁ డని ప్రసిద్ధిఁజెందిన పచ్చయప్పమొదలిపేర స్థాపించిన విద్యాసంస్థ యందు పండితుఁ డొకఁడు కావలసివచ్చెను. అప్పటికి విద్యా సంస్థకు నధికారవర్గ మొకటి యేర్పడియుండెను. దాని కధ్యక్షులు శ్రీ కోమలేశ్వరపురపు శ్రీనివాసపిళ్ళెగారు. వారు పుట్టుకచే తమిళులయ్యును తెనుఁగుభాషయం దత్యంతాదరాభిమానములు గలవారు. వారు చిన్నయసూరికిఁగల యాంధ్ర భాషాపాండిత్యము తొలుతనే గుర్తించినవారగుటచేత నాతని పిలిపించి పచ్చయప్ప పాఠశాలయందు పండితపదవి నొసఁగిరి. ఇది క్రీ. శ. ౧౮౪౪-వ సంవత్సరప్రారంభమున జరిగినది.

ఆకాలమునాఁటికి మదరాసు విశ్వవిద్యాలయ మేర్పడక పోవుటచే నున్నతపాఠశాల లనుపేర మూఁడుపాఠశాలలు మాత్రమే చెన్నపురమున నుండెడివి. అవి ౧. రాజధాని యున్నత పాఠశాల, ౨. పచ్చయప్ప యున్నతపాఠశాల, ౩. క్రైస్తవోన్నతపాఠశాల. ఇచ్చట నున్నతవిద్య గఱపఁబడుటచే వీని కాపేరు వచ్చినది. ఆనాఁ డున్నతవిద్య యనఁగా నేఁటి కళాశాలలలోఁ గఱపఁబడు పట్టపరీక్షాదివిద్యలని యెఱుఁగఁదగినది. విశ్వవిద్యాలయ స్థాపనమైన వెనుక కళాశాలల స్థాపనకూడ జరిగినది. నాఁటినుండి కళాశాలా విద్యల కున్నత పాఠశాలలు సోపానములైనవి. ఆ పాఠశాలయందు చిన్నయసూరి నాలు

గేండ్లు పనిచేసినట్లుగా నా పాఠశాల సాంవత్సరిక నివేదికలు తెలుపుచున్నవి.

అచ్చట పండిత పదవి నిర్వహించుటయేకాక యాతఁడు గ్రంథ రచనను చేయుచుండెడివాఁడు. ఆ కాలమున పాఠశాలా వార్షికోత్సవములయందు పచ్చయప్ప మొదలియారినిఁ గూర్చి పండితులు పద్యములు,శ్లోకములు వ్రాయుచుండెడివారు. అందు పాల్గొని చిన్నయసూరి తెనుఁగు పద్యములేకాక సంస్కృత శ్లోకములు వ్రాసియున్నాఁడు.* ఆ పద్యములలో సభలో మెప్పు గొన్నకొన్నింటికి పారితోషికములుకూడ నిచ్చెడివారు. అట్టి పారితోషికములు చిన్నయసూరియే ప్రతి వత్సరమును తప్పక పొందెడివాఁడు. అందుచేత సమకాలికులకు, సహోధ్యాయులకు నీతనిపై నీర్ష్యాభావ మంకురించినది. పైఁగా చిన్నయసూరి బ్రాహ్మణేతర కులమునకుఁ జెందిన సాతాని వైష్ణవుఁడగుటచే కేవలము విశిష్టాద్వైత సంప్రదాయమును పాటించు వైష్ణవ పండితులును, నితర స్మార్త పండితులునుగూడ చిన్నయసూరి నిత్యానుష్ఠానపరత్వము, నియమ విశేషము గ్రహింపకయే ద్వేషింపసాగిరి. చిన్నయసూరి కవితాకమనీయతను గూర్చి యాతని పద్య రచనలు అను శీర్షిక చూడనగును.

---

* 'పచ్చయప్పను' గూర్చిన ప్రశంసా పద్యములు, సంస్కృత శ్లోకములు 'పచ్చయప్ప యశోనృప మండనము' అను పేర గ్రంథ రూపమున ప్రకటితమైనవి.

పద్య రచనయందేకాక వాక్యములు చెప్పుటయందును చిన్నయసూరి మిగుల శ్రద్ధవహించి ప్రాచీన సాహిత్యము నందలి కేవల వ్యాకరణచ్ఛందోలంకార విషయములేకాక మూల కథా విన్యాసము, అర్థసంగ్రహము, మనోహరశైలి, లక్ష్య లక్షణ సమన్వయము మున్నగువానిని గూర్చి విద్యార్థులకు సుగమముగా నుండునట్లు బోధించెడివాఁడు. తానుకూడ నొక విద్యార్థివలె రేయింబవళ్ళు పరిశ్రమచేయుచు తనయొద్ద చదివిన శిష్యులను తన్ను మించినవారినిగా చేయుటకు ప్రయత్నించెడివాఁడు. ఇట్టి యున్నతాశయములతో నున్నత విద్య నేర్పిన చిన్నయసూరివంటి పండితుఁడు నేఁటి యధ్యాపక బృందమున కాదర్శప్రాయుఁడుగదా!

# 5. రాజధానీ కళాశాల పండిత పదవి

చిన్నయసూరి వాఙ్మయ ప్రపంచమున చిరస్థాయిముగు కీర్తిఁ బడయుటకు చెన్నపురి రాజధానీ కళాశాల పండిత పదవియే కారణభూతమైనది. కళాశాలలయందు పండిత పదవి యానాఁడు నేఁటివలె కేవలము సాహిత్య పాఠములకే సంబంధించినది కాదు. అంతకంటె నుత్కృష్టములగు న్యాయ శాస్త్రము, తర్కము, వ్యాకరణము విద్యార్థులకు బోధింప వలసిన యావశ్యకత యుండెడిది. చెన్నరాజధానిలో నీ కళా శాల పండిత పదవియొక్క చరిత్రము మనము పరిశీలించి నచో చిన్నయసూరి కాలమునాఁటి కా పదవి యెట్టి గౌరవ పరిణామము పొందినదో గ్రహింపఁగలము. దీనికిముందు రాజ ధానీ కళాశాల తెలుఁగుశాఖ చరిత్ర తెలిసికొనుట యావశ్య కము.

చెన్నపురిలో కంపెనీ ప్రభుత్వమువారు క్రీ.శ. ౧౮౧౨-వ సంవత్సరమున ఫోర్టుసెంటుజార్జికోటలో నొక కళాశాలను స్థాపించిరి. దీనిలో ప్రభుత్వమున రాజకీయశాఖలో పనిచేసెడు నాంగ్లేయులకు మాత్రమే దేశభాషలగు తెలుఁగు, తమిళ భాషలలోను, భారతీయ భాషయగు సంస్కృతములోను శిక్షణ నిచ్చెడివారు. వారికేతప్ప స్వదేశీయులకందు విద్యనేర్చుట కవకాశములేదు. మఱియు నాయుద్యోగులే న్యాయస్థానము లలో తీర్పుచెప్పు అధికారము కలవారగుటచే హిందూ ధర్మ

శాస్త్రమునందుకూడ వారు పరిశ్రమచేయుట యావశ్యకమైనది. పండితులుకూడ నా శాస్త్రమున ప్రావీణ్యము గలవారై యుండిరి. ఇట్టి పండితులలో మొదట నీ కళాశాలయందు తెలుఁగు భాషలో నియమితులైనవారు శ్రీ వేదము పట్టాభిరామశాస్త్రిగారు. వీరికి సహాయకారియగు పండితునిగా శ్రీ రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారిని నియమించిరి. ఇందులో ప్రధాన పండితునికి నాకాలమున జీతము నెలకు నూటడెబ్బదియైదు రూప్యములు. ఆ కాలమున తెలుఁగు పండితునికి నూటడెబ్బదియైదు రూప్యములే జీతము ననుసరించి నచో నీకాలమున ౧౨౦౦ రూప్యముల వేతనము నియ్యవలసి యుండెను. దీనినిబట్టి యా కాలమున నాపదవి కెంత గౌరవముండెడిదో తెలియుచున్నది కదా!

పట్టాభిరామశాస్త్రిగారు ౧౮౧౬-వ సం.లో తెనుఁగున పద్యాంధ్రవ్యాకరణమును 'పట్టాభిరామ పండితీయము' మను పేరున రచించిరి. మఱియు 'ధాతుమాల' యను గ్రంథమును రచించిరి. ఇవి రెండును ముద్రితములు. గురుమూర్తిశాస్త్రిగారు క్రీ. శ. ౧౮౩౬-వ సంవత్సరమున నొక విపులమగు తెనుఁగు వ్యాకరణమును రచించి యానాఁడే ముద్రించిరి. ఈ వ్యాకరణ గ్రంథములు చిన్నయసూరి బాలవ్యాకరణ రచనమునకు నెట్లు మార్గదర్శకములైనవో రాఁబోవు ప్రకరణములలో చదువుదము.

గురుమూర్తిశాస్త్రిగారు క్రీ. శ. ౧౮౩౨ లో చనిపోయిరి. వీరి వెనుక పుదూరి సీతారామశాస్త్రులవా రా

స్థానమున నియమితులైరి. వీరు పనిచేయుచుండఁగా, క్రీ. శ. ౧౮౪౦ లో నీ కళాశాల నెత్తివేసి కంపెనీ ప్రభుత్వము వారు రాజధాని యున్నత పాఠశాలను స్థాపింపఁ జేసిరి. దీని యందు విశేష మేమనఁగా, స్వదేశీయులగు వారికిఁగూడ నిందు విద్య నేర్చుకొనుట కవకాశమియ్యఁబడినది. ఇదియే నేఁటి 'రాజధాని కళాశాల'- అనఁగా ప్రెసిడెన్సీ కాలేజికి మూలమైన సంస్థ. క్రీ. శ. ౧౮౫౭ లో మదరాసు విశ్వవిద్యాలయము ప్రారంభమైన వెనుక నిది కళాశాలగా రూపొందినది. అందు ప్రథమ శాస్త్రపరీక్ష, పట్టపరీక్ష తరగతులు నెలకొల్పఁబడినవి. ఆనాఁటికి విశ్వవిద్యాలయమున కంతటికి నిది యొక్కటే కళాశాల. ఈ కళాశాలలో పూర్వమువలెనే తెలుఁగు, తమిళము, సంస్కృతము మున్నగు శాఖలయందు పండితులు కావలసివచ్చినది. కాని పూర్వపురీతిగాఁగాక యే భాష బోధించెడువా రాభాషాసాహిత్యపాఠములనే బోధింపవలసిన నియమ మేర్పడినది. అనఁగా పాఠ్యప్రణాళికలో శాస్త్రము, సాహిత్యము వేఱువేఱుగా విభజింపఁబడినవి. అయినను తెలుఁగుపండితులకు మాత్రము ఛందోవ్యాకరణాలంకారములయందు, సంస్కృతసాహిత్యమునందు నసాధారణపాండిత్య మావశ్యకమని నిర్ణీతమైనది.

ఈ నూతనపాఠశాలయందుఁగూడ సీతారామశాస్త్రిగారే తెనుఁగుపండితులై యాతేండ్లకాలము నిర్వహించిరి. కాని క్రీ. శ. ౧౮౪౨ లో నీ పండితపదవియం దొక నూతనాధ్యాపకుని నియమించు పరిస్థితి యేర్పడినది. ఈ కళాశాలలో

నింగ్లీషుభాష ప్రధాన భాషగా నుండి యుత్తమ సాహిత్యపద్ధతుల పైని శిక్షణ గఱపఁబడుచుండుటచే దేశభాషాపండితులకుఁ గూడ కొంత యాంగ్లభాషాపరిచయము కలుగుట యావశ్యక మైనది. దీనికొఱకు క్రీ. శ. ౧౮౪౭ లో కేవల ప్రాచీనపండితులై యాంగ్లభాష నెఱుఁగని సీతారామశాస్త్రిలవారి నాస్థానమునుండి తప్పించి, క్రొత్తపండితుని కొఱకు ప్రకటన గావించిరి. సీతారామశాస్త్రిలవారు, తెనుఁగువా రాబాలగోపాలము ననవరతము నభ్యసింపఁదగిన 'పెద్దబాలశిక్ష' యను గ్రంథమును ౧౮౪౯ లో రచించి ప్రకటించిరి. వీరే మొదట తెనుఁగువ్యాకరణమును ప్రశ్నోత్తరరూపముగా విద్యార్థులకు సులభముగా బోధపడునట్లు 'ప్రశ్నోత్తరాంధ్రవ్యాకరణము' అనుపేర రచించి క్రీ. శ. ౧౮౫౨ లో ప్రకటించిరి.

రాజధానీ కళాశాలాంధ్రపండితపదవి ప్రకటన వెలువడినతోడనే పండితులందఱును చిన్నయసూరిని ఈ పదవి నభ్యర్థించుచు నొక విజ్ఞాపనము నాకాలమున కళాశాల కధ్యక్షులును, రాజధాని విద్యాశాఖాధికారియు నగు శ్రీ A. J. ఆర్బత్ నాటు దొరగారికి పంపు మని ప్రోత్సహించిరి. చిన్నయసూరి యట్లే యొక విజ్ఞాపనపత్రమును పంపెను. కాని యీనాఁటివలె నాఁ డీపండితపదవు లధికారుల హస్తగతములు కావు. ప్రసిద్ధులగు విద్వాంసులసభలో పాండిత్యపరీక్ష యం దభ్యర్థి యుత్తీర్ణుఁడైననే యీపదవి లభించెడిది. ఈ సూత్రము ననుసరించి చిన్నయసూరియు నట్టి విద్వత్సభాముఖమున తన యభ్యర్థిత్వము సమర్థించుకొనవలసివచ్చెను.

అట్టిసభకు విద్యాధికారియగు ఆర్బత్ నాటుదొరగారు ముగ్గురు మహావిద్వాంసు లగు పండితులను పిలిపించి, చిన్నయ సూరిగారిని పరీక్షింపఁగోరిరి. కాని యాసభలోనే పురాణము హయగ్రీవశాస్త్రిగా రను పండితుఁడు తానుకూడ నొక యభ్యర్థిగా నుందు నని సభలో వెల్లడించెను. అది చట్టమునకు కొంత విరుద్ధమైనను పండితుల ప్రోద్బలముచే ఆర్బత్ నాటు దొర యంగీకరించెను. వీరిదువురను పండితులు పరీక్షించిరి. అందులో చిన్నయసూరిగారినే ప్రథమగణ్యునిగా పరీక్షితు లేకగ్రీవముగా తీర్మానించిరి. తత్క్షణమే యాతఁడు రాజధాని కళాశాలలో ప్రధానపండితుఁడుగా క్రీ. శ. ౧౮౪౭ లో నియమితుఁ డయ్యెను.

అందు నియమితుఁడైన దినమునుండియు చిన్నయసూరి కడు జాగరూకతతో తన పండిత పదవి నిర్వహించుచు నచిర కాలములోనే యార్బత్ నాటు దొరవారి యాదరాభిమానము లను చూఱగొనెను. విశ్వవిద్యాలయమునకు మూలభూతమగు నీ కళాశాలాధ్యక్షుఁడే యాకాలమున మదరాసు రాజధాని కంతటికి విద్యాశాఖాధికారిగ నుండుటచేత ఆ కళాశాల పండి తులకు, వారి గ్రంథములకు దేశములో విశేషమగు పలుకు బడి, వ్యాప్తి యుండెడివి. ఆర్బత్ నాటు దొర దేశ భాషా పండితులను ప్రత్యేకముగా గౌరవించు స్వభావము కలవాఁడు. ఆ కాలమున కళాశాల పండితులందఱు 'శాస్త్రి' యను నుప నామమును ధరింపవలసిన నియమము కలదు. తెనుఁగుదేశపు సంప్రదాయము ననుసరించి వైదిక శాఖలో బ్రాహ్మణులు

మాత్రము పుట్టుకచేత 'శాస్త్రి' నామమును ధరింతురు. అది వంశ పారంపర్యముగా వచ్చుచుండును. నియోగిశాఖలోనివా రట్టి శాస్త్రి పదమును పండిత వృత్తిలోనున్నను ధరింపరు. కాని చిన్నయసూరికి ముందు ఫోర్టుసెంటుజార్జి కళాశాలలో పండితులై ప్రసిద్ధిచెందిన రావిపాటి గురుమూర్తిశాస్త్రిగా రాఱువేలనియోగి. అతఁడును కళాశాలా నిబంధనల ననుసరించి 'శాస్త్రి' యని వ్యవహరించుకొనెను.

## చిన్నయ - 'సూరి' బిరుదము

చిన్నయసూరికిని ఉద్యోగములో ప్రవేశించునాఁటికి 'చిన్నయ్య' యనియే వ్యవహారము. ఒకనాఁడు నార్బత్ నాటూ దొరగారు రాతనిఁ బిలిచి, "నీవు 'శాస్త్రి'యను నుపపదము నేల ధరింపవే"దని యడిగిరఁట. చిన్నయసూరి "అయ్యా! నేను పుట్టు శాస్త్రులను కాను; పెట్టు శాస్త్రులను కాను. కాఁబట్టి శాస్త్రినామమును ధరించుటకు జన్మముచే ననర్హుఁడను." అని జవాబిచ్చెను. "మఱి యేది పెట్టుకొనవచ్చు" నని దొరవారు తిరిగి ప్రశ్నించిరఁట. చిన్నయ 'సూరి' అను పదము నుపయోగింపవచ్చు నని సలహానిచ్చెను. అంతట నార్బత్ నాటుదొర యాంగ్లేయభాషలో 'చిన్నయ సూరి' అను నక్షరములతో చెక్కఁబడిన సువర్ణహస్త కంకణమును సీమనుండి తెప్పించి యాతనిని బహూకరించెను. ఈ కంకణ ప్రదానము జరిగిన నాఁటనుండి 'చిన్నయ సూరి' అను వ్యవహారమే ప్రబలమైనది. ఇది యాతఁడు కళాశాలలో ప్రవేశించిన కొంతకాలమునకు తర్వాత జరిగినది. ఏలయన, క్రీ. శ. ౧౮౪౭ లో నీతఁడును,

వైయాకరణము రామానుజాచార్యులవారును కలిసి ముద్రించిన 'ఆంధ్ర మహాభారత' ప్రథమముద్రణ ముఖపత్రమున చిన్నయ యనియే వ్రాయఁబడియున్నది. ౧౮౪౭ చివరి భాగమునుండి యీ పేరు ప్రసిద్ధి గాంచినది.

## సూరి ప్రతిభా ప్రదర్శనము

దినదినప్రవర్ధమానమగుచున్న చిన్నయసూరి కీర్తిని, ప్రతిష్ఠను అప్పటి సమకాలికు లగు పండితులు సహింప లేక, యీతఁ డాపదవి కసమర్థుఁ డని నిరూపించుటకు నొక పన్నాగమును పన్నిరి. గౌరవనీయులగు రంగనాథ శాస్త్రి గారి యింటియొద్ద నొక పండితసభ నేర్పాటుగావించి యక స్మాత్తుగా చిన్నయసూరి నచ్చటి కాహ్వానించిరి. రంగనాథ శాస్త్రిగారు న్యాయశాస్త్రమునం దేకాక సంస్కృతభాష యందు, నితర శాస్త్రములయందు ప్రవీణత గలవారు. వీరికి పదునైదుభాషలలో పాండిత్య ముండెను. ఆకాలమున దేశ భాషల విషయమై ప్రభుత్వమువా రీతనితోనే సంప్రతించు చుండిరి. అట్టివారి యధ్యక్షతక్రింద సూరిగారి నలంకార శాస్త్ర విషయమై యుపన్యసింపుమని కోరిరి. పండితుల కందఱకును సూరిగారికి వ్యాకరణమే కాని యలంకార మేమాత్రమును తెలియదను నభిప్రాయ ముండెడిది. ఉపన్యాసము ప్రారంభించు సరికి మధ్యాహ్నము మూఁడుగంటలైనది. సూరి వేద కాలమునుండి యలంకారవిషయమును, దాని వ్యాప్తిని తెలియ పఱచ నారంభించెను. గంగాప్రవాహమువలె నున్న యాతని యుపన్యాసధోరణి నాకర్ణించి సభాసదు లాశ్చర్యచకితులైరి.

ఇంతలో సాయంకాలమయ్యెను. చీకటిపడఁ జొచ్చెను. కాలము నెవరు గమనింపకుండిరి. పనికత్తె దీపము వెలిఁగించెను. ఉపన్యాసము జరుగుచునే యుండెను. వినువారికి విసుగుపుట్టుట లేదు; కూర్చున్నవారు లేచుటలేదు; సభ్యులకు తనివి దీఱినట్లుగ లేదు. 'భోజన సమయ' మని సూపకారుని నివేదనమువలన కాలాతిక్రమణము నధ్యక్షులగు రంగనాథశాస్త్రిలవారు గుర్తించిరి. సభామధ్యమున వారు లేచి, శ్రీసూరిగారియెడల తమ కిదివఱకున్న యభిప్రాయమును వదలుకొంటి మనియు, నానాఁటి యుపన్యాసముతో వారి పాండిత్యప్రకర్ష సర్వతో ముఖమైన దని గ్రహించితి మనియు చెప్పి నాఁటి సభ ముగించిరి. తక్కిన పండితులుగూడ సూరిగారియం దానాఁటినుండి ద్వేష భావమును విడిచి మిక్కిలి గౌరవమర్యాదలతో ప్రవర్తింపఁ జొచ్చిరి.

## సూరి దినచర్య

చిన్నయసూరి కళాశాలలో ప్రవేశించినదాదిగా నాతని దినచర్య యిట్లుండెను. అతఁడు తెల్లవాఱుఝామున లేచి కాలకృత్యములు నిర్వహించి మతసంప్రదాయికాచార నిష్ఠతో సాహిత్యవ్యాసంగము చేసెడివాఁడు. ఏదేని యొక విచిత్ర ప్రయోగమునుగాని, నూతనమైన పదములుగాని, విశేషముగల భాషాసంప్రదాయమునుగాని గ్రహింపకుండ నాతఁడు భోజనమునకు లేచెడివాఁడు కాఁడు. సకాలమునకు కళాశాలకు వెళ్లి పాఠములను బోధించెడివాఁడు. విరామకాలమునందు కళాశాలపుస్తకభాండాగారమున నున్న ప్రాచీనతాళపత్రగ్రంథ

ములను, లిఖిత పుస్తకములను తదేకధ్యానముతో పరిశీలించెడి వాఁడు. ఇంకొక విశేష మేమనఁగా, తాను చదివి గ్రహించిన విషయముల నప్పుడే వ్రాసి భద్రపఱచెడి పద్ధతి నాతఁ డవలంబించెను. తాను పాఠము చెప్పెడు గ్రంథములలోని లోపములను కనిపెట్టి, వాని నున్నతవిద్య కనుకూలమైనరీతిగ సంస్కరించు రచనలను కావించెడివాఁడు. ఈరీతిగా నొక పదియేండ్లకాల మచ్చట పదవిని నిర్వహించెను.

## మదరాసు విశ్వవిద్యాలయ స్థాపనము

ఇంతలో క్రీ. శ. ౧౮౫౭-వ సంవత్సరము ప్రారంభమయ్యెను. ఈస్టిండియాకంపెనీప్రభుత్వ మంతరించి దేశపరిపాలనము సామ్రాజ్యాధికారిణియగు విక్టోరియాచక్రవర్తిని హస్తగత మయ్యెను. దానితో విద్యాశాఖయందు నవీనపద్ధతులు పరిణతిఁ జెంద నారంభించినవి. ఆ సంవత్సరముననే యున్నతవిద్యలకు కేంద్ర మగు విశ్వవిద్యాలయము మదరాసున స్థాపితమయ్యెను. అందు ప్రవేశపరీక్ష (మెట్రిక్యులేషను), ప్రథమశాస్త్రీయపరీక్ష (ఎఫ్. యే.), పట్టపరీక్ష (బి. యే.) అను శాఖ లేర్పఱుపఁబడినవి. పాఠ్యభాగము లన్నియు నాంగ్లేయ భాషలో బోధింపఁబడుచుండెడివి. దేశభాషాపరిజ్ఞానముకూడ నావశ్యకమే కాఁబట్టి తెలుఁగు, తమిళము విద్యార్థులు పఠింపవలసిన నియమ మేర్పడినది. కాని ఇంగ్లీషు ప్రధానభాష; దేశభాషలు ద్వితీయభాషలు. ఇంతకుముందు దేశభాషలే ప్రధానముగా నుండి ఇంగ్లీషుభాష యుద్యోగనిర్వహణమునకు మాత్ర ముపయోగపడుచుండెడిది. విశ్వవిద్యాలయస్థాపనతో

ఆంగ్లేయభాష యుత్తమసాహితీశిక్షణకొఱకే కాక, పాశ్చాత్య సంస్కృతి, పాశ్చాత్య దేశములతో సంబంధము మనకు కలుగుట కనుకూలించినది. ఆ భాషాపరిజ్ఞానముకలవారికే ప్రభుత్వమున నున్నతోద్యోగములు, అధికారపదవులు లభించుటచే చెన్నపురమునందును, నితర ప్రదేశములయందును నసంఖ్యాకముగా నింగ్లీషుచదువు విద్యార్థులకొఱకు కళాశాలలుకూడ స్థాపితములైనవి. కాని వీనియన్నింటికంటెను ముందుచెప్పిన రాజధాని కళాశాలయే విశ్వవిద్యాలయమున మొదటికళాశాలయైనది. ఆనాటికింకను తక్కినచోట్ల కళాశాల లేర్పడలేదు. కాబట్టియే చిన్నయసూరి మదరాసు విశ్వవిద్యాలయ ప్రధానాంధ్రపండితుఁ డయ్యెను.

అప్పుడుకూడ సూరిగారి కభిమానులగు ఆర్బత్ నాటు దొరవారే విశ్వవిద్యాలయ కళాశాలాధ్యక్షులుగా నుండిరి. వారియందుండు నపారగౌరవముచేత చిన్నయసూరి తన గ్రంథములను వారికే కృతియిచ్చియున్నారు. ఈ విధముగా మఱి నాలుగేండ్లకాలము చిన్నయసూరి అసమానసామర్థ్యముతో పండిత పదవిని నిర్వహించి క్రీ. శ. ౧౮౬౧-వ సం॥ డిసెంబరు నెలలో రాచపుండు కలుగుటచే నుద్యోగమునుండి విరమించి, ౧౮౬౨ మార్చి నెలలో కీర్తిశేషుఁ డయ్యెను.

## చిన్నయసూరి రచనలు

చిన్నయసూరి యొక సాధారణమైన తెనుఁగుపండితుఁడే యైనను నాతని రచన లాంధ్రవాఙ్మయ ప్రపంచమున నాచంద్రార్కము నిలుచునవియై, యాతని కమరత్వమును సిద్ధింపఁ జేసినవి.

బాల్యమునుండి యహోరాత్రము లకుంఠితదీక్షతో నొనర్చిన భాషాపరిశ్రమ చేతను, పాండితీగరిమ చేతను, బోధనానుభవము చేతను, లక్ష్యలక్షణసమన్వయపరిజ్ఞానము చేతను తన రచనలకు మెఱుఁగు పెట్టి, దిద్ది, తీర్చి సర్వాంగసంపన్నములుగా నొనర్చెను. దీనికితోడాతని యాత్మవిశ్వాసము, నాధ్యాత్మికపరిజ్ఞాన మాతని రచనల కొక సంపూర్ణత్వము సంపాదించినవి. విశ్వవిద్యాలయస్థాపనఫలితముగా ప్రాచ్యపాశ్చాత్యసంస్కృతుల సమ్మేళనమువలన నేర్పడిన నవీనయుగావిర్భావవికాసమునకు చిన్నయసూరి యెట్లు తోడ్పడెనో రాఁబోవుప్రకరణములఁ జదువుదము.

# 6. వచనరచన

తెనుఁగుభాషలో నవ్యయుగవికాసమునకు ముఖ్యచిహ్నమగు వచనరచనయందు చిన్నయసూరి యందెవేసిన చేయి. ఆంధ్రవచన వాఙ్మయమున చిన్నయసూరిరచన యొక్క ప్రత్యేక ఘట్టమగుటచేత నంతకుముందు ప్రవర్తిల్లిన వచన వాఙ్మయస్వరూపము నెఱుఁగుట మనకు కర్తవ్యము.

## తెలుఁగు వచనరచన - పూర్వస్థితి

ఏవాఙ్మయమునందైనను తొలుత పద్యవాఙ్మయమే పరిణతి కెక్కును. వచనవాఙ్మయము కాలక్రమమున రాజకీయసాంఘికాది వ్యవస్థలనుబట్టి పరిణామమునుపొంది విపులభావవిన్యాసరూపమున శాఖోపశాఖలుగా వృద్ధిపొందును. భావములను సులభతరమగు రచనారూపమున పొందుపఱచుటకు వచనమే ప్రధాన సాధనము. తెనుఁగున పద్య, వచన సమ్మిళితమగు చంపూకావ్యపద్ధతియే కవులకు నాలంబనమైనది. అందునను వచన మనఁగా నేఁటివలె కేవలము భావప్రకటనకై కూర్చిన వాక్యసముదాయములు కావు. ఆ వచనము తాళలయానుగుణముగా నడచుచు పాటగా పాడుటకు వీలుగా నుండెడిది. వచనమైనను 'వృత్తగంధి', అనఁగా వృత్తమువలె వాసింపఁజేయునది, యనఁగా చదువ మొదలిడఁగానే పద్యపాద మను లక్షణము కలిగియుండెడిది. ఈ పద్ధతి ననుసరించియే నన్నయభట్టారకుఁడు తన భారతమున వచనము మొదలిడినపుడు పద్యపాదమువలె తోఁపింపఁజేసియున్నాఁడు. తరువాతి తిక్కనాదికవులు వర్ణనలు

చేసినచోట సంస్కృతపదము లుపయోగించి పైసంప్రదాయ మును కొంతవఱకు పోషించిరి.

తెనుఁగున మొదటి వచనగ్రంథములని చెప్పఁదగినవి కృష్ణమాచార్యుని 'సింహగిరినరహరివచనములు', 'శఠగోప విన్నపములు'. గ్రంథకర్త కాకతీయ రాజగు ద్వితీయప్రతాప రుద్రుని కాలములో, క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమున నుండెను. ఇతఁడే వచనవాఙ్మయప్రథమాచార్యుఁడు. కాకతీయుల వెనుక శ్రీనాథయుగమున, నావెనుక కృష్ణరాయలయుగమున ప్రబంధవాఙ్మయమే యపారముగా పెరిఁగినది. ఆకాలములో కొన్నివచనగ్రంథములు పుట్టినను నవి కేవల శాస్త్రవిషయము లనే బోధించుచు వ్యావహారికరూపమున నుండినవి. క్రీ. శ. ౧౬౦౦ వఱకును వచనరచన పైరీతిగనే వెలయుచుండెను.

### దక్షిణాంధ్రవాఙ్మయము - వచనరచన

సలక్షణమగు గ్రాంథిక వచనరచన సమీచీనముగా ప్రారంభమైనది దక్షిణదేశమున, మధురనాయకుల కాలము నుండి యని చెప్పనొప్పును. ఈ దేశమున తంజావూరు మధుర ప్రాంతములను తెలుఁగునాయకు లేలినను నచ్చటి వ్యవహార భాష తమిళముగాని తెనుఁగు కాదు. కాఁబట్టి యా నాయ కులతో నచ్చటనే నెలకొనిన తెలుఁగు రాజకీయోద్యోగుల కును, కవులకును, పండితులకును, తక్కినవారికిని మాతృభాష తెనుఁగైనను నిత్యవ్యవహారమున తమిళభాష తప్పనిసరియైనది. అయినను, పాలకులు తెలుఁగువా రగుటచేత వచన రచన యందు నొక ప్రత్యేకలక్షణము ప్రవర్ధిల్లినది. ఆంధ్రదేశము

నందువలె నిచ్చట తెనుఁగున గ్రాంథికరచన, వ్యావహారికరచన యని రెండువిధములుగా ప్రవర్తిల్లుటకు వీలులేదు. ఏలయన, ప్రజాసామాన్య వ్యవహారభాష తెనుఁగు కాకపోవుటచే గ్రంథ రచనలలో సలక్షణ మగు వచనమునే యుపయోగించవలసిన యావశ్యకత యేర్పడినది. ఈ కారణముచేతనే సలక్షణవచన వాఙ్మయము దక్షిణాంధ్రదేశముననే తొలుత ప్రారంభమైనది. ధేనుమాహాత్మ్యము, శ్రీరంగమాహాత్మ్యము, సారంగధర చరిత్ర, జైమినిభారతము, భారతరామాయణములు, హాలాస్య మాహాత్మ్యము మొదలగు ప్రశస్తవచనగ్రంథములు దక్షిణ దేశమున పుట్టినవియే.

## కుంఫిణీ కాలము

క్రీ. శ. ౧౭౦౦ ప్రాంతమునుండి ఈస్టిండియాకంపెనీ వారితో మనకు సంబంధము కలిగి క్రీ. శ. ౧౮౦౦ నాఁటికి వారిరాజ్యము స్థిరముగా నెలకొన్నవెనుక వచనవాఙ్మయ దృక్పథము మాఱినది. బ్రిటిషు పరిపాలన ప్రారంభములో క్రైస్తవమతాచార్యులు వారి మతప్రచారముకొఱకు క్రైస్తవ మతగ్రంథములను సులభగ్రాహ్య మగు వ్యావహారికశైలిలో వచనరూపమున వ్రాయ మొదలిడిరి. అంతేకాక వ్రాసిన గ్రంథములను ముద్రించు పద్ధతినిఁగూడ వారే దేశమున ప్రవేశపెట్టి వ్యాప్తినొందించిరి. కాని యిందలి శైలి యే గ్రాంథిక వ్యావహారికపద్ధతికిని నతుకుకొనకపోవుటచే నది బైబిలు తెలుఁ గుగా పరిణమించి దానిప్రవర్తకు లనుకొన్నంత ప్రచారము లోనికి రాలేదు.

## సులభ వచన గ్రంథములు

ప్రభుత్వమువారు స్థాపించిన కళాశాలలో రాజకీయో ద్యోగులై యాంగ్లభాష మాతృభాషగాఁ గలదొరలకే తెలుఁగు నేర్చుకొనుట యావశ్యక మగుటచే వారికొఱకు సులభమగు శైలిలో వచనగ్రంథములు వ్రాయవలసివచ్చినది. ఇవి వారు గ్రహింపఁదగిన సౌలభ్యముతో నున్నను కేవల వ్యవహార రచనలు కాక గ్రాంథికరచనతో నొప్పెడివి. ఆ కళాశాలలోని రావిపాటి గురుమూర్తిశాస్త్రిలుగారు విక్రమార్కుని కథలను (1819), పంచతంత్రకథలను (1834) రచించిరి. ఇవి ౧౮౬౦ లోపుగ నొక్కొక్కటి నాల్గుముద్రణము లందిన వన్నచో వాని కెంత వ్యాప్తి యుండెడిదో తెలిసికొనవచ్చును. ఆ కాల ములోనే శుకసప్తతి కథలు, హరిశ్చంద్ర చరిత్ర, విజయ విలాసము, తాతాచార్యుల కథలు మున్నగునవి రచితములైనవి. భాషాపోషకులగు బ్రౌనుదొరవారు సులభ వ్యావహారిక రచనలో కొన్నిగ్రంథములను ప్రకటించిరి. కాని యవియన్నియు భాషయందు ప్రాథమిక శిక్షణపొందుటకు మాత్రమే తగియుండి కేవలము రాజకీయోద్యోగులకే యుపయోగపడెడివి కాని యుత్తమసాహితీద్వారమున భాషాపాండిత్యమును సంపాదింపఁ గోరు విద్యార్థుల కేమాత్రమును సహాయకారులుగా నుండెడివి కావు.

## గ్రాంథిక వచన రచన

మదరాసు విశ్వవిద్యాలయ మేర్పడినవెనుక కళాశాలలో నుత్తమతరగతులకు ప్రౌఢవచనసాహిత్యము కావలసివచ్చినది.

వచనరచనా పథకము మార్పుచెందినది. అప్పటికి దక్షిణదేశమందు వచనరచనలున్నను యవి యజ్ఞాతదశ నుండి. యాకాలపు పండితులకుఁగూడ నందుబాటులో లేకుండెను.* అంతకు ముందుగనే వెలసిన పై వచనరచన లీనూతనప్రణాళికకు సరిపోయినవి కావు. మఱియును విద్యాశాఖయందలి పద్ధతుల ననుసరించి కొన్నివర్ణనలపట్ల నౌచిత్యమును పాటించి త్యజించవలసివచ్చినది. విద్యార్థుల భావిసాహిత్యాభివృద్ధి కనుకూలపడునట్లు నైతికముగను, సుదారముగను, గంభీరభావములను నూతనరీతిని వివరింప సమర్థత గల లాక్షణికగ్రాంథికశైలి గల వచనరచన లత్యావశ్యకములైనవి. ఇట్టిసమయముననే చిన్నయసూరి తన నీతిచంద్రికతో వచనసాహిత్యాకాశమున నుదయించి యశశ్చంద్రికల నలుదెసల వ్యాపింపఁజేసెను.

## నీతి చంద్రిక

'నీతి చంద్రిక' యనునది కథా వాఙ్మయమునకు సంబంధించిన రెండు గ్రంథముల సంపుటీకరణము. ఒకటి నారాయణ పండిత కృతమైన హితోపదేశము; రెండవది విష్ణుశర్మ కృతమగు పంచతంత్రము. ఇవి రెండును సంస్కృత భాషయందు బహు ప్రాచీన కాలమునుండి ప్రపంచ విఖ్యాతిఁ బడసినవి. వీనిలో పంచతంత్రము క్రీ. శ. ఆఱవ శతాబ్దముననే పాశ్చాత్య ఖండములో గ్రీకు భాషలోనికేగాక యరబ్బీ

* ఆనాఁడే కాదు. ముప్పదేండ్లక్రిందటివఱకును నీకాలము వారికే యవి యందుబాటులో లేకుండెడివి.

పారసీక భాషలలోనికిని అనువదింపఁబడియుండెను. రెండును సంస్కృత శ్లోకములతో, మధ్య మధ్య వచనములతో నొప్పు చున్నవి. హితోపదేశమున కేవలము నీతి కథలు మాత్రమే పొందుపఱుపఁబడియున్నవి. కాని పంచతంత్రమున నీతిమాత్రమే కాక రాజనీతికూడ ప్రపంచితమైయున్నది. పై రెండు గ్రంథములలోని విషయములను చిన్నయసూరి పరిశీలించి కావలసిన యంశములను తీసికొని కొంత క్రొత్తదనమును కల్పించి 'నీతి చంద్రిక' యను పేర వచనముగ రచించెను.

పంచతంత్రము పద్యకృతిగా చిన్నయసూరికి ముందు నలుగురుకవులు రచియించిరి. వారిలో ప్రాథమిక రచయిత కృతి లభ్యముకాలేదు. తక్కినవి-దూబగుంట నారాయణకవి, బైచరాజు వేంకటనాథకవి, భానుకవి యనువారు రచించినవి-లభ్యమగుచున్నవి. అవి యన్నియు, కావ్యపద్ధతిని ప్రౌఢరీతి నుండి పండితులకుమాత్రమే యుపయుక్తములైనవి.

నవీనయుగమున వచనరచన ప్రాముఖ్యములోనికి వచ్చుచుండినకాలమున (శ్రీ రావిపాటి గురుమూర్తిశాస్త్రి) గారు సులభవచనశైలిలో నీగ్రంథమును రచించియుండి రని ముందే తెల్పఁబడినది. కాని యాగ్రంథ మున్నతవిద్యార్థి జనోపయోగము గామింజేసియు, నుత్తమసాహిత్యమున కనుకూలింపమింజేసియు నా లోపములను తీర్చుటకు చిన్నయ సూరి గంభీరమును, లక్ష్యలక్షణసమన్వితమును, విద్యార్థిజనాకర్షణీయమును నగు శైలిలో తన నీతిచంద్రికను రచించెను.

చిన్నయసూరి రచనయందలి ప్రత్యేకతను చూపుటకు నిర్వురి రచనలనుండియు సమానఘట్టముల నుదాహరించుచున్నాను:

"ధనము లేకుంటే ఆర్జింపవలయును. ఆర్జించిన ధనమును రక్షింపవలయును. రక్షించిన ధనమును వృద్ధిపొందింపవలయును. వృద్ధిపొందించిన ధనమును సద్వినియోగము చేయవలయును. ఇట్లు చేయనేరనివారి యింట ద్రవ్య మెట్లు నిలుచును? మూఢులైనవారు యీ యర్థమును తెలియనేరరు. సంరక్షణసేయని ద్రవ్య మప్పుడే నశించును. వృద్ధిబొందించని ధనము కొంచెముగా *సెలవుచేసిన కాటుకవలె సమసిపోవును. అనుభవమునకు రాని సొమ్ము కలిగియు లేనిదానివలె సుఖకరముగాదు. ఒకరి కివ్వడము, తా ననుభవించడము, యెవరైన యెత్తుకొనిపోవడము, యీ మూఁడున్ను ధనము పొయ్యేటందుకు దోవలు. కాఁబట్టి యెవఁడు తన ధనము నొకరి కివ్వక తా ననుభవించఁడో వాని ధనమును యెవరైన యెత్తుకొనిపోదురు. నిండిన చెరువులకు అలుగులు తీసినట్లు సంపాదించిన ధనము పాత్ర మెఱిఁగి సెలవుచేయుట రక్షించడమేను."

ఇది గురుమూర్తిశాస్త్రిగారి శైలి. ఇఁక చిన్నయసూరిగారిశైలి నుదాహరించుచున్నాను:

"అర్థము పురుషార్థములలో నుత్తమము. అర్థవంతున కసాధ్యము లోకమం దేదియుఁ గానము. కాఁబట్టి పురుషుఁడు న్యాయము తప్పక యే యుపాయముచేతనైనను ద్రవ్యము సంపాదింపవలెను. ఇంత సంపాదించితి నింకేల యని తనియరాదు. బుద్ధిమంతుఁడు జరామరణములులేనివానివలె విద్యాధనములు గడియింపవలె నని పెద్దలు చెప్పుదురు. ధనార్జనమునకు సాధనములు పెక్కులు గలవు. వాని లోపల వాణిజ్యము సర్వప్రకారములచే మేలయి కానఁబడుచున్నది."

పై రెండింటిలో గురుమూర్తిశాస్త్రిగారి రచనలో "లేకుంటే, చేసినా, రక్షించడమేను" మొదలగు వ్యావహారిక

* 'సెలవు' తమిళము. 'ఖర్చు' అని దీని కర్థము.

భాషా రూపములు కాన్పించుచున్నవి. కొన్ని యెడల విసంధులు కూడ కానఁబడుచున్నవి. వాక్యములయందు అన్వయ క్రమము గూడ సరిగ లేదు. 'సెలవు చేయుట' మొదలగు మాంధలికములుకూడ నందందు కాన్పించుచున్నవి. ఇట్టి లోపముల నివారించి చిన్నయసూరి సలక్షణమును, సర్వజన గ్రాహ్యము నగు శైలిలో మిక్కిలి కట్టుదిట్టముగ తన గ్రంథమును రచించెను. అందలి ప్రత్యేక లక్షణములను ముందు వివరించెదను.

చిన్నయసూరి యీ నీతిచంద్రికను మిత్రలాభము, మిత్రభేదము, సంధి, విగ్రహము అను నాలుగు విభాగములుగా విభజించినాఁడు. అందు మొదటి రెండు భాగములను మాత్రమే యాతఁడు రచించి క్రీ. శ. ౧౮౫౩-న సంవత్సరమున తాను స్వయముగ స్థాపించిన 'వాణీదర్పణ' మను ముద్రాక్షరశాలయందు ముద్రింపించియున్నాఁడు. దీనిని సూరి తన కింతవఱ కభ్యుదయ కారకుఁడగు ఆర్బత్ నాటు దొరగారి కంకితము గావించినాఁడు. ఈ గ్రంథము ముద్రితమైననాఁట నుండి పఠనీయగ్రంథమై బహుళ ప్రచారము గాంచి విద్వజ్జన రంజకమైనది. సంధి విగ్రహము లను మిగిలిన రెండు భాగములను చిన్నయసూరి రచింపక పోవుట మన దురదృష్టమని చెప్పవచ్చును. కాని మఱి యిరువది యేండ్లలోపుననే యా కొఱఁత మనకు తీఱినది. క్రీ. శ. ౧౮౭౧ లో చిన్నయసూరి వెనుక రాజధాని కళాశాలయం దాంధ్రపండిత పదవి వహిం

చిన భారతవర్ష మహామహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులవారు విగ్రహ తంత్రమును పూర్తిచేసి ప్రకటించిరి. ఆ మరుసటి సంవత్సరమునందే రాజమహేంద్ర వరములో గద్యతిక్కన కందుకూరి వీరేశలింగం పంతులుగారు విగ్రహ భాగమునే కాక సంధినికూడ సంపూర్తి చేసిరి. వీరిరువురి శైలియు చిన్నయసూరి శైలిని వెన్నాడుచు ధారాశుద్ధిం గలిగి మనోహరముగ నుండును. వేంకటరత్నము పంతులవారి శైలి యించుక జటిలము; వీరేశలింగముగారి శైలి ప్రసన్నము. ఈ రెండు గ్రంథములనుకూడ మదరాసు విశ్వవిద్యాలయము వారు ప్రథమశాస్త్ర పరీక్షకు పఠనీయ గ్రంథములుగా నేర్పఱచిరి. వీరి వెనుక నెల్లూరియందు 'విద్యార్థి కల్పభూజ' మను పత్రికకు సంపాదకులగు ఉల్లిగొండ రామచంద్రరా వను ఆంధ్ర పండితుఁడు సంధి విగ్రహములను వచన రూపమున రచించెను. ఈతని శైలియు ప్రౌఢముగ నుండి పైవానికి తీసిపోకుండ నుండెను. దీనినిగూడ నొకప్పుడు కళాశాలయందు పఠనీయ గ్రంథముగ నేర్పఱచియుండిరి. శ్రీ ఉల్లిగొండ రామచంద్రరావుగా రిప్పటి కర్ధశతాబ్ది క్రిందట జీవించియుండిరి. చిన్నయసూరి కాలమునకు కొంచెము వెనుక నుద్దండ పండితుఁడగు శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి యొక పంచతంత్రమును రచించెనని ప్రతీతి. నవీన కాలములో చెఱకువాడ వెంకటరామయ్యగారు నీతిచంద్రికయందలి లబ్ధనాశము మాత్రము ప్రాచీన శైలి ననుసరించి దీర్ఘ సమాసయుక్తముగ

రచించిరి. ఎవ రెన్ని విధములుగ రచించినను చిన్నయసూరి గ్రంథమునకుండు విశిష్టత మఱెవరి రచనకును రాలేదు. ఇంత విశిష్టతకు కారణ మెద్దియో ముందు తెలిసికొందము.

నీతిచంద్రిక యొక విడికథల సంపుటమైనను వీనిలో నొకటి కొకటి యంగాంగిభావసంబంధము గల్గి కథాశరీరము స్ఫుటమగునట్లుగా రచితమైనది. దీనివలన గ్రంథమం దొక యైక్యభావ మేర్పడి చదువరులకు రాఁబోవుకథలను జదువుట కాతురతను గల్గించును.

### విషయ విభజనము

కథారచనయం దొక్కొక్క భావము, లేక విషయము నకు వేర్వేఱు 'పేరా'లను విభాగించు పద్ధతిని పాటించినవాఁడు చిన్నయసూరి. తత్పూర్వగ్రంథకారు లింత విశదముగా నీ నియమమును పాటించియుండలేదు. ఆంగ్ల వచన రచనాపద్ధతి ననుసరించి చిన్నయసూరి విషయము సుబోధకమగుటకు నీ నూతన పద్ధతిని ప్రవేశపెట్టినాఁడు. చిన్నయసూరి కళాశాలపండితుఁడు కావున విద్యార్థులుకూడ నీపద్ధతి నలవఱుచుకొనునట్లు దారితీసి యీ పథకము వ్యాప్తిలోనికిఁ దెచ్చెను. నేఁటికిని వ్యాస రచనయందు నీపద్ధతి నియతముగా పాటింపఁబడుచుండుట మన మెఱిఁగినదే కదా!

### శైలి లక్షణములు

౧. ఇందలి శైలి యతి కఠినముగను, నతి సులభముగను కాక సుగ్రాహ్యమై కమ్మెచ్చులోని తీఁగవలె మొదటినుండి

తుదివఱకు నొకేరీతిని, నిమ్నోన్నతములు లేక యొప్పారును. కేవలము దీర్ఘసమాసయుక్తము లగు పంక్తులుగాని, కేవల మచ్చతెనుఁగుపదములు విచ్చలవిడిగ నున్న పంక్తులుగాని కానరావు. ఈ శైలియందు నన్నయశైలివలె ప్రసన్నతయు, ప్రసాదగుణమును, గాంభీర్యమును ముప్పిరిగొనియున్నవి.

౨. ఇందు సంస్కృతాంధ్రపదములు సమపాళముగ సమ్మిళితములైనవి. ఇందలి శైలి తేలిక యని పేలవముగాదు; తెనుఁగని సంస్కృతసంపర్కము లేకయుండలేదు. అల్లికబిగి యని యపూర్వపదబంధురముగాదు. అనుస్మృతి కలవియదు.

3. ఇచట ప్రత్యేకత తెలుపువానిలో జాతీయములు ముఖ్యములు. అవి జాతికి సహజమైన వ్యక్తిస్వరూపమును తెలుపుచు నితరభాషలలోనికి పరివర్తనము చేయుటకు సాధ్యము కానివి. "పోతరించియుండుట, యిల్లుద్రొక్కికొనివచ్చుట, బిఱ్ఱబిగిసికొని, కడుపుపని, కాలక్షేపముచేయు, మొదలు నఱికిన తరువు, కన్నులు మిఱుమిట్లుగొలుపుట, పెండ్లినడక నడచుచున్నవాఁడు, చిటుకనకుండ కొలుకుట, పిన్నమాపో నేఁడు రేపో, యీడిగలబడిన బక్కయెద్దు, చియ్యబట్టు, అఱ్ఱాడు, ఎత్తువారిచేతిబిడ్డ, పాటెఱుఁగనిదొర" మొదలగు తెలుఁగు జాతీయములు, "పయోముఖవిషకుంభము, గోముఖవ్యాఘ్రము, కుక్షింభరిత్వము, పరేంగితావగాహియైనబుద్ధి, మృగతృష్ణికాప్రవాహము" మున్నగు సంస్కృతజాతీయములు రచనయం దంతటను మెండుకొనియుండును.

౪. ఈ శైలియొక్క వేఱొకలక్షణము సామెతల నుపయోగించుట. "అడుసుత్రొక్కనేల కాలుగడుగనేల," "పిట్ట కొంచెము కూఁత ఘనము" మున్నుగాఁగల తెనుఁగు సామెతలును, "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం," "యథా రాజా తథా ప్రజా," "జీవన్ భద్రాణి పశ్యతి" మొదలగు సంస్కృతలోకోక్తులును నందందు పొందుపఱుపఁబడి గ్రంథమున కొక క్రొత్తయందము నందించుచున్నవి.

౫. చిన్నయసూరికిముందు వచనరచనలలో పాశ్చాత్యులు సులభముగ గ్రహించుటకు నచ్చటచ్చట సంధి క్రమముగ పాటింపఁబడియుండలేదు. సూరి వ్యాకరణము రచించినవాఁడు గావున సంధిపరిచ్ఛేదములోని లక్షణములకు లక్ష్యముగా నీగ్రంథమున సంధులను సక్రమముగా పాటించియున్నాఁడు. ముందుదాహరింపఁబడిన గురుమూర్తిశాస్త్రిగారి రచనను, చిన్నయసూరి రచనను పరిశీలించిన నీవిషయ మింకను స్పష్టము కాఁగలదు.

౬. పూర్వవచనగ్రంథములలో ప్రబంధరచన ననుసరించి వర్ణనలు ఔచిత్యమును పాటింపకుండ రచియింపఁబడుచుండెడివి. అందు శృంగారవర్ణనల నధికముగా పొందుపఱచెడివారు. నవీనకాలమున కళాశాలపద్ధతుల ననుసరించి యిట్టివర్ణనలు పరిత్యజించుటయేకాక చిన్నయసూరి సముచితమును, సంభావ్యము నగు సంభాషణశైలిలో నీతిచంద్రికను రచించెను.

## గ్రంథముద్రణ పద్ధతి

నీతిచంద్రికను చిన్నయసూరి స్వయముగా 'వాణీదర్పణ' మను ముద్రాక్షరశాలయందు ముద్రించినాఁడని తెలిపితిని. అందుకు కారణము ముద్రణమునందు కొన్నిమార్పులు తెచ్చుటయే. ఈ మార్పుల నీక్రింద సూచించుచున్నాను.

౧. రేఫసంయుక్తాక్షరము వలపలగిలక (్ర) తో వ్రాయుట. అనఁగా "అథ్రము" నిట్లు వ్రాసెడివారు. చిన్నయసూరి దానిని "అర్థము" అను నవీనరీతిగా ముద్రింపించినాఁడు.

౨. పూర్వము నిండుసున్న (పూర్ణానుస్వారము) లే యన్నిచోట్ల నుపయోగించెడువారు. చిన్నయసూరి ఆ పద్ధతిని వీడి యర్ధానుస్వారపద్ధతిని ప్రవేశపెట్టినాఁడు.

౩. తత్పూర్వము ద్రుతమునకు నకారపొల్లు నిచ్చెడువారు (న్). సూరి దానిని విసర్జించి స్వత్వరూపమునఁగాని, ('ను'), బిందురూపమునఁగాని, సంశ్లేషరూపమునఁగాని(న్గ) యుపయోగించి తనవ్యాకరణసూత్రమునకు లక్ష్యముగా చూపినాఁడు.

౪. శకటరేఫసాధురేఫలను సక్రమముగా పాటించినాఁడు. సంయుక్తాక్షరములయందు వర్ణక్రమనియమమును సరిగా పాటించినాఁడు. పూర్వము "విఛిన్న" "ఉజ్వల" "తత్వము" అని వ్రాసినవానిని సూరి "విచ్ఛిన్న," "ఉజ్జ్వల," "తత్త్వము" అని వానిరూపములను పరిష్కరించినాఁడు.

ఇట్లనేక నూతనపద్ధతులను వచనరచనయందు నెలకొల్పి తన యనుయాయులకు మార్గదర్శకుఁ డగుటచేతనే యాంధ్ర వాఙ్మయమున చిన్నయసూరి నీతిచంద్రికలు సకలబుధాహ్లాదకరములై యాచంద్రార్క మభినందనీయము లగుచున్నవి.

## వచనరచన - లక్ష్యలక్షణ సమన్వయము

ఈ గ్రంథము తనవ్యాకరణమున కెట్లు చిన్నయసూరి లక్ష్యముగా నిరూపించినాఁడో యీ క్రింది యుదాహరణమును బట్టి గ్రహింపనగును:

“ఎవ్వఁడు హంసములను శుకములను మయూరములను శుక్లహరిత చిత్రములఁ గావించె నా యీశ్వరుఁ డాయాయి జంతువులకుఁ దత్తదనురూపమైన వృత్తిని గల్పించువాఁడు. మూఢులీయర్థ మెఱుఁగక వృత్తి కయి పడరానిపాట్లు పడి కాలము వ్యర్థముగాఁ బోఁగొట్టుచున్నారు. విత్తము గడనయందొక దుఃఖము, కాఁపుదలయందొక దుఃఖము, వినాశమందొక దుఃఖము పుట్టించుచున్నది. ఇట్లు దుఃఖైకమూలమైన విత్త మేల? కాల్పనా! ధర్మార్థము ధనము గోరుటకంటె నిస్పృహత్వము మంచిది. ‘అడుసు ద్రొక్కనేల, కాలు గడుగనేల?’ ఆకాశమునందుఁ బక్షులచేత, భూమియందు వ్యాళములచేత, జలములయందు మీలచేత మాంసము భక్షింపఁబడినట్లు సర్వత్ర విత్తవంతుఁడు భక్షింపఁబడియెడును. కాఁబట్టి ధనతృష్ణమానికోలు వివేకకార్యము. తృష్ణ యొకటి మానెనా యావల దరిద్రుఁ డెవఁడు, ధనికుఁ డెవఁడు? దాని కెవ్వఁ డెడమిచ్చును? వాని మూర్ధమే దాస్యమునకు సింహాసనము. నీ సన్నికర్ష ప్రభావముచేత నా యజ్ఞానము సర్వము నివర్తించినది. కృతార్థుఁడనైతిని. నిరంతరముగా నీతోడిసంగతికంటె నాకు లాభ మొకటిలేదు. నీతోడి ప్రణయమున కొక్క కొఱఁతయు రాఁబోదు. ప్రణయము లామరణాంతములు, కోపములు తత్క్షణభంగురములు, త్యాగములు నిశ్శంకములు నగుట మహాత్ములకు సహజము.”

ఈ భాగము నుదాహరణముగాఁ గైకొని వచనకావ్య రచనకు ముఖ్యముగా తెలిసికొనఁదగిన యంశముల నెట్లు విద్యార్థులు గ్రహింపవలయునో స్థాలీపులాక న్యాయముగా నిందు చూపుచున్నాను.

ఎవ్వఁడు - అరసున్న సిద్ధము.

చిత్రములఁ గావించెను— సాధ్యము. ఎఱుఁగక - సిద్ధము. వ్యర్థముగాఁ బోఁగొట్టు—సాధ్యము.

భక్షింపఁబడియె—సాధ్యము.

కొఱఁత - సిద్ధము.

ఈ విధముగా సిద్ధసాధ్యములైన యర్ధానుస్వారముల పరిజ్ఞాన మావశ్యకము.

చిత్రములఁగావించెను = చిత్రములన్ + కావించెను - ఇది ద్రుత ప్రకృతికము; జంతువులకుఁ దత్తదనురూప = జంతువులకున్ + తత్తదనురూప - ద్రుతప్రకృతికము.

వ్యర్థముగాఁ బోఁగొట్టుచున్నారు.

వ్యర్థముగాన్ + బోన్ + కొట్టు = ద్రుతములు.

ఆకాశమునందుఁ బక్షులచేత; భూమియందు వ్యాళములచేత = ఆకాశమునందున్ + పక్షులచేత; భూమియందున్ + వ్యాళములచేత - ద్రుతప్రకృతికములు.

ఈశ్వరుఁడాయాయి—ఈశ్వరుఁడు కళ. తత్తదనురూపమైన— అనురూపము కళ. వృత్తికై పడరాని- "వృత్తి" కళ. ఏల—కళ. తృష్ణ యొకటి—తృష్ణ కళ.

ఈ విధముగా కళాద్రుతప్రకృతికముల పరిజ్ఞాన మావశ్యకము.

ఈశ్వరుఁ డాయాయి—ఈశ్వరుఁడు + ఆయాయి.

ఉకారసంధి: కొఁపుదలయందొక., కొఁపుదలయందున్ + ఒక - ఉకారసంధి.

ధనముఁగోరుట = ధనమున్ + కోరుట - సరళాదేశసంధి.

ధనతృష్ణమానికోలు = ధనతృష్ణన్ మానికోలు - ద్రుతలోపసంధి.

తృష్ణ + ఒకటి—ఇచట సంధి లేదు.

ఈ విధముగా సంధుల పరిజ్ఞాన మావశ్యకము.

ధనము గోరుటకంటె—"కోరు" సాధురేఫ.

ఒక్క కొఱంత—శకటరేఫ.

ఈ విధముగా రేఫ శకటరేఫ పరిజ్ఞాన మావశ్యకము.

వృత్తి-ఋకారము; తృష్ణ - ఋకారము; దరిద్రుఁడు - రేఫ ఉకారము.

ఈ విధముగా కొమ్ము ఋకారవడి వట్రువసుడి పరిజ్ఞాన మావశ్యకము.

"అడుసు ద్రొక్కనేల కాలు గడుగనేల" ఇది ప్రసిద్ధమైన తెలుఁగుసామెత.

ఈ విధముగా సామెతలపరిజ్ఞాన మావశ్యకము.

"హంసములను శుకములను మయూరములను శుక్లహరిత చిత్రములఁ గావించె." యథాసంఖ్యాలంకారము.

ఆకాశమందుఁ బక్షులచేత భూమియందు వ్యాళములచేత జలములయందు మీలచేత మాంసము భక్షింపఁబడినట్లు సర్వత్ర విత్తవంతుఁడు భక్షింపఁబడియెడును—ఉపమాలంకారము.

ఈ విధముగా నలంకారపరిజ్ఞాన మావశ్యకము.

వినాశ = వి + నాశ - ఉపసర్గము—ఇచట "వి" కి అర్థము లేదు. నిస్పృహాత్వము = నిర్ + స్పృహాత్వము . ఇం దిది నఞ్ అర్థకము = లేకపోవుట.

వి + వేకము = ఉపసర్గము.

సన్నికర్షము = సం + ని + కర్ష—ఉపసర్గములు.

అర్థాంతరముల నిచ్చునది:

"సంగతి" = సం + గతి-ఉపసర్గము అర్థాంతరము నిచ్చునది.

ఈవిధముగ నుపసర్గపరిజ్ఞాన మావశ్యకము.

"ఆ యీశ్వరుఁ డాయాయి జంతువులకుఁ దత్తదనురూపమయిన వృత్తినిఁ గల్పించువాఁడు." ఈశ్వరుఁడు వృత్తిని గల్పించువాఁడు - ఇది మూలవాక్యము. ఆయాయి జంతువులకు అనునది వృత్తి కల్పనతో సంబంధము. "తత్తదనురూపమైన" వృత్తికి విశేషణము. "ఆ" ఈశ్వరునికి విశేషణము.

ఈ విధముగా వాక్యవృద్ధిరచనాపరిజ్ఞాన మావశ్యకము.

ప్రాచీనకాలమున చిన్నయభట్టారకుని రచన ననుసరించుచు నవీన వచన రచనాపద్ధతుల సమ్మేళనమున లక్ష్య లక్షణ సమన్వయముచేసి నూతన పథకము నేర్పఱచుటవలన నవీన వచన రచనకు చిన్నయసూరి మార్గదర్శకుఁడయ్యెను.

## కథలు - నీతులు

నీతిచంద్రికయందలి నీతులను, అందలి కథలను ఇందు పొందుపఱచుచున్నాను.

సుదర్శనుఁ డను రాజు మూర్ఖులగు తనపుత్రులఁగూర్చి వగచి విష్ణుశర్మ యను బ్రాహ్మణునియొద్ద వారిని విద్యాశిక్షణకొఱకై ప్రవేశపెట్టెను. అతఁడును నీతిని బోధించు కథలను వారికి వినిపింపఁగోరి మిత్రలాభము, మిత్రభేదము, విగ్రహము, సంధి అను నాలుగంశములు గల కథను వినుపించును.

వీనిలో మిత్రలాభము, మిత్రభేదము నను రెండు మాత్రమే యిందున్నవి. అందు మిత్రలాభమున స్నేహము వలని లాభములను తెలియఁజేయు కాక కూర్మ మృగ మూషికముల కథ చెప్పఁబడినది. ఈ కథలోనే కొన్ని యుప కథలు కలవు. అవియును నీతిబోధకములే. వానిలో "ఆశ యన

ర్థమునకు హేతువు'' అను నీతిని బోధించు ముసలి పులి-బాటసారి కథ చెప్పఁబడినది. పిమ్మట మృగ కాక జంబుకముల కథ ''సర్వ విధముల విచారింపక యేపనియు చేయరాదు'' అను నీతి నుద్ఘోషించుచున్నది. ఈ కథలోనే (అనఁగా మృగ కాక జంబుకముల కథలో) ''కొఱగానివారితో మైత్రి విపత్తునకు కారణ''మనుదానికి దృష్టాంతముగా మార్జాలమునకు జరద్గవమను గృధ్రము తావిచ్చి మృతిఁబొందు కథ పొందుపఱుపఁబడినది. మూలకథ నడచుచున్న కొలఁది నింకను మూఁడు కథలు లోభిత్వమే వినాశహేతువు అను నీతికి ననుసరణముగా రచితములైనవి. ఇవి వీణాకర్ణ చూడాకర్ణుల కథ (మూషికము యొక్క స్వవృత్తాంతము), జంబుకము - వింటినారి కథ, చిత్రాంగుఁ డను జింక తన పూర్వవృత్తాంతమును కాక కూర్మ మూషికములకు చెప్పుట. ఇంతటితో మిత్రలాభమందలి కథలు సమాప్తము లగుచున్నవి.

ఇఁక మిత్రభేదము పింగళక సంజీవకము లను సింహ వృషభముల కథతో ప్రారంభమగుచున్నది. ఇందు కథాసూత్రమును నడిపించువారు కరటక దమనకు లను జంబుకములు. వీ రిరువురి సంభాషణయందును నీక్రిందికథలు ప్రసక్తములైనవి. పింగళ సంజీవకములకు ప్రథమమున మిత్రత్వము నేర్పఱచి తుదకు భేదమును కలిగించుట కీ కరటక దమనకులే కారణభూతులు. కావున నట్టివా రేవిధముగా ప్రవర్తించి కార్యానుకూల్యము చేయవలయునో యాపద్ధతులను లోకమునకు విశదమొనర్చుటకు నీకథలావశ్యకము లైనవి.

| కథలు. | నీతులు. |
|---|---|
| ౧. కోతి-ఱంపపుదూలముకథ | జోలిమాలినపనికి పోరాదు. |
| ౨. ఓండ్రపెట్టి మోదుపడిన గాడిద కథ | పరాధికారము పై వేసికొనుట హానికరము. |
| 3. జంబుకము-దుందుభికథ | శబ్దమాత్రమునకు నివ్వెఱపోవం జనదు. |
| ౪. ఆషాఢభూతిసన్న్యాసి, మేష యుద్ధము, జంబుకము | దైవము ప్రతికూలంబైన పురుషకారంబెల్ల వ్యర్థంబై చనును. |
| ౫. కాకముపాయముచే సర్పమును మృతినొందించుట | ఉపాయంబుచే నేయది సాధ్యం బగు నాయది పరాక్రమశతంబుచే నైన సాధ్యంబు గాదు. |
| (అ) దుఃఖించుచున్న కాకమునకు నక్క చెప్పిన కొంగను ఎండ్రి చంపిన కథ | |
| ౬. కుందేలు-సింహము కథ | బుద్ధిబలముగలవానికి ఇతర విధమగు బలము లేకున్నను కొఱంత లేదు. |
| ౭. మందవిసర్పిణి యను చీర పోతు-డిండిమం బను నల్లి కథ | స్వరూపం బెఱుంగక పరునిం జేర్చిన వాని కవశ్యము హాని సంభవించును. |

| కథలు. | నీతులు. |
|---|---|
| ౮. వ్యాఘ్రము జంబుకములు లొట్టియను కపటోపాయంబుచేత స్వామియను సింగంబుచే చంపించుట | భృత్యులు మాయోపాయముచే నెట్టికార్యమునైన సాధింపఁగలరు. |
| ౯. వడ్రంగి-సింహము కథ | క్షుద్రజనపరివృతుండగు రాజు సమాసన్నజనములకు ముప్పు పుట్టించును. |
| ౧౦. టిట్టిభ సముద్రముల కథ | హితవచనముల వినని పాలిశుఁడు నశించును. |
| (అ) టిట్టిభి వాక్రుచ్చిన తాఁబేటి-అంచల కథ | హితవచనముల వినని పాలిశుఁడు నశించును. |
| (ఆ) జలాశయ మందలి మూఁడు మత్స్యముల కథ | మతిమంతుఁడు అనర్థము కలిగించు అభిజనమును మానుకొనవలయును. లేదా, యుపాయ సంపన్నుఁడై యుండవలెను; దైవపరుఁడై యుండరాదు. |
| ౧౧. వానరములు – సూచీముఖము కథ | మూర్ఖులకు బుద్ధిచెప్పుట హానికరము. |
| ౧౨. నందనగుప్త సుదర్శనగుప్తుల కథ | తన మేలు గోరి యితరులకు కీడు గోరువాఁడు తప్పక చెడిపోవును. |

| కథలు. | నీతులు. |
|---|---|
| (అ) నందనగుప్తుని తండ్రి చెప్పిన శాబకములను కాచికొనఁబోయి కోలుపోయిన బకము కథ | ఉపాయమును చింతించునప్పు డపాయమును కూడ చింతింపవలయును. |
| ౧౩. ఇంద్రపాలిత ధనగుప్తుల కథ | పరులను వంచింపఁబోయిన వాఁడు తాన వంచితుఁడగును. |

ఇట్లు నీతిచంద్రిక వేర్వేఱుకథల సంపుటియైనను నొక సముద్రమున కలియు వేర్వేఱు నదులవలెను, ఒకే సూత్రమున బంధింపఁబడిన మౌక్తికములవలెను నొకదాని కొకటి సంబంధము గలిగినవియై, తమ ప్రత్యేకవ్యక్తిత్వము స్థిరీకరించుచున్నవియై యున్నవి. ఇది నీతినిధి యగుటచేత ప్రతిమానవునికి నావశ్యకముగా తెలియఁదగిన దగుటచేతను సంఘములో నన్ని తరగతులవారికి సర్వకాలము పఠనీయగ్రంథమై యొప్పుచున్నది. కావుననే నేఁటివఱకు నిది నియతముగా సర్వజనాదరణమును చూఱగొన్నది.

# 7. ప్రకరణ రచన

చిన్నయసూరి బాలవ్యాకరణము రచించుటకుఁ బూర్వ మాంధ్రభాషలో సూత్రీకరణవిధానము నేర్పఱచు నభ్యాస రూపకములగు సంస్కృతాంధ్ర వ్యాకరణ సంగ్రహములను రచించియున్నాఁడు. వానిలో నీతిచంద్రిక వెనువెంటనే, క్రీ. శ. 1853 లో ముద్రితమైన చిన్నయసూరి రచన 'శబ్దలక్షణ సంగ్రహము.'

శబ్దలక్షణసంగ్రహము

ఇది వ్యాకరణగ్రంథము. ఇం దైదుపరిచ్ఛేదములు కలవు. వాని వివరణ మిది:

| | | |
|---|---|---|
| 1. సంజ్ఞాపరిచ్ఛేదము | 42 | సూత్రములు. |
| 2. సంధిపరిచ్ఛేదము | 46 | ,, |
| 3. శబ్దపరిచ్ఛేదము | 214 | ,, |
| 4. క్రియాపరిచ్ఛేదము | 118 | ,, |
| 5. ప్రకీర్ణపరిచ్ఛేదము | 150 | ,, |
| వెరసి | 570 | సూత్రములు. |

దీనికి మంగళాచరణముగా నీక్రిందిశ్లోకములు గలవు.

కరోదరధృతోద్భూతవనజాతౌ సనాతనౌ,
శేషాద్రిశేఖరత్వాదచ్ఛాయా జాయాపతీ స్తుమః.
పూర్వేషాం లక్ష్యలక్ష్మాని వికృతే ర్వీక్ష్య భూరిశః,
క్రియతే బాలబోధాయ శబ్దలక్షణసంగ్రహః.

ప్రతిపరిచ్ఛేదాంతమునను—

"ఇది పరవస్తు చిన్నయసూరికృతంబగు శబ్దలక్షణనామకాంధ్రవ్యాకరణమునందు......పరిచ్ఛేదము."

ఇందున్న మఱియొకవిశేష మేమనఁగా, ప్రాచీనాంధ్ర వాఙ్మయమున పొడగట్టు సంబోధనేతరవిభక్తిరూపములతో పరిచ్ఛేదాద్యములు కనుపట్టుచున్నవి.

ద్వితీయపరిచ్ఛేదము మొదలు – సంబోధన.

క. శ్రీచరణసరోరుహాలాక్షా చారువిలాసవక్షః సంశ్రితజనర
క్షాచరణదక్ష దుష్టనిశాచరకులశిక్ష శేషశైలాధ్యక్షా.

తృతీయపరిచ్ఛేదము – షష్ఠీవిభక్తి.

క. శ్రీగృహమేధికి నతనిధి కాగమవేద్యునకుఁ ద్రిభువనారాధ్యునకున్
భోగాపవర్గదాయికి నాగాధిపశాయి కంజనాధరపతికిన్.

చతుర్థపరిచ్ఛేదము – ప్రథమావిభక్తి.

క. శ్రీనయనోత్పలశీతల భానుఁడు కలుషాంధకారభానుఁడు కరుణా
ధీనుం డాశ్రితశుభసంధానుం డద్యుషితశేషధరసానుఁ డొగిన్.

పంచమపరిచ్ఛేదము – తృతీయావిభక్తి.

క. శ్రీలోచనాంజనాంక శ్రీలలితాధరునిచేతఁ జిరభద్రగుణ
శ్రీలునిచేతన్ దీనకృపాళునిచేతన్ వృషాద్రిపాలునిచేతన్.

ఈ ప్రాచీనసంప్రదాయము నెఱిఁగినవాఁ డగుటచే సూరి యీ గ్రంథము చివర నీక్రిందిసూత్రము గావించి యున్నాఁడు.

"స్వరూపవిభక్తినాయకవిశేషణంబులతోడ నాశ్వాసాంతంబు నందు మీఁదం దదాదిని విశేష్యాంతంబులతోడను మంగళం బాద్య లభివర్ణింతురు."

ఈగ్రంథ మిప్పుడు లభ్యముకాదు. *

ఇందలి సూత్రములు పాణినీయాష్టాధ్యాయీ సూత్రములవలె రచితములైనవి. సూత్రములకు నుదాహరణములిందు లేవు. "సిద్ధి లోకంబువలనఁ దెలియనగు-సిద్ధి ర్లోకాత్ దృశ్యా; శాసనం బియ్యది దిక్ప్రదర్శనంబు - (శాసన మితి దిక్ప్రదర్శనం" అను రీతిని సూత్రములు కలవు. ఇది భాషా సమష్టికి రెండవ సోపానమువంటిది. ఇట్టి సూత్రము లున్నవని కంఠస్థము చేయుటకు ననుకూలముగ నుండును. కావుననే చిన్నయసూరి ఇట్టి సూత్ర రచనఁ గావించినాఁడు.

## ఆంధ్ర శబ్దానుశాసనము

ఇయ్యది సంస్కృత సూత్రముల రీతిని ఆంధ్ర భాషా లక్ష్యములతో రచితమైన వ్యాకరణము. ఇది కేవలము తెనుఁగు భాషను గూర్చి సంస్కృతములో వ్రాయఁబడిన గ్రంథము. దీనికి పద్యానువాదముకూడ చిన్నయసూరి గావించి యున్నాఁడు. దానిని గుఱించి ముందు తెలిపెదను. ఇదియును పై వ్యాకరణమువలె సంజ్ఞా, సంధి పరిచ్ఛేదములుగా విభజింపఁబడియున్నది.

ఇది సంజ్ఞ, సంధి, తత్సమ, ప్రకీర్ణ, క్రియ, తద్భవము లను నాఱుపరిచ్ఛేదముల క్రింద విభక్తమైనది. ఇందలి సూత్రము లీరీతిగ నుండును. "సిద్ధి లోకంబువలన గ్రాహ్యంబు." "శాసనం బీయది దిక్ప్రదర్శనంబు." "ఉత్వంబు కచ్చు రా

* దీని కొక వ్రాఁతప్రతినివ్రాసి, కీర్తిశేషులు గిడుగు రామమూర్తి పంతులుగారి కిప్పటికి నలువదేండ్లక్రిందట నొసఁగితిని.

సంధియగు.” “ప్రాతాగుఁలకు సమాసంబునం దాద్యక్షర శేషంబు బహుళంబు.” “గుణవదాదికంబు హలంతం బమంత తుల్యం బిందునామంబగు.” “దాని మకారంబు లోపించు.” “ప్రథమాంతమున కస్మద్విశేషణంబునకు బహుత్వంబున మువర్ణకంబగు.” “ఆగామి కర్మానుబంధతుమాద్యర్థంబుల ద్రుతంబునగు.” “భూతంబునం దిత్వంబునగు.” “ఆకాశాదుల మధ్యగంబునకు హ్రస్వంబగు. ఏకాంతాదుల బిందువునకు లోపంబగు.”

## పద్యాంధ్ర వ్యాకరణము

ఇది సూత్ర రూపముననున్న పైదానికి సూరి పద్య రూపమున రచించిన గ్రంథము. అందు పద్యరూప మసమగ్ర ముగా నున్నది. ఈ రెండిటి స్వరూపమును చూపించుటకు నా రెండు గ్రంథములనుండి కొన్ని యుదాహరణములను పొందుపఱచుచున్నాఁడను.

గ్రంథ ప్రారంభము:—

శ్రీమహిముఖ్య దివ్యమహిషీనయనోత్పలచారుదీధితి
స్తోమమనారతం బగుచు జొప్పున బర్వట నాగమేచక
శ్రీమెయి దోప నొప్పలరు శేషధరాగ్రనికేతనుండు భ
క్తామరపాదపోత్తమ ముదారఫలప్రతిపాది గావుతన్.

గీ. ఆద్యభాషకు నేఁబది యక్కరములు
ప్రకృతి కవి పది కొఱవడి వరలు నిందు
ముప్పదాఱగు నవి యన్యములును శబ్ద
యోగవశమున పిఱుసొచ్చు నుదధిశయన.

గీ. ఆరులు పదాఱు స్వరములు కాదికములు
ముప్పదియునాల్గు వ్యంజనంబు లనఁ దనరు
బిందువు విసర్జనీయంబు వెలయు వ్యంజ
నములు నన నాద్యభాష పన్నగనగేశ.

క. ఋముఖములు నాల్గు వక్రత
మములు జ ఞ శ షాక్షరములు మానిన నవశి
ష్టములగు నలువది వర్ణము
లమరు ద్వితీయ ప్రకృతికి నగధరనిలయా.

పై పద్యములు ఈ క్రింది సూత్రములకు వివరణములు:—

౧. ఆద్యప్రకృతికి వర్ణంబు లేఁబది.

౨. ద్వితీయంబునకు ఋగ్వక్రతమ జ ఞ శషలు ద్రికట్‌నగు. ఇట ముప్పదాఱు.

3. ఋగ్విసర్గయున్ జ ఞ శ ష లు సమయోగంబునం గలియు. (ఇందు 48 పద్యములు మాత్రమే కలవు. కొన్ని క్రియా రూపములు మాత్రమే తెలుపుటతో గ్రంథము నిల్చి పోయినది కావున నిది యసమగ్రమని చెప్పనొప్పును. ఇదియు శ్రీ వెంకటేశ్వరునకు కృతి.)

## సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణము

ప్రాచీన కాలమున నన్నయాథర్వణులవలె నవీన కాలమున చిన్నయ సంస్కృత భాషలోనే సూత్రరీతిని నొక వ్యాకరణమును రచించెను. దానికే సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణమని పేరు. ఇది ౧. సంజ్ఞా, ౨. సంధి, 3. అజంత, ౪. ఆచ్ఛిక, ౫. సర్వనామ, ౬. కారక, ౭. సమాస,

౮. తద్ధితపరిచ్ఛేదములు గలది. ఈ విభాగమునుబట్టి యిది పాణిని అష్టాధ్యాయి ననుసరించి వ్రాయఁబడినది. గ్రంథ ప్రారంభమున ముం దీ క్రింది శ్లోకము చెప్పఁబడినది.

"అస్తి కల్పద్రుమః కోపి జాతరూపలతావృతః,
వేంకటాద్రి శిఖారూఢః స్మరతాం పరమార్థదః."

గ్రంథాంతమున "సర్వం లక్షణం చిన్నయసూరీయాణి సూత్రాణి సీథావృష్టమ్" అని కలదు. ఇదియును బాల వ్యాకరణమునకు పూర్వము రచింపఁబడినదే యగును. ఏల యనఁగా నిందలి సంస్కృత సూత్రములకు తెనుఁగు భాషా పదము లనుసంధింపఁబడినవి. అయినను వ్యాకరణ శాస్త్రము శబ్దబ్రహ్మను ప్రతిపాదించుటచేత నీతఁడు మొదటి సూత్రము లనే 'ఆంధ్రభాషా సంబంధిని సిద్ధి శ్లోకస్య వ్యవహారా దవగంతవ్యా, తర్హి శాసనమిద మనారంబనేయమిత్యాశంక్యా శాసనమితి' అని వ్యాకరణశాస్త్ర మర్యాదలేని తెనుఁగు భాషకు సంస్కృత వ్యాకరణముతో సమానమగు ప్రతిపత్తిని గడించినాఁడు. దీనినే తిరిగి సూత్రములుగా కూడ తెనుఁగున శబ్దలక్షణ సంగ్రహమున ననువదించియున్నాఁడు. సంస్కృత పదములను తెనుఁగు పదములను ఎట్లు సమ్మేళనము చేసియున్నాఁడో ఈ క్రింది యుదాహరణమునుబట్టి గుర్తింపవచ్చును.

కచటతపాః పరుషాః
గజడదబా స్సరళాః
ఉభయే శంపాః

హలః పరేస్థిరాః
చుస్తాలవ్యే తాలవ్యాః
అన్యత్ర దన్త్యాః

అక్కజాదిషు (కంచంత - కాచాకు-పచ్చాకిత్యాదీనా మక్కజాదిత్వా త్సాధుత్వ మవగన్తవ్యమ్)

దీనినిబట్టి చూచినచో తెనుఁగుభాషకు సంస్కృత వ్యాకరణపరిపాటి నలవఱచుటయేకాక తెనుఁగు తెలియని సంస్కృతపండితులకు తెనుఁగుభాషాసంప్రదాయములను, తెనుఁగు వ్యాకరణపరిపాటిని తెలియఁజేయుటకు సూరి దీనిని రచించియున్నాఁడు కాని తన వ్యాకరణపాండిత్యప్రకర్ష ప్రదర్శించుటకుఁ గాదని విశదముగా తెలియుచున్నది కదా!

# 8. బాలవ్యాకరణము

నేఁటికాలమున తెనుఁగుభాషకు బాలవ్యాకరణము పరమ ప్రామాణికగ్రంథ మని యాంధ్రవిద్వాంసులెల్లరు నేక గ్రీవముగా నామోదించి యంగీకరించిన విషయము. బాలవ్యా కరణ మెట్లు ప్రాచీనభాషాసంప్రదాయములను నిలువఁబెట్టినదో, నవీనకాలమున నావ్యాకరణమునుబట్టి భాషాతత్త్వసంప్రదాయ ములను, భాషాపరిణామములను నెట్లు తెలిసికొనఁగలమో, యీవిషయములన్నియు నెఱుంగుటకు మనము తొలుత నాంధ్రవ్యాకరణములచరిత్ర పరిశీలింపఁదగియున్నది.

## ఆంధ్ర, సంస్కృత వ్యాకరణములు

తెనుఁగుభాషకుఁ బ్రాచీనకాలమునుండియు వ్యాకరణ ములు కలవు. "మాట పుట్టినవెనుక వ్యాకరణము, పాట పుట్టినవెనుక ఛందస్సు" అను నానుడి ననుసరించి భాష యేర్ప డిన వెనుకను, కవితారచన కనంతరమునను వ్యాకరణములు రచితములగును. భాష ప్రవాహరూప మైనది. ఇది ప్రజల పలుకుబడిలో శీతోష్ణస్థితి భేదముల ననుసరించి, సాంఘిక వ్యవ స్థల ననుసరించి, రాజకీయపరిస్థితుల ననుసరించి క్షణక్షణమును మార్పుఁ జెందుచుండును. అట్టి మార్పుల వలన భాష తన నైసర్గిక స్వరూపమును గోల్పోకుండ భాషాతత్త్వవేత్తలు వ్యాకరణమును రచింతురు. తెనుఁగుభాషకు నట్టివ్యాకరణములు

తొలుదొల్త తెనుఁగునందే రచితములైనవి.* వానిలో కేతన రచించిన 'ఆంధ్రభాషాభూషణ' మను వ్యాకరణము మొదటిది. ఆ వెనుక కవులు రచించిన కావ్యములను పరిశీలించి వైయాకరణులు ప్రయోగములను సేకరించి, వానిని ప్రచారమున నున్న వ్యాకరణసూత్రములతో సమన్వయము చేయ నారంభించిరి. వీనికే లక్షణగ్రంథము లని పేరు. క్రమక్రమముగా తరువాతి పండితులు కవిప్రయుక్తములై లక్షణగ్రంథములచే నంగీకృతములైనవానినే గ్రంథములందు ప్రయోగించుచు కేవల వ్యాకరణము ననుసరించుట మానిరి. అందుచే కేతన వెనుక వ్యాకరణశాస్త్రమే ప్రధానముగాఁ గాక దానితో ఛందశ్శాస్త్రమునుగూడ పండితులు రచించిరి. విన్నకోట పెద్దన ఛందోవ్యాకరణములను రెండిటిని రచించినాఁడు. అనంతుని ఛందస్సున నట్లే ఛందోవిషయము ప్రధానముగను, వ్యాకరణ విషయ మప్రధానముగను నున్నవి. తాతంభట్టు రెండిటినిగూర్చి "కవిచింతామణి, ఛందోదర్పణ" మను రెండు గ్రంథములను రచించెను. ఇవియన్నియు తెనుఁగున పద్యరూపమున రచితములు. అటుపిమ్మట లింగముగుంట తిమ్మన, ముద్దరాజు రామన్న, కూచిమంచి తిమ్మకవి మొదలగు లాక్షణికులు కేవల కవిప్రయోగములనే ప్రమాణీకరించి లక్షణగ్రంథముల రచించిరి.

వీరు ప్రమాణీకరించిన భాష నన్నయభట్టారకాది కవి

---

* తెలుఁగులో కావ్యభాషకే – అనఁగా కవిప్రయుక్తభాషకే వ్యాకరణము. "ప్రయోగశరణా వైయాకరణా" అను సూక్తి తెలుఁగు వ్యాకరణమువలనఁ గలిగినది.

త్రయమువారి భాషయేకాని వేఱుగాదు. నేఁడు వాఙ్మయమున ప్రసిద్ధికెక్కుచున్న నన్నెచోడ పాల్కురికి సోమనాథాది శివ కవుల భాషను వారు గ్రహింపనే లేదు. కాఁబట్టి లక్షణగ్రంథ ములు విశాలములుగాక సంకుచితములై భాషయొక్క వివిధ పరిణామములలో నొకదానిని మాత్రమే వివరించియున్నవి. కొంతకాలమునకు కవులు లాక్షణికుల నిరంకుశత్వమునకు లోఁబడి వా రంగీకరించిన ప్రయోగములతోనే రచనలఁ గావించుచు వచ్చిరి. ఇందుల కుదాహరణముగా క్రీ. శ. 1656-వ సంవత్సరమున అప్పకవిచే రచింపఁబడిన అప్పకవీయ మును గ్రహింపవచ్చును. తరువాతి రచయితలు అప్పకవీయ మునే ప్రమాణముగాఁ గొని ప్రాచీన కవిప్రయోగములను నిరసించుచు వచ్చిరి. దీనివలన భాషయొక్క స్థిరత్వము క్రమ ముగా సడలినది.

తెనుఁగువ్యాకరణములు సంస్కృతములో కూడ విర చితములైనవి. వానిలో నన్నయ విరచితమని చెప్పఁబడు 'ఆంధ్ర శబ్దచింతామణి'యు, అథర్వణాచార్యకృతమగు 'అథర్వణ కారికావళి'యు ముఖ్యములు. వీనిలో నాంధ్ర శబ్ద చింతా మణి మిక్కిలి ప్రసిద్ధిలోనికి వచ్చినది. దీనికి ఎలకూచి బాల సరస్వతి రచించిన తెలుఁగు టీక ప్రచారములో నున్నది. అప్పకవి 'చింతామణి' నే యాధారముగాఁగొని పద్య కావ్య ముగా రచించినాఁడు. కాని యతఁడు సంధి పరిచ్ఛేదమువఱకు మాత్రమే రచించినాఁడు. ఆ వెనుక అహోబలపండితుఁ డను విద్వాంసుఁడు 'కవి శిరోభూషణ' మను పేర నొక విపుల

సంస్కృత వ్యాఖ్య రచించినాఁడు. దీని కహోబలపండితీయ మని పేరు. చిన్నయసూరికి ముందుకాలమున పై గ్రంథములన్నియు ప్రామాణికముగ నంగీకృతములై బహుళ ప్రచారములో నున్నవి. ఇవికాక 'వాసుదేవ వృత్తి', 'వైకృతి చంద్రిక' మున్నగు సంస్కృత వ్యాకరణములు తెనుఁగునకుఁ గలవు.

### ఆంగ్ల భాషామయ వ్యాకరణములు

సంస్కృతాంధ్ర భాషలలోనున్న వ్యాకరణములు కేవలము తెనుఁగు పండితు లగువారికి, నితరులకు దుర్గ్రాహ్యము లగుటంజేసి యాంగ్లేయుల పరిపాలనా ప్రారంభమున సులభ శైలిలో వ్యాకరణములు రచించుచు వచ్చిరి. దీనికి దారి చూపినవారు కంపెనీవారి కాలమునందలి ఇంగ్లీషు ఉద్యోగస్థులే. వారిలో Carey (క్యేరి), Campbell (క్యాంపుబెల్-కాంబెల్), Brown (బ్రౌను) అనువారు ముఖ్యులు. వీరి వ్యాకరణములు ముద్రితములై యాకాలమున ప్రథమముగా తెనుఁగు వ్యాకరణము నభ్యసించువారి కుపయుక్తములై యొప్పారుచుండెడివి. కాని యిందలి భాష వ్యావహారికము. వీరి వ్యాకరణములు వ్యవహార భాషకేకాని కవిప్రయుక్తమైన గ్రాంథికమునకుఁగాదు. కావున నివి మిక్కిలి సంకుచిత ప్రయోజనము గలవిగ్నై వ్యాకరణాభ్యాస పాటవమును పెంపొందింప లేకపోయినవి.

ప్రభుత్వమువారు ఫోర్టుసెంటుజార్జి కోటలో తెనుఁగు నేర్పుటకు ప్రసిద్ధులగు సంస్కృతాంధ్రపండితులను నియమించిరి. వారును వ్యాకరణ రచనమునందుమాత్రము సులభ

మగు రీతినే యవలంబించిరి. వ్యాకరణ విషయములు మనస్సునకు పట్టునట్లుగా రచించుటయే వారి లక్ష్యముగాని పరంపరా యాతమగు భాషా పరిణామమును నిర్వచించుటకును, ప్రాచీన ప్రయోగముల లక్ష్య లక్షణ సమన్వయము చేయుటకును వారు పూనుకొనలేదు. చిన్నయసూరి క్రీ. శ. 1858 లో బాలవ్యాకరణమును ముద్రించునాటికి తెనుగున పైపండితులు వ్రాసిన యీ క్రింది వ్యాకరణములు ప్రచారములో నుండెడివి.

౧. పట్టాభిరామ పండితీయము: వేదము పట్టాభిరామ శాస్త్రి కృతము. ఇది యాంధ్రశబ్దచింతామణికి వ్యాఖ్య. ఇతఁడే యాంధ్రశబ్దానుశాసన మను నొక వ్యాకరణము తెనుఁగున పద్యరూపముగ రచించెను. దీని రచనా కాలము 1816.

౨. గురుమూర్తిశాస్త్రి వ్యాకరణము: ఇది ఫోర్టు సెంటుజార్జి కళాశాలలో ప్రధానపండితులగు రావిపాటి గురుమూర్తిశాస్త్రి కృతము. దీని రచనా కాలము 1836. ఇది విపులమగు వ్యాకరణము. దీనిని చిన్నయసూరి పాఠము చెప్పియున్నాఁడు. ఆ కాలమున నిది చాల ప్రచారము గాంచినది.

3. ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణము: పుదూరి సీతారామశాస్త్రి కృతము. పేరునుబట్టియే దీని స్వరూపము తెలియఁగలదు. ఇందు ప్రశ్నలును, జవాబులును కలవు. 1852 లో నిది ముద్రితము.

౪. ఉదయగిరి శేషయ్యశాస్త్రి వ్యాకరణము: ఇది 1856 లో వెలువడినది. ఇదియును ప్రచారములో నున్నదే.

౫. నరసాపుర వ్యాకరణము: దీనిని (శ్రీ) వేదం వెంకట రమణ శాస్త్రిలవారు రచించిరి. వీరు (శ్రీ)వేదం వెంకటరాయ శాస్త్రిగారికి జనకులు. వీరు 1856 లో నరసాపురములో నున్నప్పుడు దీనిని ప్రకటించిరి.

ఇవియన్నియు కేవలము తెనుఁగుభాషా సంప్రదాయ ములను దిక్ప్రదర్శనముగా తెలుపుటకు మాత్రమే యుద్దేశింపఁ బడినవి. ఉత్తమ సాహిత్య విద్య కాధారములగు ప్రాచీన కావ్య రచనలు పరిశీలించుటకు, భాషాలక్షణ పరిపాటి తెలియు టకు సంస్కృత వ్యాకరణ విశేషములు తెలియుట యత్యంతా వశ్యకము. తెనుఁగుభాషతో సంస్కృత భాషకు నవినాభావ సంబంధము కలదు. ఆ భాషా వ్యాకరణ పరిపాటిని తెలియ నిదే తెలుఁగు కవుల శైలిని గ్రహించుట కష్టతరము. ఇప్పటి వలెఁ గాక పూర్వకవులు సంస్కృతమున చక్కని పండితులై తెనుఁగు భాషా సంప్రదాయములను తెలిసికొని రచనలను గావించెడివారు. కాఁబట్టి సంస్కృత వ్యాకరణాభ్యాసము ఆంధ్ర వైయాకరణుల కావశ్యకమై యున్నది.

చిన్నయసూరి పై పరిస్థితులను గమనించి సంస్కృ తాంధ్ర భాషావ్యాకరణ పద్ధతులను సమన్వయించి నూతన రీతిని బాలవ్యాకరణమును రచించినాఁడు. ఇది బాలవ్యాకరణ మను పేరుతో వెలసినను ప్రౌఢపండితులకు సైతము సుగ మము కాదు. ఐనను చిన్నయసూరి దీని కీ పేరు పెట్టుటకు సిద్ధాంతములుగా గ్రహింపఁదగిన విషయములను సూత్రప్రాయ

ముగా బాలురు కంఠస్థము చేయుటకు తగినట్లు రచించు టయే కారణము.

ముందు వివరించినట్లుగా బాలవ్యాకరణ రచనకు పూర్వము చిన్నయసూరి యభ్యాస రూపముగా చిన్న చిన్న వ్యాకరణ గ్రంథములను రచించియున్నాఁడు. సంపూర్ణ వ్యాకరణ సూత్రపరిణతికి నీ గ్రంథములు సోపానములవంటివి. వ్యాకరణమును పద్యములలో రచించిన వ్యర్థపదము లేవేవి తొలఁగింపవలసి యుండునో యవి కనుఁగొనవచ్చును. అందు చేతనే సూరి మొదట ఆంధ్రశబ్దానుశాసనమును పద్యము లలో వ్రాయుటకుఁ గడంగెను. ఆ వ్యర్థ పదములను విసర్జించి వానిని కొన్ని చిన్న సూత్రములుగా శబ్దలక్షణ సంగ్రహమున రచించెను. వానిలో నేమేని దోషములున్నచో నవి తొలఁగి పోవుటకు వానిని సంస్కృత భాషలో రచించెను. ఈ సంస్కృత సూత్రములు తాను స్వయముగా రచించినవి కాఁబట్టియే బాలవ్యాకరణము చివర సూరి యిట్లు చెప్పియున్నాఁడు:

"మును మదుపజ్ఞం బగుచును
తనరిన వ్యాకృతికి సూత్రతతి యొకకొంతం
దెనిఁగించి యిది ఘటించితి
ననయము బాలావబోధ మగుభంగిఁ దగన్."

ఇట్లు కంఠోక్తిగా సూరి బాలవ్యాకరణము తన స్వతంత్ర రచన యని చెప్పుచుండఁగా నీ తర్వాత నా రచన

మును గూర్చి యొక వివాదము వెలువడినది. అది యేమన: చిన్నయసూరి కాలమున శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి యను నొక యుద్దండపండితుఁడు విలసిల్లియుండెను. ఆతఁడు 'హరికారిక' లను నొక సంస్కృత భాషలోనున్న తెనుఁగు వ్యాకరణ సూత్రములకు నొక వ్యాఖ్య రచించెననియు, నా వ్యాఖ్యసంతతిని సూరి తెనుఁగుభాషలో రచించెననునది. దీనికి వారు చూపు నుపపత్తి యేమనఁగా కృష్ణమూర్తిశాస్త్రి ప్రాచీన పండితుఁడై నవీనపథకములు తెలియనివాఁడగుటచే 'చందోయి' మొదలగు నుదాహరణములను తన వ్యాకరణములో నిచ్చె ననియు, సూరి నవీనకాలమున విద్యార్థులకు తగినట్టు లౌచిత్యమును పాటించి పాఠము చెప్పవలసినవాఁడగుటచే దానిని కందోయిగా మార్చెననియు నందురు. కాని సూరియే ఒకసూత్రమున యువతీవిటిరజస్వలల పేర్కొనుటచే నిట్టి మార్పు కావించియుండఁ డని మనము చెప్పఁగలుగుచున్నాము. ఈ వాదమునకు ముఖ్యులు కల్లూరి వెంకటరామశాస్త్రిగారు. వీరు గుప్తార్థప్రకాశికయందు పదునాలుగు యుక్తులను వివరించి యిది చిన్నయసూరి కృతము గాదనియు, కృష్ణమూర్తిశాస్త్రి గారి రచనమే యనియు సిద్ధాంతీకరించియున్నారు. ఈ సిద్ధాంతమును పూర్తిగ ఖండితమైనది.* కావున నిచ్చట నప్రస్తుతము.

* ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక (1927) - ఆంధ్రవిశ్వకళాపరిషత్పండితులగు విద్వాన్ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారి వ్యాసము.

## బాలవ్యాకరణ వివరణము

బాలవ్యాకరణమున నీక్రిందిపరిచ్ఛేదములును, సూత్రములును గలవు:—

| | | |
|---|---|---|
| 1. సంజ్ఞాపరిచ్ఛేదము.<br>ఈపరిచ్ఛేదమున వర్ణసమామ్నాయమును భాషావిభేదములును తెలుపఁబడినవి. | సూత్రములు | 23 |
| 2. సంధిపరిచ్ఛేదము.<br>ఇది సంధులనుగూర్చి తెలుపును. | ,, | 55 |
| 3. తత్సమపరిచ్ఛేదము.<br>ఇది సంస్కృత సమములనుగూర్చి తెలుపును. | ,, | 87 |
| 4. ఆచ్ఛికపరిచ్ఛేదము.<br>ఇది అచ్చతెనుఁగు పదములఁగూర్చి తెలుపును. | ,, | 38 |
| 5. కారకపరిచ్ఛేదము.<br>ఇందు విభక్తుల కొకదానికి, మరియొకదానికిఁ గల సంబంధము తెలుపఁబడినది. | ,, | 37 |
| 6. సమాసపరిచ్ఛేదము.<br>ఇందు సంస్కృతాచ్ఛికమిశ్రసమాసభేదములు వివరింపఁబడినవి. | ,, | 26 |
| 7. తద్ధితపరిచ్ఛేదము.<br>ఇది తెనుఁగున విశేష్యప్రత్యయములను తెలుపును. | ,, | 28 |

8. క్రియాపరిచ్ఛేదము. సూత్రములు 124
ఇందు తెనుఁగు సంస్కృతిధాతువుల నుండి యేర్పడిన క్రియలయొక్క రూపనిష్పత్తి యంతయును వివరింపఁబడినది.

9. కృదంతపరిచ్ఛేదము. „ 22
ఇందు క్రియలమీఁద నేర్పడిన విశేష్యములు తెలుపఁబడినవి.

10. ప్రకీర్ణకపరిచ్ఛేదము. „ 25
ఇందు పూర్వపరిచ్ఛేదములలో వదలి పెట్టఁబడిన విషయములు వివరింపఁబడినవి.

10 పరిచ్ఛేదములు. సూత్రములు 465

భాషాసంప్రదాయముల నామూలాగ్రముగా పఠించి యంతకుముందు లేని సంస్కృతవ్యాకరణపద్ధతిని నాలుగు వందలయఱువదియైదుసూత్రములతో ప్రామాణికమగు ప్రశస్త వ్యాకరణము పది పరిచ్ఛేదములలో రచించిన చిన్నయసూరి ప్రతిభ యనన్యసామాన్యమైనది కదా! ఈ వ్యాకరణవిశిష్టత నిట్లు నిరూపింపవచ్చును:

౧. సూత్రములు సంగ్రహముగ నుండుటవలన కంఠస్థముచేయుట కనుకూలమైయున్నవి.

౨. వ్యర్థపదములు లేకుండుటచే వ్యాకరణవిషయము సరిగా గ్రహించుట కనువుగా నున్నది.

3. ఈ వ్యాకరణపఠనవలన సంస్కృతభాషావ్యాకరణ పరిపాటి గ్రహించుటకు వీలు గలిగియున్నది.

౪. తెనుఁగువ్యాకరణమునకు శాస్త్రీయమగు వ్యాకరణ పరిభాష (Grammatical technique) యంతకుముందు లేదు. ఈవ్యాకరణమున ఆయాపారిభాషికపదములు సందర్భము ననుసరించి చక్కఁగా వ్యవహృతములైనవి.

౫. ఇంతకుముందున్న వ్యాకరణములు కేవలము తెనుఁగు భాషా సంప్రదాయములను విపులముగావివరించినవే కాని తెనుఁగునకు, సంస్కృతమునకుఁ గల యవినాభావసంబంధమును గుర్తించి రచితములు కాలేదు. ఇం దాసంబంధము తేటతెల్లముగా నిరూపితమైనది.

౬. దీనికి పూర్వవ్యాకరణములు వ్యావహారికభాషనే ప్రధానముగా గ్రహించి వ్రాయఁబడినవి. బాలవ్యాకరణము పండితవ్యవహారమున నున్న గ్రాంథికభాషనే యాధారముగాఁ గొని రచింపఁబడినది.

౭. ఈనాఁడు ప్రాచీనప్రయోగములను లక్ష్యలక్షణ సమన్వయము కావించుటకు బాలవ్యాకరణ మెంతో సహాయకారి యగుచున్నది.

౮. ఇతఃపూర్వవ్యాకరణములం దింత విశదముగ పరిచ్ఛేద విభాగముగాని, సూత్రముల పరస్పర సంబంధముగాని యెందును గానరాదు. దీనివలన వ్యాకరణము నభ్యసించు పాఠకుల దృష్టమును గంభీరము నగు వ్యాకరణ విషయమద్దమునందువలె స్వచ్ఛముగా కనఁబడుచున్నది.

ఆంధ్రవాఙ్మయమున నన్నయనాఁటినుండియు నే వ్యాకరణకర్తలును లాక్షణికులును సాధింపలేని వ్యాకరణ రచన

మను నొక మహాకార్యమును చిన్నయసూరి మహాసమర్థతతో నిర్వహించి యాచంద్రార్కము తన నామము భాషా ప్రపంచమున ప్రకాశవంతమగునట్లు నిలుపుకొనినాఁడు. భాషా పాండిత్యమునకు శబ్దశుద్ధి, శబ్దసిద్ధి ప్రధానములు. ఈ రెండు గుణములను సమ్మేళనముచేసి రచనలను గావించి కవులు శాశ్వతమగు కీర్తిని గడించుటకు మార్గదర్శకమైనది బాలవ్యాకరణము. ఇది భాషాకల్పకమునకు నిత్యపరిమళములను వెదజల్లు పారిజాతసుమమువలె సర్వకాలములను వాసింపఁగలదు. ఇట్టి రచనఁ గావించిన చిన్నయసూరి పాఠకలోకమునకు, పండిత లోకమునకు ప్రాతఃసంస్మరణీయుఁడు గదా!

బాలవ్యాకరణమునే కాక, చిన్నయసూరి భాషాశాస్త్ర ప్రాథమిక విద్యా శిక్షణ కనుకూలమగు రచనలను గావించి యున్నాఁడు. అక్షరాభ్యాసము మొదలాంధ్ర వచన రచనా పరిణతికి నవి తోడ్పడునవి.

## అక్షర గుచ్ఛము

బాలురు, బాలికలు ప్రథమమున భాష నేర్చుకొను నపుడు సరియగు వర్ణక్రమమును గుణితమును సక్రమరీతి నభ్యసింపఁజేయుటకై చిన్నయసూరి యకారాదిక్రమమున నీ యక్షర గుచ్ఛమును రచించి ప్రకటించెను. ఇదియును చాల కాలమువఱకు పాఠశాలలలో ప్రాథమిక విద్యాభ్యాసపరుల కుపయుక్తమై యుండెడిది. ఇందు ముందుగా నచ్చులును, పిమ్మట హల్లులును, ఆ వెనుక నచ్చులతో కూడిన హల్లులు గల చిన్న పదములును తెలుపఁబడినవి. సంస్కృత పదముల యుచ్చా

రణమునుబట్టి చక్కఁగా వ్రాయుటకును తెనుఁగు వ్రాఁతయందు తప్పులు లేకుండ నుండుటకును మిక్కిలి యుపకరించుచున్నది. గుణింత క్రమమునకు వీరు కొన్ని సూత్రములనుకూడ నచ్చుటచ్చుల రచించిరి. వ్యాకరణ సూత్రములుకూడ కొన్నింటి నచ్చుటచ్చుటఁ జేర్చిరి. ఇట్లు పదములు తెలిపిన వెనుక క్రియా రూపములు చెప్పఁబడినవి. ఇవి రెండువిధములుగా విభజింపఁ బడి యున్నవి: ౧. తత్సమ క్రియలు, లేక సంస్కృత సమ క్రియలు, ౨. వికృతి క్రియలు, లేక దేశ్యక్రియలు. సంస్కృత క్రియలలో ఇతంజంతములు, మతుబంతములు, ఇన్వంతములు, మత్వర్థీయములు, ఆల్వంతములు, భావప్రత్యయాంతములు, తవ్యాంతములు, అనీయంతములు, తుజంతములు, యుడంత ములు మొదలగు వ్యాకరణ పారిభాషికము లనేకము లిందు తెలుపఁబడినవి. వికృతి రూపములకు భూత వర్తమాన భవిష్య దర్థక రూపములును చూపఁబడినవి. కేవలము బాలు రుచ్చ రింపలేని కష్టతమమైన యుచ్చారణమును సులభ రీతిని గ్రహించుటకు నిందు ప్రయత్నము చేయఁబడియున్నది. ఇది యెంతయు శ్లాఘనీయమై యున్నది. నేఁటి స్వరశాస్త్ర పద్ధతులను, అనగా Phonetic laws ననుసరించి యిది విరచిత మైనది. ఈ అక్షరగుచ్ఛము చదువుటచే సంస్కృతాంధ్ర ముల రెండింటిని చక్కఁగా నలవఱచుకొనవచ్చును. భాషా భ్యాసకులకు నిది ప్రథమ సోపానమువంటిది యని చెప్ప నొప్పును.

### విభక్తి బోధిని

భాష నభ్యసించువారు తొలుత నక్షరములను, గుణింతములను నేర్చుకొందురు. ఆ వెనుక పదములు నేర్చుకొందురు. వీని రెండింటికొఱకు చిన్నయసూరి అక్షర గుచ్ఛమును రచించెను. ఇఁక పదములు నేర్చుకొన్న వెనుక నొక పదమునకు మఱియొక పదమునకుఁ గల సంబంధమును తెలిసికొనవలయును. దీనికొఱకు చిన్నయసూరి 'విభక్తి బోధిని' యను గ్రంథమును రచించెను. ఇది సంస్కృతమున శబ్దమంజరి ననుసరించి రచితమైనది. ఇందు తత్సమ శబ్దములకు, అచ్ఛిక శబ్దములకు ప్రథమాది సప్త విభక్తులయందు వచ్చు రూపములు చూపఁబడినవి. ఆ పైని సర్వ నామములకుఁగూడ సప్తవిభక్తి రూపములును కనఁబఱుపఁబడినవి. సంస్కృత భాషాభ్యాసకులకు శబ్దమంజరివలె నాంధ్రమున నిది విద్యార్థుల కత్యంతోపకారియై వెలయుచున్నది. దీనినికూడ పాఠశాలల యందు చాలకాలమువఱ కుపయోగించెడివారు.* ఇది ప్రస్తుతము ప్రచారమున లేకున్నను మరల ప్రచారములోనికి తేఁదగినది.

* ఏఁబదేండ్ల క్రిందట-నా చిన్నతనమున మా నాయనగారి 'విభక్తి బోధిని' ని శబ్దమంజరివలె వల్లింపఁజేసిరి.

# 10. చిన్నయసూరి నిఘంటువు

బాలవ్యాకరణమును, నీతిచంద్రికనేకాక చిన్నయసూరి భాషకంతటికి నాధారమగు నొక నిఘంటువును రచించెను. అది యముద్రితమగుటచే లోకమునకు వెల్లడికాలేదు. కాని చిన్నయసూరి శిష్యులును, శబ్దరత్నాకర నిఘంటుకర్తలు నగు బహుజనపల్లి సీతారామాచార్యులవారు తమ నిఘంటు పీఠికయందు నిఘంటువుయొక్క యావశ్యకతనుగూర్చి, సూరిగారి గ్రంథమునుగూర్చి యిట్లు ప్రశంసించియున్నారు:

"జనులు తమ తమ భాషలయందు సంపూర్ణజ్ఞానమును సంపాదించుకొనుట యత్యావశ్యకము. ఆ జ్ఞాన మాయాభాషాగ్రంథములను దలస్పర్శముగఁ జదివిననేగాని కలుగనేరదు. అట్లు చదివి పదార్థపరిజ్ఞానమును బడయుటకు ముఖ్యసాధనంబులు నిఘంటువులు. ఆ నిఘంటువులు నీ దేశభాషలయం దింగ్లీషునందువలె వచనరూపములుగాక సంస్కృతమునందుంబలెఁ బద్యరూపములుగా నున్నయవి. అట్లుండుటచే విద్యార్థుల కవి సుబోధకంబులు గావు. ఆ హేతువుఁబట్టి ముందు సంస్కృతమునందుఁ బద్యరూపములుగా నుండిన నిఘంటువులన్నియు నిప్పుడు అకారాదిక్రమమున వచనరూపములుగా నేర్పఱుపఁబడియున్నవి. ఇంకను కొన్ని యేర్పఱుపఁబడుచున్నవి. అట్లే యాంధ్ర ద్రవిడాది భాషలయందును కొన్ని యేర్పఱుపఁబడియున్నవి. అందు ద్రవిడాది భాషల కేర్పఱుపఁబడినవేమో విద్యార్థుల యుపయోగమునకుఁ జాలునంతటివిగాను, లక్ష్యావిరుద్ధములుగాను నున్నవి. ఈ ఆంధ్రమున కేర్పఱుపఁబడియుండు నొకటి రెండు నిఘంటువులన్ననో యట్లు కావు.

కావున నీలోపంబు బాపం గొంతకాలంబునకుముందు సంస్కృతాంధ్రములయందు విశేషపాండిత్యంబు గలిగి యాసేతుహిమాచలము

చాలఁ బ్రసిద్ధి వహించియుండిన పరవస్తు చిన్నయసూరిగారు జీవితులై యుండినకాలమున దీర్ఘసూత్రతతో ననేక గ్రంథ పరిశోధనంబు గావించి మిగుల విరివిగఁ, బ్రయోగ సహితంబుగ అకారాది తెనుఁగునిఘంటువొకటి వ్రాయ ప్రారంభించి నడపుచుండిరి. ఆ మహాప్రారంభము చూచి యది పరిపూర్తియగుటకు బహుకాలము చెల్లు ననియుఁ, బరిపూర్తియైనను నందు తెనుఁగుపదములుమాత్రమే చేర్పఁబడియుండుటంజేసి యది విద్యార్థుల కంతగా ప్రయోజనకారి కాఁజాల దనియు, నిదిగాక బహుళముగ్రంథముఁ జదివెడు విద్యార్థు లంత పెద్ద పుస్తకము కొని యుంచుకొనుట కష్టముగా నుండుననియు నూహించి... ........అకారాదినిఘంటు వొకటి వ్రాసి శీఘ్రకాలముననే పూర్తిచేసెదఁగాక యని మిక్కిలి పూనికతో దీని వ్రాయ నుద్యమించితిని.”

పై నుదాహరించిన యంశమునుబట్టి చిన్నయసూరికి ముందు నిఘంటువులయందు కొన్ని లోపము లున్నవనియు, నా లోప నివారణార్థము చిన్నయసూరి ఈ నిఘంటురచనమును ప్రారంభించెననియు స్పష్టమగుచున్నది. పూర్వనిఘంటువుల స్వరూప మెట్టిదో, వాని గుణాగుణము లెట్టివో మనము తెలిసి కొనినఁగాని చిన్నయసూరి రచనమునందలి విశిష్టతను మనము గ్రహింపఁజాలము. సంస్కృతమునకు బహుప్రాచీనకాలము నుండియు నిఘంటువు లున్నను తెనుఁగుభాషలో క్రీ. శ. 17-వ శతాబ్దినుండియే బయలుదేఱినవి. తత్సమపదములను విడిచి యచ్చతెనుఁగుభాషలో కావ్యములు వెలయుటయే యీ నిఘంటు రచనమునకు దారి తీసినది. ఈ తెనుఁగు నిఘంటువు లన్నియును పద్యాత్మకములును, పర్యాయపదములు తెలుపు నవియు నైయున్నవి.

## పూర్వనిఘంటువులు-పద్యకృతులు

వీనిలో మొదటిది పైడిపాటి లక్ష్మణకవి కృతమగు 'ఆంధ్రనామసంగ్రహము'. దీనిలో లేని విశేషములను అడిదము సూరకవి 'ఆంధ్రనామ శేషము'న రచించెను. ఇవి కళింగదేశము లోనివి. రాయలసీమలో *కవిచౌడప్ప సీసము లనుపేర నొక నిఘంటువు నిర్మించెను. దక్షిణాంధ్రదేశమున గణపవరపు వేంకట కవి 'వేంకటేశాంధ్రము'ను, కస్తూరి రంగకవి 'సాంబనిఘంటువు'ను' వెలసినవి. కాని, వీని యన్నింటికన్న పుదుకోట లో వెలసిన 'ఆంధ్రభాషార్ణవము' అను నాంధ్రామరము చాల ప్రసిద్ధి వడసినది; సర్వాంధ్రదేశమున ప్రచారమున నున్నది. దీని వెనుక విశేషాంధ్రము, సర్వాంధ్రసార సంగ్రహము, దేశ్య నామాంత కోశము, ఆంధ్ర పదాకరము మున్నగు తెనుఁగు నిఘంటువులు బయలువెడలినవి. కాని, వీనియందు నేవిధమైన ప్రత్యేకతయు లేదు. ఇవియన్నియు పద్యమయములే. కావున నవీనులకు సుగ్రాహ్యములై యుపయోగకరములు కావు. ఇంతేకాక యివి కావ్యములలో ప్రయుక్తములైన పదములను మాత్రమే విపులముగా నర్థ కరించునుగాని యొక్కడు పదజాలము ప్రదర్శింపఁజాలవు.

---

* దీనిని తొలుత శ్రీ నిడుదవోలు శివసుందరేశ్వరరావు (యస్. యస్. యస్. రావు) ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము బులెటిన్‌లో ప్రకటించి లోకమునకు వెల్లడించినాఁడు.

## నవీన నిఘంటువులు

నవీనయుగము ప్రారంభమైన వెనుక ప్రాచీన నిఘంటువులు నవీన విద్యాప్రణాళికకు సరిపోలేదు. అందుచే నూతనరీతిని నిఘంటువు లేర్పడవలసిన యావశ్యకత కలిగినది. పద్యరూపమునకాక వచనరూపమున నిఘంటువులు రచితములు కావలసి వచ్చెను. అందకారాదిగా పదములు సరికూర్చి యర్థము నెదురుగ వ్రాసినఁగాని జనబాహుళ్యమునకు, విద్యార్థిలోకమునకుపయుక్తములు కావు. అట్టివానిలో మొట్టమొదట వెలువడినది మామిడి వెంకయ్య యను ప్రసిద్ధ వైశ్యపండితుఁడు రచించిన 'ఆంధ్ర దీపిక' యనునది. ఇది క్రీ. శ. 1816 లో రచితమై 1849 లో ముద్రితమైనది. ఈకాలముననే ఆంగ్లేయులుకూడ తెనుఁగు నభ్యసించి, తెనుఁగునకు నింగ్లీషుభాషలో నిఘంటు రచనమును వ్రాయుట ప్రారంభించిరి. అట్టివారిలో కాంబెల్ అను నాతఁడు ముఖ్యుఁడు. ఈతఁడు 1821 లో కాంబెల్ నిఘంటు వనుపేర తనగ్రంథమును ప్రకటించెను.

దీనివెనుక ఆంధ్రభాషోద్ధారకుఁడై మహాప్రసిద్ధిచెందిన బ్రౌను మహాశయుఁ డొక పెద్దనిఘంటువు నిర్మించెను. ఇదియే బ్రౌను నిఘంటు* వనుపేరఁ బరఁగుచున్నది. ఇది 1852–వ సంవత్సరమున నచ్చొత్తింపఁబడినది. అంతకుముందు నిఘంటువులకన్న నీ నిఘంటువునందు రెండు మూఁడు విశేషములు కలవు.

---

* ఈ యపూర్వ నిఘంటువును నేఁ డాంధ్ర సాహిత్య అకాడమీవారు పునర్ముద్రణము గావించుచున్నారు.

౧. తెనుఁగుపదములకు తెనుఁగర్థములే కాక ఇంగ్లీషు భాషలో నర్థము లియ్యఁబడినవి.

౨. పదములకు ఆ యా గ్రంథములనుండి ప్రయోగములు సేకరింపఁబడి యుదాహృతములైనవి.

3. ఆశ్వాస సంఖ్యయు, పద్యసంఖ్యయుకూడ నీయఁబడి యున్నవి.

౪. ఈ నిఘంటువుతోకూడ అన్యభాషాపదము లగు హిందుస్థానీ ఫారసీ యింగ్లీషు తమిళము • మహారాష్ట్రములకు సంబంధించినపదములుకూడ "మిశ్ర నిఘంటువు" అనుపేర రచితమైనది.

౫. ఈ గ్రంథమున కొక యమూల్యమగు పీఠికకూడ చేర్పఁబడియున్నది. అందు కొంతమంది కవులనుగూర్చి, కావ్యములనుగూర్చి విశేషములు తెలుపఁబడినవి. ఇట్లున్నను ఈ నిఘంటువునందు గ్రాంథిక పద్ధతికి ననుకూలమగు రచన లేదు. ఇందు శకటరేఫములుగాని, అర్ధానుస్వారములుగాని పాటింపఁబడలేదు. దంత్యతాలవ్యములు—అనఁగా "చ చ", "జ జ"లు వేఱువేఱుగా చూపఁబడక ఆ యా వర్గములయందే చూపఁబడినవి. దీనివలన ప్రాచీన కావ్య సంస్కరణమునకు వలయు పదములయొక్క సరియగు రూపములను తెలిసికొనుటకు, పాఠభేదములు గ్రహించుటకు మాత్రమే వీలగుచున్నది కాని వ్యాకరణ సంప్రదాయములను, ప్రయోగ విశిష్టతను గ్రహిం

చుట కుపయుక్తమగుటలేదు. కాఁబట్టి యీనిఘంటు వున్నత సాహిత్య విద్యాప్రణాళికకు తోడ్పడలేదు.

### చిన్నయసూరి నిఘంటువు

పై నిఘంటువులలోని లోపములన్నియు గమనించి ఆంధ్రవ్యాకరణ లక్షణమునకు లక్ష్యముగ నుండునట్లుగను, రూపనిష్పత్తులనుగూర్చి స్పష్టమైన పరిజ్ఞానము కలుగుటకును, ఒకే పదమునకు సందర్భము ననుసరించి యేర్పడుచుండు నర్థచ్ఛాయలు విదితమగునట్లుగను నొక నిఘంటువును చిన్నయసూరి వ్రాయ నుద్యమించెను. దానికొఱకు కాతఁడు వాఙ్మయమున ప్రామాణికులగు మహాకవుల కావ్యములను పఠించి తానే స్వయముగా నందలి పదములను తీసి వ్రాసుకొనెడివాఁడు. ఆ కాలమునం దిప్పటివలె నచ్చుపుస్తకములు విశేషముగ లేవు. కేవలము తాళపత్ర ప్రతులను పరిశీలించి చిన్నయసూరి పరిశ్రమ చేయవలసివచ్చెను. ఈ సందర్భమున నాతఁడు చేసిన పరిశ్రమ యనితర దుర్గ్రాహ్యమని చెప్పనొప్పును. తాను చూచిన ప్రతి పదమును బాగుగా విమర్శించి చూచుకొను బాధ్యత చిన్నయసూరియం దుండుటచే నాతని నిఘంటువు కొంతవఱకు సాగినను అతని జీవితకాలములో సంపూర్తి కాలేక నిల్చినది. పైని వివరించినట్లుగా నిందు తెనుఁగు పదములకే ప్రాధాన్య మియ్యఁబడియున్నది. కొలఁదిగా సంస్కృత పదములుకూడ కలవు. ఈ నిఘంటువు నేడు సంపుటములలో సూరి స్వయముగా వ్రాసియున్నాఁడు. ఇది

చిత్తుప్రతి యని చెప్పనొప్పును. పేరునకు చిత్తుప్రతియే గాని సూరి ఎక్కడను కొట్టు తుడుపులైనను లేకుండ వ్రాసి యున్నాఁడు. కాని వ్రాయవలసిన విషయములు వ్యత్యస్తముగా నుండుటచే క్రొత్తవానిని చేర్చి తిరుగ దానిని సాఫీగా వ్రాయవలసివచ్చినది. మరల నట్టి నిఘంటువు ప్రథమ సంపుటము సూరియే స్వయముగా వ్రాసియున్నాఁడు.* ఇందులోని పదములు సూర్యరాయాంధ్ర నిఘంటువున తీసికొనఁబడి "చి. ని" అను సాంకేతికముతో చూపఁబడినవి. ఈ నిఘంటువులే కాక అతఁడే యే గ్రంథములనుండి పదములను తీసెనో యవి కూడ భద్రపఱుపఁబడినవి. వానిలో నీ క్రింది గ్రంథములు కలవు.

1. కవిత్రయరచితమహాభారతము. 2. మహాభాగవతము, 3. భాస్కర రామాయణము, 4. నిర్వచనోత్తర రామాయణము, 5. పద్మపురాణము, 6. శృంగారనైషధము, 7. కాశీఖండము, 8. భీమఖండము, 9. హార విలాసము, 10. సింహాసనద్వాత్రింశిక, 11. చంద్రాంగదచరిత్రము, 12. దాశరథీశతకము, 13. లావణ్యశతకము, 14. హరభక్తవిలాసము, 15. ఆంధ్రభాషార్ణవము మున్నగునవి.

పై ప్రణాళికనుబట్టి నిఘంటు పదములను చిన్నయసూరి మూలగ్రంథములనుండియే పరిశీలించి గ్రహించెనని తెలియఁదగును.

---

* ఇవి చాలకాలమువఱకు శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయమున నుండెడివి. నేఁడెక్కడ విలయమైనవో తెలియుట లేదు.

# 11. కృత్యంతరవములు

## నీతిసంగ్రహము

నీతిసంగ్రహ మను నీ గ్రంథము చిన్నయసూరిచే ప్రాచీన కవులనుండి ఏర్చి కూర్చఁబడినది. అందులోను ముఖ్యముగా భారతమునుండి ఆయా సందర్భములనుండి గ్రహింపఁబడినవి, చిన్నయసూరి అచ్చటచ్చట తాను స్వంతముగా రచించిన పద్యములనుకూడ చేర్చియున్నాఁడు. ఇందు నూఱు పద్యములు గలవు. ఇవన్నియు నీతి బోధకములే. దీని కొక టిప్పణిగూడ నుండుటచే నాలుగైదు తరగతుల బాల బాలికల కవశ్య పఠనీయముగా నుండెడిది.

ఇందుఁ గందపద్యములు తేటగీతు లాట వెలఁదులు 104 పద్యములు గలవు. మచ్చునకు రెండింటి నుదాహరింతును—

శ్రీ నొసఁగు యశము పెంచు న
నూనప్రమదంబుసేయు నురుదోషంబుల్
తో నడుచుఁ గరము విమల
జ్ఞానము మెఱయించు సాధుసంగతిఁ దలపన్.

భారతాది గ్రంథములనుండి పద్యములు గలవు.

జ్ఞానసిద్ధికం టెఁ జర్చింప సకల సి
ద్ధులును లొచ్చుగానఁ దొలుత దాని
గడనసేయవలయుఁ బెడపక దాన న
నూనమైన సౌఖ్య మొందు నరుఁడు.

## ఆంధ్రధాతుమాల

చిన్నయసూరి యాంధ్రభాషకు ధాతువులనుగూర్చి 'ఆంధ్ర ధాతుమాల' యనుపేర నొక గ్రంథమును రచించెనని యాంధ్రసాహిత్య పరిషత్తువారు క్రీ. శ. 1930 లో ముద్రించి ప్రకటించిరి. ఇది చిన్నయసూరి గ్రంథములయందు వ్రాతలో నాతని స్వంత యక్షరములతో లిఖింపఁబడియుండుట చూచి పరిషత్తువారు దానిని చిన్నయసూరి కృతముగా ప్రకటించి యున్నారు. కాని, గ్రంథమునందలి కొన్ని రూపములు పరిశీలించిన, అది యాతని రచన గాదని తెలియుచున్నది. ఈ 'ధాతుమాల'కు పీఠికను వ్రాసిన విద్వాంసులుకూడ ఈ కర్తృత్వ విషయమున కొంత సందేహమును చూపియుండిరి. ఆ సందేహము నిశ్చయమైనది. ఏలనఁగా దీనిని వాస్తవముగా రచించిన వారు వేదము పట్టాభిరామశాస్త్రిలవారు.

ఆ విషయము బ్రౌనుదొరవారి వ్రాఁతలనుండియు, 'ఇల్లిసు' అను భాషా తత్వవేత్త ప్రకటించిన గ్రంథము వలనను తెలియఁగలదు. అందు చిన్నయసూరి మతమునకు విరుద్ధమైన ధాతువులు, వ్యావహారికములు చాలఁ గలవు. దీనిని గూర్చి నేను సమగ్రముగ వేదము పట్టాభిరామశాస్త్రిగారి 'పట్టాభిరామ పండితీయము' పీఠికలో చర్చించితిని. 'ధాతుమాల' సూరి రచన మెంత మాత్రమును కాదని సారాంశము.

## ఆంధ్రశబ్ద చింతామణి వ్యాఖ్య

చిన్నయసూరి తన బాలవ్యాకరణమును నన్నయవిరచితమగు ఆంధ్రశబ్ద చింతామణి ననుసరించి రచించెనని బాల

వ్యాకరణ వ్యాఖ్యాత లెల్లరును వ్రాసియున్నారు. ఇది యెంతేయు సమంజసమే. తెనుఁగునకు సంస్కృత భాషలో రచితమైన వ్యాకరణములలో ఆంధ్రశబ్ద చింతామణి, అథర్వణ కారికావళి ముఖ్యములు. చిన్నయసూరి అథర్వణ వ్యాకరణమునుకూడ నుదాహరించెను. కాని దానికంత ప్రామాణికత నీయలేదు. ఆంధ్రశబ్ద చింతామణికే యత్యంత ప్రామాణికత మిచ్చి దాని ననుసరించుటయేకాక దానికొక వ్యాఖ్యానమును కూడ రచించియు నుండవచ్చును. కాని, యిప్పు డా వ్యాఖ్యానము లభ్యమగుట లేదు. చిన్నయసూరి వ్యాకరణ రచనమునకు నెట్టి పరిశ్రమ చేసెనో ఈ వ్యాఖ్య లభ్యమైనచో మనకు తెలియఁజేయఁగలదు. ఈ రచనా కాలమునాఁటికి సంస్కృత మూలమగు నాంధ్ర శబ్ద చింతామణి ముద్రితమై యున్నది. కాని, చిన్నయసూరి దాని నుపయోగించెనో లేదో తెలిసికొనుటకు మన కవకాశములు లేవు. పండిత లోకములో నిది ప్రచారమున నున్నట్లు లేదు.

## విశ్వనిఘంటు టీక

చిన్నయసూరి సంస్కృత భాషలో నున్న 'విశ్వనిఘంటువు' నకు తెలుఁగున టీక వ్రాయ ప్రారంభించి, కొంత వఱకు రచించెనని 'సుజన రంజని' పత్రిక తెలుపుచున్నది.* ఆ యసమగ్ర భాగమును లభింపలేదు.

* ఈ విషయము 'చిన్నయసూరిని గూర్చిన యభిభాషణలు' అను శీర్షికలో చూడనగును.

# 12. పద్యరచన

చిన్నయసూరి కేవలము వచనరచనా సంప్రదాయము నెలకొల్పిన విద్వాంసుఁడే కాక ప్రశస్తమగు పద్యరచనా సంప్రదాయమును నిలిపిన విద్వత్కవి. నిఘంటువు పదముల సేకరించుటకు బహు మహాగ్రంథములను కూలంకషముగ పరిశోధించుటచేత సూరికి సలక్షణమును, సరసమును నగు కవితాధోరణి యలవడినది. ఒక మహాకావ్య మీతఁడైన వ్రాయుటకు నాతనికి తగిన యవకాశము లభింపలేదు. కాని ప్రాస్తావికముగ నాతని కవితానైపుణ్యమును ప్రదర్శించుటకు తగిన సందర్భములు తటస్థింపకపోలేదు. వీనిలో మొదటి రచన "రాణిగారి మకుటాభిషేకమునకు రచించిన పద్యములు." ఇవి విక్టోరియాచక్రవర్తిని క్రీ. శ. 1837-వ సంవత్సరమున సింహాసన మధిష్ఠించి నప్పుడు చిన్నయసూరి రచించిన పద్యములు. ఈ పద్యములు మనకు లభింపలేదు. ఆకాలమునందు నిట్టి పద్యరచనలను ప్రకటించుటకు పత్రికలును లేవు. అప్పటి కింకను కంపెనీవారి పరిపాలనయే వర్తిల్లుచుండుటచేత ప్రభుత్వమువారాపద్యములను ప్రకటింపలేదు. తర్వాతి పద్య రచనలలో పేర్కొనఁదగినవి పచ్చయప్పమొదలిమీఁద వ్రాసిన పద్యములు. సూరి తెలుఁగుపద్యరచనయందే కాక, సంస్కృత శ్లోకరచనయందు నసమానుఁడు. ఇందు పొందుపఱచిన రచనల వలన నాతని కవితా కమనీయత తేటపడును.

## పచ్చయప్ప యశోమండనము

(ఆంధ్రము)

క్రోధి 1846

మ. గగనం బట్టు రసప్రపూర్ణ విలసత్కాందంబుల న్మీఱి య
గ్రగసాలంబుగతిన్ సితచ్ఛదముల న్బాసిల్లి మేరుక్రియన్
జగదామోద సువర్ణభాస్వరముగా జానొందు పచ్చావనీ
శగుణంబు ల్గణుతించు కోశ మిది యిచ్చ న్మెచ్చు గావించెడిన్.

ఉ. శ్రీవరవర్ణనీమణికిఁ బ్రేమపదంబు బుధోత్కరంబు లెం
తే వినుతింపఁ బెంపగు నహీనమహీభృదుదారమౌళి సం
భావితపాదపద్ముఁడు గృపాపరిపూర్ణుఁడు శ్రీనివాసుఁ డా
ర్యావనుఁ డెప్డు పచ్చప ధరాధిప కీర్తులఁ బ్రోచుఁ గావుతన్.

చ. అసులయశోవిశాలుఁడు జితాంతరఘోరవిరోధిజాలుఁ డం
చితసుగుణాలవాలుఁడు విశిష్టవిహాయిత చాతురీ నిరా
కృతకవిజాతసాలుఁడు గిరీశ పదాంబుజభక్తిలోలుఁ డా
శ్రితపరిపాలుఁ డార్యనుతశీలుఁడు పచ్చనృపాలుఁ డెన్నఁగన్.

చ. అనయము భిక్షితాశనమ యాట విషాదభావముం
గొని వసనంబు లేవడికి గుంది సగం బయినట్టి పార్వతీ
శునిముకు ప్రోవ నన్న మిడి శుద్ధసుశాల సమర్పణంబులం
దనియఁగఁ జేసెఁ బచ్చ నరనాథుఁడు కేవల దాతృమాత్రుఁడే?

చ. అనవరతంబు డాసిన బుధాళి కభీష్టఫలంబు లిచ్చి భూ
జనులకు మేటి నా నెగడె సన్నుతమంజులతావిలాసముల్
దనరఁగ నాశ్రితాళుల నుదార రసాంబుధిఁ దేల్చు పచ్చపా
వనివిభు దానవైరుషికి వారక మ్రాన్పడు సౌరసాలముల్.

చ. నిరుపమ తావకీన కమనీయ యశశ్శరదాగమంబునం
బరపగు కల్మషంబు భువనంబు దొలంగుట యుక్తమే కదా

యాతనా ఘనాళిజీవనము నెత్తఁ గాంచి సహించు టొక్కటే
ధరణి విచిత్రమౌర సముదారగుణాకర పచ్చభూవరా.

చ. నెఱసె శరత్స్ఫురత్ప్రఖ్యాతి ధరణీస్థలి నెంతు సురాళిపాళికిం
బఱపుగ మీఱె సల్వలకుఁ బాండురపక్షము సర్వకాలముం
వెఱప యొకింతలేక నెవనీయయశంబు స్ఫుటంబు పేర్మిమై
వఱలఁగఁ బచ్చభూవరుని ధన్యులసద్గుణరత్నభూషణా.

సీ. తనమనోభీష్టప్రధానశౌండతకు కల్పద్రుమం బాఘలపాటు నొంద
ఘనలసద్గంభీరతాగుణస్ఫూర్తికి వాహినీపతి భంగపాటుఁ దొడరఁ
ఘన నిరంతర ధీరతామహిమకుఁ గట్ల రాయుఁడు పావసంక్రాంతిఁ బెరయఁ
దనసకలాభినంద్యతమమాలక్ష్మికిఁ బృథ్వీమహాదేవి క్రిందువడఁగ
వఱలు నీధన్యుఁ గుణమాన్యుఁ బరమపుణ్యు
సాధుజనగణ్యుఁ బోలంగ జగతిఁ గలరె
యనుచు నభినుతు లెల్లచో నల్లికొనఁగ
నుల్లసిలుఁ బచ్చపావనీవల్లభుండు.

సీ. ఆశావధూటి కాకేశపాశములకు మల్లికతల్లి సంపత్తి నెఱపి
యామినీ కామినీస్వామిపక్షమునకు స్వచ్ఛాంగరాగవిభ్రమ మమర్చి
వారాశిగూరుకు వారిజేక్షణునకు హీరవర్మశ్రీ రహింపఁజేసి
యామరసామజాతాస్యబింబమునకు ముత్యాల పెంగముట్టు ముఱువుఁ జూపి
డంబు దళుకొత్త నెవనియశంబు విష్టపంబునకు రవణంబు నందంబుమీఱు
నమ్మహాశీలు సుగుణాలవాలుఁ, బచ్చపన్నపాలు నిలఁబోలువారుగలరె?

సీ. చందనహిమవారిసమభిషేకంబున దలయేటి పెనునాచుఁ దలఁగఁజేసి
కమనీయకస్తూరికాసంకుమదచర్చఁ బూదిపూఁతల లొచ్చుఁ బోవ వెట్టి
హురుమంజిముత్యాల చెరఁగుపొంబట్టుచే దోలుచేలపు టేవఁ దొలఁగఁ ద్రోచి
యమృతోపమానదివ్యాన్నార్పణంబునఁ గంఠగరళకటుకత్వ ముడిపి

గీ. హరుమహాదేవు నిత్యసమర్పణక్రి, యాకలాపంబులనుఁ దనియంగఁజేయు
మహితబుధలోక జేగీయమానుఁడయిన, పచ్చనృపమౌళి యాశ్రిత పద్మ-
హేళి.

చ. అమృతకరుండు తారకము లాదిమనాగము దేవతాగవా
రము తగ నెంతకాలము గరంబు తిరంబుగ నుండు నాతెఱం
గమరఁగ నంతప్రొద్దు నిరపాయతఁ బచ్చనృపాలకీర్తుల
న్గొమరుగ శ్రీనివాసుఁడు గనుంగొని సత్కృపఁ బ్రోచుఁ గావుతన్.

## విశ్వావసు 1846

ఉ. శ్రీయలమేలుమంగ కుచసీమఁ బయంటఁ దొలంగఁ గాంచి కొం
తా యిటఁ గొండపై నిరతహర్షమునం దగి గోరువంక లిం
పై యలరారెఁ గంటె యన నారసి సిబ్బితిపూను నచ్చెలిం
బాయక కౌఁగలించు హరి పచ్చపకీర్తుల నిచ్చఁ బ్రోవుతన్.

చ. సతత మనంతభోగముల సన్నుతికెక్కినవాఁడు కల్మిగు
బ్బెత కిరవైనవాఁడు ఘనవిభ్రమ మూనిన మేనివాఁడు రా
జితగుణరత్నహారములచేఁ దులకించెడువాఁడు సూరివం
దితుఁ డగు శ్రీనివాసుఁ డిల నిచ్చలు పచ్చపకీర్తిఁ బ్రోవుతన్.

## పరాభవ 1847

ఉ. శ్రీ కనుగల్వదోయి వికసిల్ల దరస్మితచంద్రికావళిన్
లోకతమంబు లెల్లెడల లోఁగఁగఁజేసి బుధోత్కరంబున
స్తోకరసంబు గొల్పెడు విధుండు మహామహుఁ డిచ్చ నిచ్చలుం
జేకొని యుబ్బఁజేయు నృపశేఖరపచ్చపకీర్తివార్ధులన్.

ఉ. చల్లఁదనంబు లెల్లెడలఁ జల్లెడు మిన్కులవాఁడుగాని తా
నొల్లఁ డొకప్డు నుగ్రగతిరాజబుధావళిఁ దన్పుచోట రం

జిల్లఁగఁ జేర్చుఁగాని కొలఁ జెందఁ డొకప్పుడు బచ్చుపత్కుమా
వల్లభుఁ డీగుణాకరుని సాటియెరా జొకఁ డివ్వసుంధరన్?

క. భువన భరణ నిపుణుం డయి
తవిలి తనుం గొలుచు విప్రతతికోరకు లె
ల్లవగాఁగ గురియు పచ్చప
ధవుఁడు ఘనుఁడు గాఁడె యెవ్విధంబునఁ దలఁపన్.

---

## చిన్నయసూరిగారి సంస్కృత శ్లోకములు

### క్రోధి 1845

శ్లో. ఏకాంకలాం భువనజాతహితిం దధాన
స్సర్వజ్ఞతాం వద కథం లభతే గిరీశః
బహ్వీః కలా భువనజాతహితా దధాన
స్సర్వజ్ఞ ఏష ఖలు పచ్చపమానవేన్ద్రః.

శ్లో. శ్రీపచ్చయప్ప నరనాథ భవత్కరోద్య
ద్దానామ్బు వార్ధిజ యశోమయపూర్ణచన్ద్రమ్
దృష్ట్వా కలఙ్క మతిలజ్జితయా హిమాంశుః
కార్శ్యం ప్రయాతి బహుళం న దివా చకాస్తి.

శ్లో. గుణస్య బాధికాం వృద్ధిం కృతవాన్పాణినిః పురా
అబాధితగుణాం వృద్ధి మకరోత్పచ్చపప్రభుః.

శ్లో. పశ్యాయామహానయంద్యుపరితఃపూరాదిశశ్చాపయం
స్తత్రాస్మద్గజవాజిధేను తరవో మగ్నాః పునర్నేక్షితాః
ఏవం చారజనం బ్రువాణ మమర స్స్వామీహాస న్వక్తిభో
మాభైషీర్నని భజ్గవానయామతః పచ్చప్పకీర్తేర్మహః.

ఇవియేగాక, వ్యాకరణాదిగ్రంథములకు ముఖబంధముగా నాతఁడు రచించిన సంస్కృత శ్లోకములును నాతని కవితా పాటవమును ప్రదర్శించుచున్నవి.

# 13. సాహిత్య విద్యాప్రచారము

సూరి గ్రంథరచనమేకాక నా కాలమున సాహిత్య విద్యా ప్రచారమునకు బహుముఖములుగాఁ దోడ్పడిన మహనీయుఁడు.

ప్రాచీనగ్రంథ పరిష్కరణము

చిన్నయసూరి నన్నయ రచిత భారతములో 'ఆది పర్వము'ను పరిష్కరించి 1847 లో ప్రకటించినాఁడు. మఱియు, కూచిమంచి తిమ్మకవి 'నీలాసుందరీ పరిణయము' నకు తొలుత సుపరిష్కృత ముద్రణము వెలయించినది సూరియే.

పత్రికా సంపాదకత్వము

చిన్నయసూరి రచనా ప్రారంభ దశలో "వర్తమాన తరంగిణి" అను పత్రికకు వ్రాయుచుండెడివాఁడు. ఆ వెనుక "సుజన రంజని"* అను మాస పత్రిక నాతఁడు నడిపెను.

పఠనీయగ్రంథ సభాధ్యక్షత పదవి

క్రీ. శ. 1845 లోనే, అనఁగా, సూరి రాజధానీ కళాశాలకు రాకముందే- యాతఁడు చెన్నపురి పాఠశాలోపయుక్త గ్రంథకరణ సభకు (The Madras School Book and Vernacular Society) నధ్యక్షుఁడై తన జీవితాంతమువఱకు నం దుండెను. ఈ విషయము క్రీ. శ. 1866 'తత్త్వబోధిని' పత్రిక తెలుపుచున్నది.

* ఈ విషయము అముద్రితగ్రంథచింతామణి 1886 సంవత్సరము జూన్ నెల సంచికవలనఁ దెలియనగును.

# 14. శిష్యవర్గము

చిన్నయసూరి తన కాలమునందే సమకాలిక పండిత వర్గముచే పండితమండలికెల్ల నాయకుడుగా పరిగణితుఁడయ్యెను.

కాలము గడచినకొలఁది నీతనికి కొంత శిష్యవర్గము కూడ నేర్పడినది. వారిలో ప్రథములు ప్రఖ్యాతపండితులు బహుజనపల్లి సీతారామాచార్యులవారు (1827–1891). వీరు * శబ్దరత్నాకరనిఘంటువు నేకాక బాలవ్యాకరణమునకు శేష గ్రంథమగు ప్రౌఢవ్యాకరణ మను నొక వ్యాకరణమునుకూడ రచించియున్నారు. దీనికే త్రిలింగ లక్షణశేషమని నామాంతరము.

౧. వైయాకరణము రామానుజాచార్యులు: ఈతఁడు గొప్ప సంస్కృతాంధ్రపండితుఁడు. చిన్నయసూరికిని వీరికిని ప్రథమ సమావేశము పచ్చయప్పవార్షికోత్సవసందర్భమున సంఘటించినది. అప్పుడు రచింపఁబడిన పద్యములలో సూరి పద్యములకే ప్రథమ సత్కారము కావింపఁబడినది. నాఁటి నుండియు నీతఁడు సూరి ప్రతిభ గుర్తించి యాతని గురువుగా నంగీకరించెను. ఈతఁడు పద్యరచన చేయుటయేకాక మహాభారతము ఆదిపర్వమునంతటిని వచనముగా రచించెను. అది క్రీ. శ. 1847–వ సంవత్సరమున ముద్రితమైనది. ఒకవైపున

* ఈ శబ్దరత్నాకర మిటీవల (1960) అనుబంధవిశేషములతో నా సంపాదకత్వమున ప్రకటితమైనది. (C. L. S., Madras).

నన్నయభట్టారక రచితమైన పద్యభాగమును దాని కెదురుగా వేఱొకపుటయందు ఈ వచనమును ముద్రితమైనవి. ఈ వచనమును సూరి సంస్కరించియున్నాఁడు. ఆ గ్రంథము ముఖపత్రమున నిట్లున్నను తరువాతివారు దీనిని సూరి రచనముల యందు చేర్చుట శోచనీయము. (చూడుఁడు: ధాతుమాల పీఠిక). ఈ గ్రంథమునకు చిన్నయసూరి సంస్కార ముండుట చేతను, నీతిచంద్రికకన్న ప్రథమ వచనగ్రంథమగుటచేతను నిది తిరిగి ముద్రితము కావలసియున్నది.

3. వింజమూరి కృష్ణమాచార్యులు: ఈతఁడు అలంకారశాస్త్రమున ప్రత్యేకపండితుఁడై భట్టుమూర్తి రచితమైన కావ్యాలంకారసంగ్రహమును టీకాతాత్పర్యములతో ప్రకటించెను. ఇతఁడు కొంతకాలము పచ్చయప్ప కళాశాలలోను, ప్రభుత్వమువారి బోధనాభ్యసనపాఠశాలయందును పండితుఁడై యుండెను.

4. కరాలపాటి రంగయ్య (1819-1863): ఈతఁడా కాలమున సుప్రసిద్ధాంధ్ర పండితులలో నొకఁడు. సూరి కీతఁడు సమకాలికుఁడు. భూతపురీ మాహాత్మ్యము, కవి జన మనోహరము అను రెండు కావ్యములను రచించెను. ఈతఁడు మొట్టమొదట తాళపత్రములనుండి పాఠములు సంస్కరించి మహాభారతము, భాస్కర రామాయణము, రంగనాథ రామాయణము మున్నగు గ్రంథములను ముద్రింపఁజేసెను. ఈతఁడు చిన్నయసూరితో కొంతకాలమును, నా వెనుక నొక వత్సరమును రాజధానికళాశాలలో పండితుఁడుగా నుండెను.

౫. కొమ్మిశ్రీ రంగయ్యసూరి: ఈతఁడు సూరిగారికి సాక్షాత్ శిష్యుఁడు. సూరివలెనే చాత్తాద వైష్ణవకులమునకు చెందినవాఁడు. ఆతనివలెనే నీతిసంగ్రహ మను నొక చిన్ని గ్రంథమును రచించి ప్రకటించియున్నాఁడు. ఇదియును ముద్రితమై సూరి నీతిసంగ్రహమువలె పాఠశాలలకు మిగుల నుపయుక్తమై యున్నది.

౬. తంజనగరము రంగమన్నారయ్య: ఈతఁడు ప్రసిద్ధుఁడగు దేవరాయసుధి తండ్రి. కొన్ని సంస్కృతాంధ్ర గ్రంథములను రచించి ప్రాచీన గ్రంథములకు వ్యాఖ్యానములనీతఁడు వ్రాసెను. ఈతని వచనశైలియు మనోహరముగ నుండును.

సూరి సమకాలికులలో నాతని కనేకవిధముల సహాయ మొనర్చినవారు, మహాప్రసిద్ధులైనవారు నలుగురు గలరు. వారిలో కలువలపల్లి రంగనాథశాస్త్రిగారును, గాజుల లక్ష్మీనరసింహముశ్రేష్ఠి (1806–1868) ముఖ్యులు. ఇంక మిగిలిన వారిద్దఱు పాశ్చాత్యులు. ఒకరు ఆర్బత్‌నాటుదొరగారు; రెండవవారు బ్రౌనుదొరవారు. వీరిలో మొదటివా రాకాలమున విద్యాశాఖావిచారణాధికారి (Director of Public Instruction) గా నుండిరి. సూరి తన నీతిచంద్రిక నీదొరవారి కంకిత మొనర్చియున్నాఁడు. ఈదొరగారు సూరిని సువర్ణహస్తకంకణ మొసఁగి యెట్లు సత్కరించినదియు నింతకు క్రితమే వివరించి యున్నాను. ఇంక బ్రౌనుదొరవా రాకాలమున ఆంధ్రభాషా

వాఙ్మయమంతటిని పరిశోధించిన మహావిద్వాంసులు. వారు భారతదేశమున నడుగిడునప్పటికి చిన్నయసూరి పదునాల్గేండ్ల వాఁడు. చిన్నయసూరి పరమపదించుట కేడేండ్లకు పూర్వమే యాతఁడీదేశమును విడిచి వెళ్లినాఁడు. కావున వారిద్వరికిని, సమకాలికులైనను, సంబంధ మేమాత్రమును లేదు.

## చిన్నయసూరి కుటుంబము-అతని వ్యక్తిత్వము

చిన్నయ తన యుద్యోగధర్మమును నిర్వహించుచు సుఖ జీవనమును గడపుచుండెడివాఁడు. ఈతని కిరువురు కొమరులు. వారిలో ద్వితీయునికి శ్రీ రేకము రామానుజసూరిగారి పుత్రిక నిచ్చి వివాహమొనర్చిరి. ఈ రామానుజసూరిగారే చిన్నయ సూరివెనుక నాతని స్థానము నధిష్ఠించిరి. ఈయన కిరువురు కొమారులు. వారిలో ప్రథములు శ్రీ రేకము మణవాళయ్య గారు; రెండవవారు భాష్యకారులుగారు. మణవాళయ్యగారు సబ్ జడ్జి పనిని నిర్వహించుచు హైదరాబాదులో మూసినదీ ప్రవాహమున మరణించిరి. వారివద్ద సూరివృత్తాంతము కొంత యుండెను. కాని వారి మరణముతో నదియు నంతరించెను. మరియు రెండవవారగు భాష్యకారయ్యగారు తమ డెబ్బది యెనిమిదవయేఁట తమకు చిన్నయసూరిని గురించి తెలిసిన వృత్తాంతమును కాగితము మూలముగా వ్రాసియిచ్చిరి. దాని నుండియే పరిషత్తువారి సంపుటములయందు నీచరిత్రము ప్రకటింపఁబడినది.

చిన్నయసూరిగారు హయగ్రీవలక్ష్మీ మంత్రోపాసకులు. వా రనవరత మీమంత్రములను పఠించెడివారు. ఇప్పటి పండితులవలెఁ గాక వారు మిక్కిలి నియమముతో తమతమ ధర్మములను విధ్యుక్తముగా నాచరించువారు. వీరు వైష్ణవధర్మానుసరణముగ భక్తిశ్రద్ధలతో భగవన్నామమును జపించెడివారు. వీరియొక్క వేషభాషలనుగూర్చి ప్రసిద్ధపండితులు ప్రభాకరశాస్త్రిగా రిట్లు వ్రాసియున్నారు: 'చిన్నయసూరి స్ఫురద్రూపివై సన్నని లాల్చిని ధరించి శుభ్రవస్త్రములతో కన్పట్టువాఁడు; కండ్లకు సులోచనములను ధరించెడివాఁడు. ప్రతిదినము స్నానమునకు వెనుక నేదైన నొక భాషాప్రయోగమును క్రొత్త దానిని చూడకయే భోజనమునకు లేచెడివాఁడు కాఁడని ప్రతీతి. ఇట్టి నియమముతో భాషాపరిశ్రమ చేయుటఁబట్టియే చిన్నయసూరి రచనములు శాశ్వతములై యొప్పారుచున్నవి.''

చిన్నయసూరి విష్ణుభక్తిపరుఁడై తనగ్రంథములన్నిటిని శ్రీవేంకటేశ్వరస్వామికి కృతినొసంగెను. బాలవ్యాకరణాంతమం దుదాహరించిన ''శ్రీ స్తనాంచిత కస్తూరీ''యను శ్లోకము నాతని నిత్యానుసంధానపరాయణత్వము నుద్ఘోషించుచున్నది. పచ్చయప్ప యశోమండనమునఁగూడ శ్రీ వేంకటేశ్వరస్వామినే యాతఁడు ప్రశంసించియున్నాఁడు. ఈవిధముగా గ్రంథప్రారంభమున దైవస్తుతి యొనరించు ప్రాచీనసంప్రదాయము ననుష్ఠించి నిర్మలుఁడైన భగవద్భక్తుఁడగు పండితాగ్రేసరుఁ డగుటంబట్టి పండితలోకమున పూజనీయుఁడై వెలుగొందినాఁడు.

పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభమున ఆంగ్లేయుల పరి

పాలనతో నూతనాధ్యాయ మొకటి ఆంధ్రసారస్వతమున నేర్పడినది. పాశ్చాత్యులు పరభాషను తెలుఁగును నేర్చుకొనుటకు సులభమగు పద్ధతు లవలంబించుటచే వ్యావహారిక భాషకే గాని గ్రాంథికభాషకు నాస్కారము లేకపోయినది. ప్రాచీన గ్రంథములు సంస్కరింపఁబడినను నవి వ్యావహారికరీతిగా నుండుటచే ప్రాచీనసాహిత్యమునకు భాషాలక్షణములకు పండితులే కొంచెము సుదూరముగ నిలువవలసిన దశ యేర్పడినది. ఇట్లు వ్యావహారికపంక నిమగ్నమైన యున్నతపరిస్థితులలో చిన్నయసూరి యుదయించి సలక్షణమును, శాస్త్రసమ్మతమును, శాశ్వతమును నగు వైయాకరణ సంప్రదాయమును సుప్రతిష్ఠము గావించి తన్మూలమున గ్రాంథికవాఙ్మయప్రపంచమును పునరుద్ధరించినవాఁ డయ్యెను. ఇంతేకాక నవయుగవికాసమునకు తోడ్పడిన యుద్యమములయం దీతఁ డెట్లు పాల్గొన్నదియు నీతని రచనలే యుద్ఘోషించుచున్నవి.

ఆంధ్రవాఙ్మయప్రపంచమున నజరామరమును, నాచంద్రార్కము నగు యశస్సు సంపాదించి ప్రాచీనులగు నన్నయాది కవులతో తులతూఁగఁదగినవాఁ డీతఁ డొకఁడే. చిన్నయసూరి ప్రభవసంవత్సరమున (1806) ప్రభవించినాఁడు; దుందుభి సంవత్సరమున (1862) కీర్తిశేషుఁ డైనాఁడు. వాఙ్మయప్రపంచమున నాతని యశోదుందుభి నేఁటికిని రేపటికిని మాఱుమ్రోఁగుచునే యుండును.

## చిన్నయసూరిని గూర్చిన అభిభాషణములు.

### ౧. సుజనరంజని పత్రిక (1865 డిసెంబరు)

"ఈ వచనకావ్యము 'నీతిచంద్రిక' మిక్కిలి ప్రౌఢముగాను లక్షణములకు ముఖ్యలక్ష్యములుగాను జక్కనిప్రయోగములు గలదిగాను గానఁబడుటచేత లోకమునం దిది విశేషవ్యాప్తి గలిగియుండఁదగినది. దీనిని రచించిన పరవస్తు చిన్నయసూరి గారి కాంధ్రమునందును తదుపయుక్త సంస్కృత ప్రాకృతములయందు దలస్పర్శియగు పరిజ్ఞానము గలదని వారు చేసిన లక్ష్య లక్షణగ్రంథములే నిరూపించుచున్నవి. మేము వారితోడ చిరకాలము సావాసముచేసి యాంధ్రమునందలి యనేక విషయంబుల నెఱింగినవారము గనుక వారి పాండిత్యము మా కనుభవ సిద్ధము. వారు రచించిన గ్రంథములలో ముఖ్యములు:— శబ్దలక్షణ సంగ్రహము, బాల వ్యాకరణము, నీతిచంద్రిక. వీ రారంభించి ముగింపనివి అకారాదినిఘంటు వొకటి, సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణ మొక్కటి, విశ్వనిఘంటువునకు టీక యొకటి. ఈ మూఁడును ముగిసియుండెనేని యాంధ్రభాషకు మరి యపేక్షణీయ మేమియు నుండనేరదు. ఆంధ్రభాషయొక్క అభాగ్యమే వారిని కీర్తిశేషులను గావించెను. ఈగ్రంథములను సమగ్రములనుగాఁ జేయింపవలె నని Honourable గాజుల లక్ష్మీనరసింహులసెట్టిగారు, C. S. I. బహుప్రయత్నములు చేయుచున్నారు. వారియత్నము సఫలము కావలయునని మేము సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాము."

ఇట్లు

వింజమూరి కృష్ణమాచార్యులు
బహుజనపల్లి సీతారామాచార్యులు
కార్యంబి సుబ్బరాయలు

### ౨. కందుకూరి వీరేశలింగము (1848_1919)

ఉ. చిన్నయాసూరి ధీరు లెదఁజేరిచి సారెకు నాదరింపఁగా
మున్ను రచించి మించె సగమున్వచనంబుగ నీతిచంద్రికన్.

సంధి. విగ్రహాము. కృత్యాది.

### 3. కొక్కొండ వేంకటరత్నము (1842-1915)

క. నన్నయ్య యనరె యత్తి
క్కన్నయు నెఱ్ఱనయుఁ బూజ్యఘనులనుచు జనుల్
మున్నిప్పు డాంధ్రభాషకుఁ
జిన్నయ్యయు మాన్యుఁడన్నఁ జిత్రమె యరయన్?

విగ్రహతంత్రము. కృత్యాది.

### ౪. వావిలాల వాసుదేవశాస్త్రి (1851_1897)

తే. గీ. జీర్ణమైపోవు తెనుఁగును జేవగొలిపి
నిలిపినట్టి చిన్నయసూరి నిలిపి మదిని.

### 5. శివశంకర పాండ్యా (1855_1910)

"Meanwhile the late Chinnaya suri of the old high school at Madras, patronized by such native gentleman, as the late lamented the Honourable Gazula Lakshminarasu Chetty Garu, C. S. I. and others published in 1853 a Telugu prose work known as the "First half of the Neetichandrika"

thus winning the honourable distinction of being a Telugu prose writer of significance. This work established this fact beyond doubt, being written in a moderately beautiful Telugu style though stiff here and there as being the first effort at genuine Telugu prose composition."

(The Rise and Progress of Telugu Prose Literature by R. Sivasankara Pandya, B. A. appended to notes on Vigrahatantram of Kokkonda Venkataratnam Pantulu, 1872.)

శ్రీ స్తనాంచిత కస్తూరీపంక సంకలి తోరసే,
కళా వేంకటనాథాయ శ్రీనివాసాయ మంగళమ్.

# హిందూ ధర్మ శాస్త్ర సంగ్రహము.

ఇంగిలీషు భాషయందు

సదరదాలతు ప్యూని. జడ్జి గారైన

తామస్ లంస్డన్ స్ట్రేంజిదొరగారిచేత

రచింపంబడినది.

ఈ గ్రంథము

పరవస్తు చిన్నయసూరిచేత

నరహరి గోపాలకృష్ణమసెట్టిగారి

సాహాయ్యమువలనఁ

దెనుఁగింపఁబడియె.


చెన్నపట్టణము.

అరిమిని వీధి ౧౩ వ లెక్క గృహమందు

హిందూముద్రాక్షరశాలయందు

జ్ఞా. సరవప్పసెట్టిచేత ముద్రింపఁబడినది.

౧౮౬౮

# పీ ఠి క

-:o:-

"ఎలిమెన్ట్స్ ఆఫ్ హిందూ లా" అని పేరు పెట్టి మా తండ్రిగారయిన సర్ తామస్ స్ట్రేంజిగారు చేసిన గ్రంథమును ముఖ్యముగా ననుసరించి యీ ధర్మశాస్త్ర సారసంగ్రహము చేసినాఁడను. మా తండ్రిగారు చేసిన గ్రంథము మన ధర్మస్థానములందుఁ బ్రమాణముగా గ్రహింపఁబడి వాడఁబడు చున్నది. ఆ గ్రంథము మాటిమాటి కచ్చుపడకపోయినది కాఁబట్టి యది యచ్చు వేయింప వలసినదా, యిప్పుడు నేను రచించిన రీతిని సంగ్రహ గ్రంథ మొకటి రచియించి ప్రచురము చేయవలసినదా యని శంకితుఁడ నయితిని. మా తండ్రిగారి పరిశ్రమమును వారి కాలమునకు వెనుక మన ధర్మస్థానముల యందు నడుచుచు వచ్చిన వ్యవహారముల తీర్పులను సహాయ పఱుచుకొని యా విషయములు కూర్చి సులభ క్రియమయిన సంగ్రహ గ్రంథ మొకటి చేయవలసిన దేయని తుదకు నిశ్చయించి కొంటిని. అయినను మా తండ్రిగారు నిర్ణయించినదే సరియని కన్నులు మూసికొని పరిశీలింపక యొప్పుకొన్నవాఁడనుగాను. నా కగపడ్డ న్యాయముఁబట్టి మా తండ్రిగారి తాత్పర్యములకు నా తాత్పర్యములు భేదిల్లినచోట నాకుఁ దోఁచిన సిద్ధాంతము

సంకోచిల్లక నిర్ణయించినాఁడను. అయినను నా కిట్టి తాత్పర్య భేదము లొకానొకచోట నే ప్రసక్తించినవి.

ఈ విషయమందు యథా ప్రాప్తముగా జ్ఞానము సంపాదింపవలెననియు దుష్కరములైన శాస్త్రాంశములు విడువక లెస్సగా వివరింపవలెననియుఁ గోరి సదరదాలతు కోర్టు వారి పుస్తకశాలయందుండు సకల ధర్మ శాస్త్రములను బరిశీలించి సదరదాలతు కోర్టు ప్రొవిన్షియాల్ కోర్టు జిల్లాకోర్టుల పండితులు తమ యధికార స్థానములందు వ్రాసియిచ్చిన యభిప్రాయములును హార్మెజస్టీ ప్రివి కవున్సలువారు తీర్చిన తీర్పులును సదరదాలతు కోర్టువారి తీర్పులును వెలి దేశముల యందు యూరోపు దేశీయులయిన న్యాయాధిపతులచేతఁ దీర్పఁబడి యచ్చుపడిన తీర్పులును గలిగిన సమస్త లేఖ్యముల నాలోడించినాఁడను. ఇదిగాక సదరదాలతు కోర్టు పండితులతోఁ బలుమా ఱీ శాస్త్ర విషయమునందుఁ జర్చించుచు రాఁగా వారు నాకు సంశయ నివర్తకముగా నా గ్రంథ రచనకు మిక్కిలి సహాయముగా ధర్మశాస్త్రమందలి మూల ప్రమాణము లుదాహరించి నా రచించిన గ్రంథము పరిశీలించిరి. పశ్చిమ సముద్ర ప్రాంత దేశమందుఁ జెల్లుచున్న మరుమక్కదాయ మను నియమమును దద్దేశమందలి ముఖ్యులయిన న్యాయాధిపతులు చెప్పిన విషయములఁ దెలిసికొని వ్రాసితిని. ఇదిగాక యీ శాస్త్రాంశమునందు నాకు సహిత

మనుభవము గలదు. ఇప్పుడు హిందూ ధర్మశాస్త్రమును జెల్లించు ధర్మస్థానములవారికి గ్రంథము నిర్దోషముగా సుబోధముగా నుపయుక్తముగా నుండునను తలంపుచేత ప్రచురము చేసెద. ఇది హిందువులయిన [illegible] వాది ప్రతివాదులకును సాధారణముగా సమస్త హిందువులకును వినియోగించుటకయి యాంధ్ర ద్రవిడ భాషలయందును బ్రచురము చేయఁబడెను.

# అనుక్రమణిక

ప్రకరణము — పుటము

# హిందూ ధర్మశాస్త్ర సంగ్రహము

## గ్రంథ ప్రకాశక విజ్ఞప్తి

-ః౦ః-

చిన్నయసూరి వచన రచనలలో నీతిచంద్రిక వెనుక మన కీనాడు లభ్యమైనది హిందూ ధర్మశాస్త్ర సంగ్రహము. ఇది న్యాయశాస్త్ర గ్రంథమని దీని పేరే తెలుపుచున్నది. ఇదియు తొలుత క్రీ. శ. 1858 లో బాలవ్యాకరణము ముద్రితమైన వెను వెంటనే ముద్రితమైనది. ఆ వెనుక, క్రీ. శ. 1867, 1869 లలో * ద్వితీయ, తృతీయ ముద్రణము లందినదన్న, దీని కా కాలమునఁ గల వ్యాప్తి గ్రహింపవచ్చును. క్రీ. శ. 1880_90 ప్రాంతములలోఁగూడ నీ గ్రంథము రెండవ తరగతి న్యాయవాదులు ప్లీడరు పరీక్షా పఠనీయ గ్రంథముగా చదువుచుండిరని తెలియుచున్నది.

రాజకీయముగా నీ గ్రంథము వ్యాప్తిలో నున్నను సారస్వత లోకములో నిది ప్రచారము గాంచక పోవుటకు కారణము మూఁడు ముద్రణ ప్రతులును నీదేశమున లభ్యము కాక పోవుటయే. ప్రథమ ముద్రణ ప్రతిని లండను నగరమున బ్రిటిషు మ్యూజియము గ్రంథాలయమునుండి♦ చలన చిత్ర ఛాయాగ్రహణ మూలమున బడసి, దీనిని ప్రకటించితిని.

---

* చూ. రాంభట్ల జగన్నాథశాస్త్రిగారి స్వీయ చరిత్ర, పుట 23.

♦ Photographs reproduced from Microfilm Copy, obtained from the British Museum Library, London.

సర్వజనుల కావశ్యకమగు న్యాయశాస్త్ర గ్రంథమైనను చిన్నయసూరి దీనిని వ్యావహారిక భాషలోఁగాక గ్రాంథిక భాషలోనే రచించియున్నాఁడు. దీనికి కారణము గలదు. ఈ గ్రంథ రచనకు నేడేండ్లకు ముందు – కుంఫిణీ ప్రభుత్వము వారు వఠ్యం వాసుదేవ పరబ్రహ్మశాస్త్రియను పండితుని చేత జాన్ ఫ్రేయర్ థామసు దొరగారి కంకితముగా, జాన్ ఫ్రేయర్ థామస్ భూపాలీయము లేక 'వ్యవహార దర్పణము' అను గ్రంథమును రచియింపఁ జేసిరి. అది యంతయు వ్యావహారిక భాషలో రచితమైనది. అంతేకాక కేవల సంస్కృత భాషలోనున్న శాస్త్ర గ్రంథము లాధారముగా రచితమైనది చిన్నయసూరి గ్రంథము. ఆంగ్లేయ భాషలో థామస్ లుమిసిడన్ స్ట్రేంజి దొరగారు రచించిన A Manual of Hindu Law అను గ్రంథమునకు భాషాంతరీకరణము. కేవలము వ్యావహారిక భాషలోనున్న శాస్త్రీయ విషయములను నిర్దుష్టముగ చెప్ప వలనుపడదు. ఈ సంగతి గ్రహించి, చిన్నయసూరి గ్రాంథిక భాషలోనే దీనిని రచించెను. వ్యావహారిక భాషా సౌలభ్యముతో, గ్రాంథిక భాషలో శాస్త్రీయ సాంకేతిక వివరణమును వ్రాసి, సుబోధన మొనరించిన చిన్నయసూరి ప్రతిభ ప్రశంసనీయము.

ఆంగ్లేయ భాషలోనున్న గ్రంథముల ననువదించుటకు చిన్నయసూరి ప్రథముఁడని చెప్పవచ్చును.

ఈ నాఁడు రాజకీయముగా స్వాతంత్ర్యమును బడసి చిన్నయసూరి యాంధ్రభాషలోనే సమస్త ప్రభుత్వ వ్యవహారములు జరుగవలెనన్న యాశయమును నూఱేండ్ల క్రిందటనే గుర్తించి యాంగ్లేయ భాషానువాద పథకము నేర్పఱిచిన దీర్ఘదర్శి.

న్యాయస్థాన విచారణలు, తీర్పులు — ఈ నాఁడు చాల భాగము వ్రాతబడినవియై యుండవచ్చును. కాని యా కాలమున మూలగ్రంథములనుండి యనువాదము లెంత జాగరూకతతో నొనరించెడువారో తెలిసికొనుటకు ఈ 'హిందూ ధర్మశాస్త్ర సంగ్రహము' తోడ్పడును. చిన్నయసూరి యద్వితీయ వచన రచనకు ద్వితీయమైన ఈ గ్రంథము నాంధ్ర విద్వల్లోకమాదరించును గాక.

నిడుదవోలు వేంకటరావు.

# హిందూధర్మశాస్త్ర సంగ్రహము

—:o:—

## ౧. ప్రకరణము

### శాస్త్రముల యుత్పత్తిక్రమము

౧. హిందువులు తమ శాస్త్రములీశ్వరోక్త లని చెప్పుదురు. అందొక భాగము శ్రుతి యనఁబడును. శ్రుతి యనఁగా ధర్మశ్రవణమునకు సాధనమని యర్థము. ఇదియె వేదము. ఇందు ముఖ్యముగా మత విషయములు చెప్పఁబడుచుండును. అది బ్రహ్మ ముఖమునుండి బయలు వెడలి, వెడలిన మాటల వరుసనే వ్రాతయం దేర్పడినదని నమ్మెదరు. మఱియొక భాగము స్మృతి యనఁబడు. స్మృతి యనఁగా స్మరింపబడినదని యర్థము. ఇందు ధర్మస్థానములకుఁ గావలసిన వ్యవహార విధులు చెప్పఁబడి యున్నవి స్మృతికి ఋషులు ప్రవర్తకులై యెంచుచున్నారు (౧: ౩౧౫ కో; మార్లి ౧. అవతారిక ౧౮౮) — శ్రుతి స్మృతులు.

౨. ఇట్లు స్మృతులు వ్యవహారవిధుల కాకరములు. వీనికి వ్యాఖ్యానములు కానబడుచున్నవి. ధర్మశాస్త్రమందలి సర్వాంశములనుగాని కొన్ని యంశములనుగాని వివరించు ప్రకరణ గ్రంథములును గలిగినవి. ఇవియె నిబంధన గ్రంథములని వాడుదురు. (౧. పీఠిక ౧౧; మార్లి ౧. అవ. ౧౯౨) — మూలములు - వ్యాఖ్యానములు-నిబంధన గ్రంథములు.

౩. స్మృతులు ౨౦ అనియు ౩౬ అనియు నానావిధముగా లెక్కించెదరు. అందు మనుస్మృతి పరమప్రమాణమయి ప్రాచీనమయియుండును. సర్ - ఉల్లియం-జోన్సుగారిచేత నిది యింగిలీషు చేయఁ బడ్డది. తక్కిన స్మృతులు దీనివలెనే యేర్పాటును సిద్ధాంతమును గలిగియున్నవిగాని యిప్పుడు సమగ్రములుగావు. మను స్మృతి కృత యుగమునకై యేర్పడినది. ఇట్లాయా యుగమునకుఁదగిన స్మృతి యేర్పడియున్నది. లోకాచారము శాస్త్ర విధులకుఁ బ్రతికూలమయి యుండుటఁబట్టి చిరకాలమునకు వాని యర్థముల ప్రకాశములయినవి. కాఁబట్టి శాస్త్రార్థ నిర్ణయమునకు వ్యాఖ్యాన గ్రంథ నిబంధన గ్రంథములే యిప్పుడు శరణము. (౧. పీఠిక ౧౨, ౧౩ ; మార్లె ౧. అవ. ౧౯౨-౧౯౪, ౨౦౧)

శాస్త్ర సంప్రదాయము లయిదు.

౪. కాలక్రమమున శాస్త్రమునకు వేఱు వేఱు సంప్రదాయములు గలిగినవి. ఆయా సంప్రదాయము ముఖ్యముగా నొక్కొక్క వ్యాఖ్యాత ననుసరించి ప్రవర్తించుచున్నది. బంగాళ దేశమందు గౌడసంప్రదాయమని, యుత్తరబేహారునందు మైథిల సంప్రదాయమని, కాశీదేశమందుఁ గాశీ సంప్రదాయమని, మహారాష్ట్ర దేశమందు మహారాష్ట్ర సంప్రదాయమని, చన్నపట్టణ దేశమందు ద్రవిడ సంప్రదాయమనియును సంప్రదాయము లయిదు గలిగినవి.

సిద్ధాంతమం దీ సంప్రదాయములకుఁ బరస్పర భేద మంతగా లేదు. గౌడసంప్రదాయమందు మాత్రము సిద్ధాంత భేదము లనేకములు పుట్టినవి. ముఖ్యముగా దాయభాగమందు విశేష భేద మేర్పడియున్నది. (మార్లి ౧. అవ. ౧౮౯–౧౯౧)

౫. కాశీ సంప్రదాయము తక్కిన మూఁడు సంప్రదాయములకు మూలము. కావున ధర్మశాస్త్ర వ్యాఖ్యాతలు కాశీ సంప్రదాయమువారని బంగాళ సంప్రదాయమువారని రెండు గొప్ప తెగలవారు. బంగాళ సంప్రదాయమందు ధర్మశాస్త్రార్థములు యుక్తివాదములచేత దిద్దుపాటు గలిగియున్నవి. కాశీ సంప్రదాయమందు మూలార్థమే కేవల మనుస రింపబడుచున్నది. (౧. ౩౧౬, ౩౧౭ కో) కాశీ బంగాళ సంప్రదాయములు.

౬. ఇటమీఁదఁ జెప్పెడు గ్రంథములు ద్రవిడ సంప్రదాయమందు ముఖ్యప్రమాణములు. వానిలోఁ జెప్పిన యాచారములే యీ గ్రంథమందుఁ జెప్పఁ బడును. ద్రవిడ సంప్రదాయమందు ముఖ్య గ్రంథములు.

(౧) మితాక్షర–ఈ గ్రంథము విజ్ఞానేశ్వర యోగిచేత రచియింపఁ బడినది గనుక విజ్ఞానేశ్వరీయ మనియును వాడఁబడును. ఇది యాజ్ఞవల్క్య స్మృతికి వ్యాఖ్యానము. ఇం దితర స్మృతివచనము లుదాహ రింపఁబడి యున్నవి. దీనియం దాచార కాండము వ్యవహార కాండము ప్రాయశ్చిత్తకాండమని మూఁడు

కాండములు. రెండవ కాండమందలి దాయభాగ ప్రకరణము కోల్ బ్రూక్ దొరచేత నింగిలీషు చేయఁబడినది. ఆ కాండమందు మఱికొంత భాగము—డబ్బిల్ యు—ఏచ్చి—మెక్ నాటన్ దొరచే నింగిలీషు చేయఁబడినది. మితాక్షర కాశీ సంప్రదాయమందు ముఖ్య ప్రమాణము. అందుచేతనే ద్రవిడ సంప్రదాయమందు సహితమది ప్రమాణముగా గ్రహింపఁబడుచున్నది. ఈ గ్రంథనామము ధర్మశాస్త్రమునకు ముఖ్య ప్రవర్తకుఁడయిన మనువుయొక్క గ్రంథనామముతోఁ జేర్చి రెంటికి సాధారణముగా మను—విజ్ఞానేశ్వరీయమని పేరుపెట్టి యిందు సమస్త ధర్మములు చెప్పఁబడియున్నవని వాడుదురు.

(౨) స్మృతి చంద్రిక—ఇది దేవనభట్టుచే రచింపఁబడినది. ఈ గ్రంథము చెన్నపట్టణ దేశమందు గలిగి యక్కడనే యాచరింపఁబడుచున్నది. ఇది మితాక్షరకు రెండవదిగా గణింపఁబడుచున్నది. ఈ గ్రంథము కొన్ని సిద్ధాంతములయందు మాత్రము మితాక్షరకు విరోధించుచున్నది.

(౩) సరస్వతీ విలాసము — ఈ గ్రంథము స్మృతి చంద్రికవంటిది. దీని కర్త ప్రతాపరుద్రుఁడు.

(౪) వ్యవహార మయూఖము—ఈ గ్రంథ మర్థ వ్యవహార దండ వ్యవహారములు తెలుపుచున్నది. దీనికర్త నీలకంఠుడు. ఇది మహారాష్ట్ర సంప్రదాయ

మందు ముఖ్య ప్రమాణము. ఈ గ్రంథము బారె డేల్ దొరచేత నింగిలీషు చేయఁబడ్డది.

(౫) మాధవీయము—ఈ గ్రంథము మాధవాచార్యులు చేసినది. ఇది పరాశరస్మృతికి ముఖ్యముగా వ్యాఖ్యానము.

ఈ యయిదు గ్రంథములు పరమప్రమాణముగా గణింపఁబడుచున్నవి. కనుకనే వీని సంఘాతము పంచగ్రంథియని యుదాహరింతురు.

(౬) వరదరాజీయము—ఈ గ్రంథము వరదరాజను పండితుఁడు చెప్పినది. ఇది స్మృతి చంద్రిక వంటిదే.

(౭) స్మృతి ముక్తాఫలము—ఈ గ్రంథము వైద్యనాథ దీక్షితులు రచించినది గనుక వైద్యనాథ దీక్షితీయమనియును వాడఁబడుచున్నది. ఇందు వైదిక విధులు వివరింపఁబడుచున్నవి.

(౮) నిర్ణయసింధువు—ఈ గ్రంథము కమలాకర భట్టుచేత రచియింపఁబడినది. ఇందు లౌకిక వైదిక ధర్మములు చెప్పఁబడుచున్నవి.

(౯) మన్వర్థ ముక్తావళి—ఈ గ్రంథము మనుస్మృతికి వ్యాఖ్యానము. ఇది కుల్లూకభట్టుచే విరచింపఁబడుటఁబట్టి కుల్లూకభట్టీయమనియును వాడఁబడును. ఇదే యిప్పుడు ప్రసిద్ధమైన మను వ్యాఖ్యానము.

(౧౦) దత్త మీమాంస—ఈ కృతి నంద పండితుఁడు చేసినది. దత్త చంద్రిక—ఈ కృతి దేవానందభట్టు చేసినది. ఈ రెండును దత్త విషయకములయిన గ్రంథములు. ఆ విషయమందు ముందు చెప్పిన సర్వ సంప్రదాయములవారికిని బ్రమాణమయియున్నవి. ఈ రెండు గ్రంథములు సదర్ లాన్డు దొరచేత భాషాంతరము చేయఁబడినవి. మఱియును దత్త మీమాంసయని పేరుగల గ్రంథములు రెండు గలవు. అందొకటికి మాధవాచార్యుఁడు కర్త. మఱియొకటికి శ్రీరామపండితుఁడు.

బంగాళ సంప్రదాయమునకు ముఖ్య ప్రమాణము.

౭. జీమూతవాహనుడుచేసిన దాయభాగమను గ్రంథము బంగాళ దేశమందు దాయభాగమునకు ముఖ్య ప్రమాణము. కోల్ బ్రూక్ దొరచేత నిది యింగిలీషు చేయఁబడినది.

జగన్నాథ నిబంధన గ్రంథము.

౮. జగన్నాథీయమను నాధునిక ప్రకరణ గ్రంథము—సర్—ఉల్లియం—జోన్సుగారు జగన్నాథ పండితునిచేతఁ జేయించినది. ఇది కోల్ బ్రూక్ దొరచేత నింగిలీషు చేయఁబడినది. ఇది సకల శాస్త్ర సంగ్రహమయియున్నదిగాని సిద్ధాంతముల యేర్పాటు మాత్రము లేదు. ఇందు సంగ్రహించిన పరస్పర విరుద్ధ వచనములయందు సిద్ధాంతవచనమిది యని యేర్పడకున్నది. ఇది భాషాంతరము చేసిన

కోల్ బ్రూక్ దొరచేతనే యిట్లు దూషింపఁబడినది ఇది బంగాళ సంప్రదాయానుసారి.

౯. హిందూ ధర్మ శాస్త్రములయందు బంగాళ కాశీ సిద్ధాంతముల భేదము వివేచించి తెలిసి కోవలసినది మాత్రముగాక ప్రకృతమందు లోకాచారములేని శాస్త్రాంశ మిదియని యాచారము గలిగిన శాస్త్రాంశమిదియని వివేచించి తెలిసికోవలసినది. ఆచారము లేని శాస్త్రములు.

౧౦. ఆదికాలమందు బ్రాహ్మణునకు నికృష్టవర్ణములయందు వివాహము విధిచోదితమే కాని పుట్టిన బిడ్డలకు మాత్రము మాతృవర్ణానురూపముగా దాయభాగమందు వైషమ్యము గలిగియుండెను. ఈ విధి కలియుగమందు నిషిద్ధము కాఁబట్టి బ్రాహ్మణునకు నికృష్టవర్ణమునందు వివాహము కూడదు. (౧. ౩౯, ౪౦) తక్కువ స్త్రీని బెండ్లాడుట.

౧౧. విభాగమందు జ్యేష్ఠునకు జ్యేష్ఠాంశమని యధిక భాగమిచ్చుచుందురు. ఇప్పుడా యాచారములేదు. (౧. ౧౩౩, ౧౯౨, ౧౯౩) జ్యేష్ఠాంశము.

౧౨. మఱియుఁ బన్నెండు విధముల పుత్రులు గలరు. అందాఱుగురు జన్మముచేతను బుత్రులయినవారు. ఆఱుగురు నానావిధ స్వీకారములచేతనైనవారు. మొదటఁ జెప్పిన యాఱుగురిలో పండ్రెండు విధముల పుత్రులు.

నొకఁడు నియమింపఁబడిన జ్ఞాతివలనఁ బుట్టినవాఁడు. వీఁడు తన తండ్రియొక్క క్షేత్రమందు జ్ఞాతివలనఁ బుట్టినవాఁడు గనుక ద్వ్యాముష్యాయణుఁడని చెప్పఁబడును. ద్వ్యాముష్యాయణుఁడనగా నిద్దఱు తండ్రులకుఁ గలిగినవాఁడు. ఔరసదత్తులు మాత్ర మీకాలము పుత్రులని గ్రహింపఁబడుచున్నారు. ఔరసుఁడనఁగా భార్యయందుఁ దనకుఁ బుట్టినవాఁడు. దత్తుఁడనఁగా దానముచేత స్వీకరింపఁబడినవాఁడు. (౧. ౭౪, ౭౫; ౨. ౮౨ శ్లో)

సిద్ధాంత విషయము. ౧౩. ఆచారములేని శాస్త్రాంశములు మఱియును గలవుగాని చెప్పుటకంతావశ్యకములు గావు.

కాశీ బంగాళీ సంప్రదాయము. ౧౪. కాశీ చన్నపట్టణ సంప్రదాయములకును బంగాళి సంప్రదాయమునకునుగల ప్రసిద్ధ భేదములు ప్రత్యేకముగా నొక ప్రకరణమందు వివరింపఁబడును.

# ౨. ప్రకరణము

## వివాహము

౧౫. కన్యక యెనిమిదవయేఁటి ప్రాయమందు వివాహమున కర్హురాలని శాస్త్రము చెప్పుచున్నది. (౧. ౩౬) — *కన్యకలకు వివాహకాలము.*

౧౬. అయినను రెండవయేఁడు మొదలుకొని ఋతుకాలమువఱకు వివాహము కన్యలకుఁ జేయుచున్నారు. (వైద్యనాథ దీక్షితీయమందలి ప్రజాపతి వచనము)

౧౭. బ్రాహ్మణకన్య పెండ్లి కాకమునుపు ఋతుమతి యయ్యెనా జాతిభ్రష్టురాలవును. (వైద్యనాథ దీక్షితీయ మందలి బృహస్పతి వచనము)

౧౮. వివాహమయిన కన్యక రజస్వలయగువఱకుఁ బుట్టినింటనే యుండవచ్చును. తరువాత భర్త తనయింటికిఁ దోడుకొనిపోవుచున్నాఁడు. (౧. ౩౬, ౩౭) — *భర్త తనయింటికిఁ గొనిపోవుట.*

౧౯. కన్యకకు భర్తను సంపాదించు నధికారము తండ్రిది. అతని మరణానంతరము కన్యకయొక్క పితామహుఁడు-సోదరుఁడు-పితృవ్యుఁడు-సకుల్యులు-తల్లియును వరుసగా నా యధికారము పొందుదురు. (౨. ౨౮కో) — *భర్తను వరించుట.*

౨౦. కన్యక తన యెనిమిదవ సంవత్సరము మొదలుకొని మూఁడు సంవత్సరములవఱకు ముందు చెప్పిన బంధువు లెవ్వరును దనకు వరుని సంపాదింపని పక్షమున తనకుఁదానే పతిని వరింపనచ్చును. (౧. ౩౬.)

పురుషులకు వివాహకాలము.

౨౧. బ్రహ్మ క్షత్రియ వైశ్యులు వడుగు మొదలుకొని సమావర్తనము తుదిగా బ్రహ్మచర్య వ్రతము నెఱవేర్పక మునుపు వివాహము చేసికోఁగూడదు. (మనువు 3 అ. ౪ శ్లో) శూద్రులకు బ్రహ్మచర్యవ్రతములేదు గనుక వివాహకాలమునకు నియమము లేదు.

అష్టవిధ వివాహములు.

౨౨. వివాహము లష్ట విధములు. వీనిలో బ్రాహ్మము దైవ మార్షము ప్రాజాపత్య మను నాలుగు వివాహములు బ్రాహ్మణులకు యోగ్యము లయి యుండును. ఇవి పారమార్థికములు. గాంధర్వ రాక్షసములను వివాహములు క్షత్రియులకుఁ దగి యుండును. ఇందు మొదటిదానికి దంపతుల పర స్పర ప్రేమయే నిమిత్తము. రెండవదానికి యుద్ధ జయము నిమిత్తము. ఆసురమను వివాహము వైశ్య శూద్రులకు నియతములు. అది యోలియిచ్చి కన్యయొక్క తండ్రి సమ్మతిని బొంది చేయఁబడునది. పైశాచమను వివాహము కన్యకను వంచించి చేయఁ

బడును. ఇది సర్వవర్ణములయందు నిషిద్ధము. (౧. ౪౨, ౪౩; చిన్నమెక్‌నాటన్ ౧. ౫౯, ౬౦)

౨౩. ఆయావర్ణములవారికి వివాహభేదము లేర్పడియున్నవిగాని యాచారమందు నియతములు గావు. ఆసురము బ్రాహ్మణుఁడు చేసికోవచ్చును. శూద్రుఁడు బ్రాహ్మము చేసికోవచ్చును. (మను వ్యాఖ్యయయిన కుల్లూకభట్టీయమందు ౩. ౨౪)

౨౪. బ్రాహ్మాసురములు మిక్కిలి సర్వవర్ణ సాధారణముగా జరుగుచున్నవి. బ్రాహ్మము సర్వ సమ్మతము. ఆసురము నింద్యము. (౧. ౪౨, ౪౩; చిన్నమెక్‌నాటన్ ౧. ౬౦)

౨౫. వివాహపూర్తికిఁ గన్యాదానమును దత్పరిగ్రహమును సప్తపదియును ముఖ్యక్రియలు. ఒక పళ్ళెరములో బియ్యము నెఱపి యేడుగీఁట్లు గీఁచి యా యేడుగీఁతలమీఁద వరుఁడు పెండ్లి కొమార్తె కాలుపట్టి గీఁత గీఁత కొక్కొక్కసారి వరుసగా నుంపించుట సప్తపది యనఁబడును. ఇందు చేతనే యిద్దఱు చెలిమి యొడంబడికకయి కూడి యేడడుగులు నడచు నాచారము గలిగినది. కాఁబట్టి సాప్తపదీనమను శబ్దము సఖ్యమునకు వాచకమయి నది. ఈ క్రియతోనే వివాహము పూర్ణమవుచున్నది. హోమము లోనయిన యితరక్రియలు విశేషములు గావు. వరుఁడు కన్య కంఠమందు మంగళసూత్రము

వివాహము నెఱవేర్చెడు క్రియలు.

కట్టుట లోకాచారముగాని శాస్త్రీయముగాదు. (గృహ్యసూత్రము)

౨౬. ముందు చెప్పిన వివాహసిద్ధిచేతనే వధూవరులు పరస్పరబద్ధులగుదురుగాని నిషేకము చేతఁగాదు. సమర్తాడిన వెనుక భార్యను భర్త తన యింటికి వెంటఁబెట్టుకొని పోవుచున్నాఁడు. ఈ వివాహమునకు వెనుక భర్త మృతిఁబొందెనా స్త్రీకి వైధవ్యమును, దాని కనురూపములయిన కార్యము లందుఁ గర్తృత్వమును, దన భర్తకు రావలసిన దాయభాగము తాను బుచ్చుకొను నధికారమును గలుగుచున్నవి. (౧. ౩౭; ౨. ౩౨, ౩౩ ౨)

నిశ్చితార్థ విరోధము.

౨౭. వివాహము నిశ్చితార్థము చొప్పున నడవక తప్పెనా దానిచేత విశేష హాని యేదియును లేదు.

౨౮. తీఱనివ్యాధి, కానివావి, మొదలయిన యిట్టి శాస్త్రోక్తప్రతిబంధములచేతఁగాని, కన్యకా మరణముచేతఁగాని, నిశ్చయించిన వివాహము నెఱ వేఱకపోయెనా, వివాహ నిమిత్తము కన్యకుఁగా వరుఁడిచ్చిన ద్రవ్యము తిప్పివేయవలసినది. నిశ్చ యింపఁబడిన వరుఁడు రెండు పక్షముల వారి సెల వులు తానే యచ్చుకోవలసినది. (౧. ౩౮) కన్యక పక్షమువారు శాస్త్రోక్తమయిన ప్రతిబంధములేకయే

మరలఁబడిరేని వారే జరిగిన సెలవులన్ని వరుని కియ్యవలసినది.

౨౯. దంపతులలో నొకరు జాతిభ్రంశము పొందిరేని వారి పరస్పరసంబంధము నివర్తించును. జాతిభ్రష్టురాలిని మృతురాలివలె భావించి యుత్తర క్రియలు చేయవలసినది. (స్మృతిచంద్రికయందు వసిష్ఠయాజ్ఞవల్క్య వచనములు) అట్లు పుత్రవతిని భావింపఁగూడదు. పుత్రుఁడామెను భరింపవలసినది. జాతిభ్రంశము.

౩౦. వ్యభిచరించిన స్త్రీకి జాతిభ్రంశము కలుగుచున్నది. అంతటితో వివాహ సంబంధము సహితము తీఱిపోవును. హీనజాతులు కొన్నింటి కీ నియమము లేదు. (స్మృతిచంద్రిక) జారుని చేత నష్టి పుచ్చుకొనుటకు భర్త కధికారములేదు. ఏ విష యమందును నష్టము పురుషున కియ్యవలెనని శాస్త్రములేదు. (౨. ౪౦-౪౪, ౨౬౫ కో. ౨) స్త్రీ వ్యభిచారము.

౩౧. నపుంసకత్వముగాని, గొడ్డాలితనముగాని, యిద్దఱిలో నొకరికి హేయమైన వ్యాధిగాని, తీఱని వ్యాధిగాని దంపతుల వియోగమునకు నిమిత్తములు. (౧. ౪౭) అయిన నివి వివాహబంధమును మానుపఁజాలవు. (మనువు ౯. ౭౯) దంపతులెడఁబాయుటకు నిమిత్తములు.

౩౨. పురుషుఁడు మేరలేక బహుస్త్రీలను వివాహముచేసికోవచ్చునుగాని, తగిన నిమిత్తములు భార్యాబాహుళ్యము.

లేక వేఱుభార్యను గ్రహింపఁగూడదు. అసాధువృత్తి, సదా ప్రాతికూల్యము, దుర్గుణము, వ్యాధి, గొడ్డాలితనము, పదిసంవత్సరములవఱకాఁడు బిడ్డలనే కనుట యనునవి యీ నిమిత్తములు. స్త్రీ దోషరహితురాలయినను దాని యనుమతిచేతఁ బురుషుఁడు వివాహముచేసికోవచ్చును. (౧. ౮౫, ౮౬, ౫౨, ౫౩) అయినను జరిగిపోయిన వివాహమునకీ నిమిత్తములు లేకుండినను జెల్లుబడి లేకపోదు. (స్మృతిచంద్రికయందు దేవల వచనము)

రెండవ వివాహకాలమందియ్యవలసిన ధనము.

33. రెండవ వివాహమునకు నిమిత్తము భార్య యొక్క సమ్మతియే యయిన పక్షమందు భార్యకుఁ బారితోషికమిచ్చి యామె యనుమతి పొందవలసినది. (మితాక్షర ౨ అ. ౧౧ ప్ర. ౩౮ శ్లో) ఈ పారితోషికమునకుఁగాను భార్య భర్త మీఁదఁ దగవు తేవచ్చును. ఆమెయందు దుశ్చరితములు కలవనుటకు నిదర్శనముండిన పక్షమం దామె తెచ్చిన తగవు చెల్లదు. (స్మృతిచంద్రికయందు వసిష్ఠ యాజ్ఞవల్క్య వచనములు)

బడిన భార్య వసింప వలసిన తావు.

3౮. న్యాయము కలిగి కాని, లేక కాని, రెండవ వివాహముచేత నిరాకరింపఁబడిన భార్య భర్తతోనే వసింపవలసినది. తనతోఁగూడి వసింప గూడదని భర్తచేత వారింపఁబడిన స్త్రీ భర్తయొక్క బంధువులయొద్దఁగాని, తన బంధువులయొద్దఁగాని

వసింపవలసినది. (౧. ౫౪, ౫౫) ఎక్కడ వసించి నను భర్త భార్యను బోషింపవలసినది. (స్మృతి చంద్రికయందు బృహస్పతి వచనము)

౩౫. స్త్రీలు బాల్యమందు వైధవ్యము పొందియును మరల వివాహము చేసికోఁగూడదు. (౧. ౩౭) పునర్వివాహము

౩౬. శాస్త్ర నియమమునకుఁ గట్టువడని నీచజాతి శూద్రులకుఁ గొందఱికీ నియమము లేదు.

౩౭. ఎఱ్ఱగొల్లలయందు, మాలలయందు, మాదిగలయందు వితంతువులకు దేశాచారముఁబట్టి యనుజ్ఞ గలిగినా పునర్వివాహము గలదు. (స. అ. పండితులు_౧౮౫౭ సం॥ జనవరి నెల ౨౨; ౧౮౫౪ మార్చి ౧౩, జూన్ ౨౬; ౧౮౫౫ ఏప్రల్ ౧౯)

౩౮. మేలుతరమయిన శూద్రజాతులయం దలవవెలమజాతి వితంతువులకు మఱుపెండ్లి కూడదు. (స. అ. పం. ౧౮౫౫ ఏప్రల్ ౧౯)

౩౯. పునర్వివాహముచేసికొను వితంతువు ముందటి భర్త యిచ్చిన వస్త్రాభరణములు వాని దాయాదుల కియ్యవలసినది. (౨. ౪౦౦ కో)

౪౦. తక్కువజాతి శూద్రులందుఁ బురు షుఁడు స్త్రీని గొంతకాలము చేరుగొండిగా నుంచు చేరుగొండి పెండ్లి.

కొని వివాహము చేసికోవచ్చును. (స. అ. పం. ౧౮౫౮ జూన్ ౨౬)

౪౧. అట్టి తక్కువజాతులయందు వివాహమునకు ముందు పుట్టిన బిడ్డలు వెనుక జాత్యాచారమున్న పక్షమందు న్యాయ్యమయిన సంతతిగా నొప్పుకొనఁబడుదురు. (స. అ. పం. ౧౮౫౮ జనవరి ౨౬)

౪౨. అఱువెలమలలోఁ జేరుగొండిదోషము గలిగిన స్త్రీని వివాహము చేసికోఁగూడదు (స. అ. పం. ౧౮౫౫ మే ౧౬)

వధూవరులు సమజాతీయులై యుండుట. ౪౩. వివాహముచేసికొను దంపతులు లోకజాతివారై యుండవలెను. (౧. ౪౦) ఏకమతము వారునై యుండవలెను.

౪౪. తక్కువజాతి శూద్రుల కీ నియమము లేదు.

౪౫. వీరిలో భిన్నమతములవారికిఁ బరస్పర వివాహము గలదు. (స. అ. పం. ౧౮౨౯ సెప్టంబర్ ౨౪; ౧౮౫౮ సెప్టంబర్ ౧౪; ౧౮౫౫ ఫిబ్రవరి ౮)

వివాహము నకుఁ దగనివారి. ౪౬. బ్రాహ్మణులందఱు నూఁటయేఁబదియయిదు గోత్రములవారు. (దశనిర్ణయమందు ఆప

_స్తంబ సూత్రము)ఆయా గోత్రమున కొకొక్క ఋషి కూటస్థుఁడు.కొన్ని క్షత్రియవంశములు బ్రహ్మఋషుల వలనఁ గలిగినవి. తక్కిన క్షత్రియులును వైశ్యులును దమతమ పురోహితుల గోత్రములనే తమకు వాడు కొందురు. ఈ నానావిధగోత్రములు పురుషపరం పరనుబట్టి వచ్చుచున్నవి. స్త్రీలు వివాహమునకు వెనుక భర్తయొక్క గోత్రము గలవారగుదురు. (నిర్ణయసింధువు) ఈ మూఁడుజాతులవారికి సగోత్రా వివాహము నిషిద్ధము. (మనువు 3. ౫)

౪౭. శూద్రులకు గోత్రము లేకుండినను దండ్రికి ముందటి యేడుతరములలోఁగాని తల్లికి ముందటి నాలుగుతరములలోఁగాని పుట్టినవారిని వివాహము చేసికొనుట నిషిద్ధము. (నిర్ణయసింధువు నందు వసిష్ఠ వచనము)

౪౮. ఈ నియమములకు బహుతరముగా లోకాచారము క్షీణించినది. సాధారణముగా సమస్త వర్ణములయందునుఁ దల్లితండ్రులతోఁ బుట్టువులతోఁ గాని, వారి సంతతి వారితోఁగాని; తోఁబుట్టువులతోఁ గాని, వారి సంతతి వారితోఁగాని వివాహసంబంధము యొక్క నిషేధముమాత్రము పాటింపఁబడుచున్నది.

(నిర్ణయసింధువునందు కాత్యాయన పరాశరాదుల వచనములు; కాలామృతమందు ౬౨ శ్లో. ధర్మప్రవృత్తియందు వ్యాఘ్రపాద వచనము)

స్వీకృత పుత్రునికిఁ గానివావి.

౪౯. దత్తపుత్రుఁడు తన్నుఁ గన్నవారి పరంపరయందును, గొన్నవారి పరంపరయందును ముందు చెప్పిన వివాహ సంబంధ నిషేధము పాటింపవలసినది. వాని సంతతివారు సహిత మీ నిషేధము పాటింపవలసినది. (నిర్ణయసింధువునందు)

# 3. ప్రకరణము

## పుత్రస్వీకారము

౫౦. వివాహము చేసికొన్నవాఁడు తన మరణానంతరము పుత్తునరకమునకుఁ బోవలసిన వాఁడని హిందువులు తలఁచెదరు. పుత్రవంతునికి నరకము లేదు. పుత్తను నరకమువలనఁ గాచువాఁడు గనుక సుతుఁడు పుత్రుఁ డనఁబడును. (మనువు ౯. ౧౩౮) నరకార్హత

౫౧. వివాహము చేసికొన్నవానికి సుతుఁ డవశ్యముగాఁ గావలెననుట దీనిచేతనే తేటపడు చున్నది. సహజముగా సంతానము లేనివాఁ డవశ్యము పుత్రస్వీకారము చేయవలెనని విధిగలదు. (౧. ౭౬.) పుత్రుని యావశ్యకత.

౫౨. పుత్రుఁడు జన్మించిన మాత్రానఁ బున్నామ నరకము నివర్తించుచున్నది. నష్టపుత్రకుఁడు పుత్రజన్మముచేతనే నరకమునకుఁ దొలఁగినవాఁ డైనను దన యపరక్రియలకై, వంశవృద్ధికై, పుత్రస్వీకారము చేయవచ్చును. (నందపండిత దత్తమీమాంసయందు ౧. ౩, ౪) పుత్రుని బోఁగొట్టుకొన్న వాని స్వీకారము.

౫౩. మృతునియొక్క కోరికలు తీఱునట్లు వాని పేరు చెప్పి పితృదేవతల కన్న పిండములను జలములనిచ్చు నపరక్రియలు చేయుదురు. పురుష సంతతి లేకుండెనా భార్యగాని, సోదరులుగాని, ఉత్తరక్రియలు.

తక్కిన బంధువులుగాని తమ తమ బాంధవ్యానురూపముగా యథాయోగ్యముగా నుత్తరక్రియలు నెఱవేర్చెదరు. పుత్రుఁడుచేయు నపరక్రియలు మాత్రము పూర్ణఫలకముగా నెఱవేరును. (నంద పండిత దత్తక మీమాంసయందు ౧. ౫౮, ౫౯)

పుత్ర సంతతి లేమి.

౫౪. పుత్రుఁడుగాని, పౌత్రుఁడుగాని, ప్రపౌత్రుఁడుగాని లేనివాఁడే పుత్రహీనుఁ డనఁబడును. వాఁడే పుత్రస్వీకారము చేయవలసినది. పుత్రులు లేనిపక్షమందు వారిసంతతివారు పుత్రుని యట్లుత్తరాధికారు లవుదురు. (౧. ౭౮; సదర్లాన్డు ౨౨౨)

౫౫. జాతిభ్రంశముచేతఁగాని, వెఱ్ఱిచేతఁగాని, తీఱని రోగముచేతఁగాని, యితర కారణము చేతఁగాని పురుషసంతతివారు దాయమున కర్హులు కానిపక్షమందు వారు లేరని యెంచి పుత్రుఁడు లేనివాఁడువలెఁ బుత్రస్వీకారము చేయవచ్చును. (౧. ౭౭)

స్వీకృతుఁడుండగా మఱియొకని స్వీకరింపఁగూడదు.

౫౬. తన స్వీకృతపుత్రుఁడు జీవించియుండగా దాను బుత్రహీనుఁడు కాఁడు గావున మఱియొకని స్వీకరింపఁజెల్లదు. (మూర్ ౧౦౨)

భార్య గర్భిణియై

౫౭. భార్య గర్భిణియై యుండఁగాఁ బుత్రుఁడు పుట్టునను సంభావన యుండుటఁబట్టి

యప్పుడు పుత్రస్వీకారముకూడదు. (మ. ఖం. ప్రొ. కో. పం. ౧౮౧౭ జూన్ ౨౩) | యుంఉం గా స్వీకరించుట.

౫౮. స్వీకృతుఁడు పుత్రహీనుఁడయి మరణించెనా యౌరస మరణమున కది తుల్యము కావున వానికి మాఱుగా స్వీకారము చేయవచ్చును. (౧. ౭౮) | స్వీకృతుఁడు హీనుఁడయిన పిమ్మట రెండవ స్వీకారము.

౫౯. వివాహములేనివాఁడు స్వీకారము చేయఁగూడదు. (స. అ. పం. ౧౮౫౧ జూలై ౧౭) | పెండ్లిలేనివాఁడు చేయు స్వీకారము.

౬౦. వివాహములేనిపురుషుల కెంత ప్రాయమువారికిఁగాని, స్త్రీలకు వివాహము చేసికొన్నవారికిఁగాని, చేసికొనివారికిఁగాని పుత్తును నరకము లేదు. కావుననే వారికి స్వీకారమక్కఱలేదు. చేసికొనిరిపో చెల్లదు. | స్త్రీలు చేయు స్వీకారము.

౬౧. విపత్నీకుఁడు స్వీకారము చేయఁగూడదు. (సోమనాథ దత్త మీమాంస)వివాహము చేసికొని పుత్రప్రాప్తి లేనిపక్షమందు స్వీకరింపవచ్చును. | విపత్నీకుని పుత్రస్వీకారము

౬౨. గుడ్డితనము, రోగము మొదలయినవానిచేత దాయమున కనర్హుఁడయినవాఁడు పుత్రస్వీకారము చేయవచ్చును. వీఁడు దాయార్హుఁడు కాఁడు కాఁబట్టి వీని స్వీకరించిన పుత్రుఁడు సహి | దాయమున కనర్హుఁడు చేయు స్వీకారము.

తము దాయార్హుఁడు కాఁడు (౧. ౭౭, ౯౮; సదర్లాన్డు ౨౩౨, ౨౩౩)

౬౩. జ్ఞానశూన్యునికి వ్యవహారయోగ్యత లేదు గావున వెఱ్ఱిచేత దాయార్హత లేనివానికి స్వీకారముకూడదు. (మితాక్షరయందు వ్యవహార కాండము)

జాతిభ్రష్టుని పుత్రస్వీకారము. ౬౪. జాతిభ్రష్టుఁడు కర్మానర్హుఁడు గావున వాఁడు చేయు స్వీకారము చెల్లదు. (మను ౧౧. ౧౮౫) అయినను వాఁడు హిందూశాస్త్రమునకుఁ గట్టుపడని వాఁడు గావున మరణ శాసనము వ్రాసి యుత్తరాధికారిని సంపాదించుకొను నధికారము వానికిఁ గలదని కోర్టువా రొప్పుకొందురు.

స్వీకృతుఁడు చేయు స్వీకారము. ౬౫. స్వీకృతుఁడు పుత్ర స్వీకారము చేయవచ్చును. ఈలాగున స్వీకార పరంపర చేతనే యెంతవఱకుఁగాని వంశము వృద్ధినొందవచ్చును. (స. అ. పం. ౧౮౪౫ డిసంబర్ ౨౨; ౧౮౫౨ జూలై ౧౨; ౧౮౫౩ నవంబర్ ౧౪)

భార్యాభర్తల స్వీకారము. ౬౬. స్వీకారాధికారము భార్యాభర్తలలో భర్తకే కలదు గాని స్వీకరించిన తల్లిదండ్రు లిద్దఱి కిని స్వీకృతుఁడు పుత్రుఁడయి యపర క్రియలు చేయుచున్నాఁడు. (౧. ౭౮, ౭౯)

ముత్తైదువగాని. ౬౭. ముత్తయిదువగాని, వితంతువుగాని, తన భర్త యనుమతిచేత స్వీకారము చేయవచ్చును.

అయినను స్వీకార మిది భర్తదిగాని భార్యదిగాదు. (౧. ౭౯)

వితంతువు గాని చేయు స్వీకారము.

౭౮. కుటుంబ సముదాయ ద్రవ్యమునకు స్వీకారము బాధకమయినను భార్యకు స్వీకారాధికారమిచ్చునపుడు తనతండ్రి దాయాదుల సమ్మతి కోరఁబనిలేదు. (స. అ. పం. ౧౮౪౫ జూలై 3; ౧౮౫౦ జూన్ ౨౨)

౭౯. ఎప్పుడుగాని భర్త భార్యకు స్వీకారాధికార మియ్యవచ్చును. (మ. ఖం. ప్రా. కో. పం. ౧౮౨౫ మార్చి ౮)

౭౦. భర్త భార్యకు స్వీకారాధికార మిచ్చునపుడు వీనిని స్వీకరింపుమని నిర్దేశింపఁ బనిలేదు. (స్ట్రేంజి యొక్క రిపోర్టులు ౧. ౯౧)

౭౧. అట్టి యనుజ్ఞ వ్రాసి యుండవలెనని యక్కఱలేదు. (౧. ౮౦)

౭౨. అనుజ్ఞపొందిన వితంతు వెంతకాలమునకయినను బుత్ర స్వీకారము చేయవచ్చును. (స. అ. ౧౮౪౫ అక్టోబరు ౫; ౧౮౫౧ జూలై ౧౭)

౭3. భర్తయొక్క యనుజ్ఞలేని స్త్రీకి సహజముగా సంరక్షకులు గావున జ్ఞాతులు పుత్ర స్వీకారాధికార మియ్యవచ్చును. (౧. ౭౯, ౮౦) ఇట్టియే యనుజ్ఞ లేక స్త్రీ తాను చేసికొన్న స్వీకారము

చెల్లదు. (నంద పండితుని దత్తక మీమాంస. ౧ అ. ౧౫ శ్లో)

౨౪. సమాంశభాగులయిన జ్ఞాతులందఱు సమానులుగావున ముఖ్యముగా వారందఱుగూడి చేయవలసి యుండఁగా వారి యనుమతిలేక భర్త యొక్క జ్ఞాతియొక్కఁడు మాత్రము చేసిన యనుజ్ఞ చాలినదిగాదు. (స. అ. పం. ౧౮౫౪ అక్టోబర్ ౯)

స్త్రీ రెండవ స్వీకారము చేయుట.

౨౫. భర్తయొక్క మరణానంతరము పుత్రుఁడు మరణించెనేని విశేషముగా భర్త యనుజ్ఞ నొందిన స్త్రీ పుత్ర స్వీకారము చేయవచ్చును. ఆ రీతినే స్వీకృతుఁడు పోయిన పక్షమందు స్త్రీ పుత్ర స్వీకారము చేయవచ్చును. (౧. ౨౮; పెద్ద మొక్నా టన్ ౧౫౨; బం. స. ది. అ. ౧౮౫౦ యొక్క అప్పీల్ నంబరు ౪౫౭ లో తీర్పు)

౨౬. భర్త తన యనంతర మొక స్వీకార పుత్రుఁడు కావలెనని తలంచి యనుజ్ఞ చేయుటఁ బట్టి ద్వితీయ స్వీకారమునకు వాని యనుజ్ఞ విశేషముగాఁ గావలెనని యక్కఱలేదు.

౨౭. గతించిన స్వీకృతుని భార్య జీవించి యుండెనేని వాని దాయాధికార మామెదిగాని రెండవ స్వీకృతునిది కాదు.

ఈడు చాలనివితం

౨౮. పున్నామ నరకమునుండి తోడనే భర్తను విముక్తుని జేయుట యావశ్యకము గావున

వితంతువు తన పసితనమందు స్వీకరించుటకుఁ గాల వ్యవస్థలేదు గాని యామె తన సంరక్షకుల సమ్మతి పొందియే స్వీకారము చేయవలెను. తువు చేయు స్వీకారము.

౭౯. స్వీకార సిద్ధికి బాలుని దానపరిగ్రహములు రెండును ముఖ్య క్రియలు. దానములేని పరిగ్రహము చెల్లదు. (౧. ౯౭; స. అ. పం. ౧౮౭౭ జనవరి ౨౧) స్వీకార సిద్ధికి ముఖ్య క్రియలు.

౮౦. తల్లి సమ్మతి లేకయే తండ్రి పుత్రదానము చేయవచ్చును. (౧. ౮౧) తల్లి సమ్మతి యావశ్యకము గాదు.

౮౧. అక్కఱ కలిగిన పక్షమునకు భర్త యనుజ్ఞ యున్నట్లు భావించి స్త్రీ స్వతంత్రించి పుత్రదానము చేయవచ్చునుగాని భర్త జీవించి యుండగాఁ జేయఁగూడదు. వాఁడు మృతుఁడయినను జిరప్రవాసము చేతఁగాని సన్న్యాసము చేతఁగాని జాతి భ్రంశము చేతఁగాని మృతప్రాయుఁ డయినను స్త్రీ స్వతంత్రించి పుత్రదానము చేయవచ్చును. (౧. ౮౧, ౮౨; సదర్ లాన్డు ౨౨౭) తల్లి పుత్రు నిచ్చుట.

౮౨. సోదరు లందఱు సమానులుగాఁబట్టి యొక సోదరు నిచ్చుటకు మఱి యొకనికి స్వాతంత్ర్యము లేదు. (స. అ. పం. ౧౮౭౭ ఫిబ్రవరి ౨౧; స. అ. ౧౮౭౧ అప్పీల్ నం ౨౦ లో తీర్పు)

పితృవ్య డిచ్చుట.

౮౩. ఆలాగుననే పితృవ్యునకు దానాధికారములేదు. (చిత్తూరు కో. పం. ౧౮౫౯ అక్టోబర్ ౨౩)

తల్లి దండ్రు లిచ్చుట.

౮౪. పుత్రదానాధికారము తల్లిదండ్రులదే యని పర్యవసితార్థము. ఆ యధికారము మొదటఁ దండ్రిది. వాని పరోక్షమందుఁ దల్లిది.

పుత్రదాన పరిగ్రహములు వ్యభిచారిణికిఁ జెల్లవు.

౮౫. వ్యభిచారిణి జాతి భ్రష్టురాలు గావున దానికిఁ బుత్రదాన పరిగ్రహములు చెల్లవు. (స. అ. ప్రొసీడిన్గ్సు ౧౮౪౪ నవంబర్ ౧౧)

స్వీకర్తకు స్వీకృతుఁడు సవర్ణుఁడై యుండవలె.

౮౬. అసవర్ణుఁడయిన స్వీకృతుఁడు స్వీకర్త యొక్క యుత్తరక్రియలు చేయుటకుఁగాని దాయము పొందుటకుఁగాని (౧. ౮౨) పున్నామ నరకమును తొలఁగించుటకుఁగాని యర్హుఁడు కాఁడు గావున స్వీకార్యుఁడు స్వీకర్తకు సవర్ణుఁడయి యుండవలెను.

౮౭. స్వీకర్తకు వాఁడు సగోత్రుఁడయి యుండవలెను. ఈ విధి నియతముగాదు. (౨. ౯౮, ౯౯ కో. ఎ; సదర్ లాన్డు ౨౨౩, ౨౨౪)

స్వీకారమునకుఁ దగనివాని.

౮౮. స్వీకార్యుఁడు స్వీకర్త కౌరస ప్రతిబింబుఁడయి యుండవలెనని మూలస్మృతి వచనము. అనఁగాఁ బుత్రసదృశుఁడయి యుండవలెనని యర్థము. అనఁగా స్వీకార్యుఁడు స్వీకర్తకుఁ గొడుకు వావికిఁ దగినవాడయి యుండవలెనని తేలిన యర్థము. (నంద

పండిత దత్తక మీమాంసయందు ౫ అ. ౧౬ శ్లో) ఇట్లు చెప్పుటచేత స్వీకార్యునితల్లి న్యాయ్యముగా స్వీకర్తను వివాహము చేసికోఁదగిన వావిగలది యయి యుండవలెనని తాత్పర్యము. (౧. ౮౩; సదర్ లాన్ డు ౨౨౩)

౮౯. ఈ విధిచేతనే సోదరుఁడును బిత్రు సోదరుఁడును మాతులుఁడును దౌహిత్రుఁడును స్వీకారార్హులుగారు. (౧. ౮౩)

౯౦. శూద్రులకు దౌహిత్రభాగినేయులను స్వీకరించుటయందు నిషేధములేదు. (౧.౮౩, ౮౪) దౌహిత్ర భాగినేయ స్వీకారము.

౯౧. ఆవశ్యకమయిన పక్షమందెల్ల వర్ణముల వారును ముందు చెప్పినట్లు స్వీకారము చేయ వచ్చును. (స. అ. ప్రొ. ౧౮౩౬ జూన్ ౪, ౨౫)

౯౨. ఆవశ్యకత లేకయే యట్టి స్వీకారము చేయు నాచారము ద్రవిడ దేశమందుఁ గలదు. (స. అ. ప్రొ. ౧౮౩౬ జూన్ ౪, ౨౫)

౯౩. వ్యవహార మయూఖమందును (స. అ. పం. ౧౮౩౯ ఫిబ్రవరి ౨౫) వైద్యనాథ దీక్షితీయ మందును (స. అ. పెద్ద పం. ౧౮౫౫ మే ౧౬) ఈ యాచార మాదరింపఁబడినది.

౯౪. ఈ రాజధాని క్రింది యుత్తర దేశమం దీ యాచారము లేదు. (ఉ. ఖం. ప్రొ. కో. పం. ౧౮౦౪)

భ్రాతను స్వీకరించుట.

౯౫. సోదరుని స్వీకరించుట చెల్లదు. (స. అ. ౧౮౫౧ ఆ. నం ౨౦ లో తీర్పు)

భార్యా సోదరుని స్వీకరించుట.

౯౬. భార్యయొక్క సోదరుని స్వీకరించు నాచారము గలదు. స్వీకారము పురుషుని కొఱకుఁ గాని స్త్రీకొఱకుఁ గాదనుటఁబట్టి యీ స్వీకారము సమ్మతి కెక్కవచ్చును. కాఁబట్టి స్వీకార విషయమయి త్రోపుడయిన వావి పురుషుని బంధువుల యందేర్పడు చున్నదిగాని స్త్రీబంధువులందు లేదు.

తగని వావులు తెలుపుట.

౯౭. స్వీకృతుఁడు స్వీకర్తకు న్యాయ్యముగాఁ గొడుకు వావికిఁదగిన వాఁడయి యుండవలెనని పర్యవసితార్థము. ఈ విధికి విరుద్ధముగా ద్రవిడ దేశమందు మాత్రము దౌహిత్ర భాగినేయులను స్వీకరించు నాచారముగలదు. సర్వదేశముల యందు శూద్రులు దౌహిత్ర భాగినేయులను స్వీకరింపవచ్చును. ఇతర వర్ణముల వారు సహిత మావశ్యకత గలిగిన పక్షమం దట్లు చేసికోవచ్చును.

జ్యేష్ఠ పుత్రునిఁ గాని యేక పుత్రునిఁ గాని స్వీకరించుట.

౯౮. జ్యేష్ఠపుత్రునిఁగాని యేకపుత్రునిఁగాని స్వీకరింపఁగూడదు. (౧. ౮౫)

౯౯. ఈ నిషేధము ప్రమాణమే కాని యేకపుత్ర జ్యేష్ఠపుత్రుల దానము దాతకెంత దోషావహమయినను గడచిన యీ స్వీకారమునకుఁ జెల్లుబడి గలదు. (౧. ౧౭; స. అ. ప్రొ. ౧౮౨౪ జూలై ౩౧; ౧౮౨౫ జూలై ౨౮)

ఏకపుత్రుఁడుగాని జ్యేష్ఠ పుత్రుఁడుగాని పితృ తతో్సదరులకు ద్వ్యాముష్యాయణుఁడవును గావున సోదరునియొక్క యేకపుత్ర జ్యేష్ఠ పుత్ర స్వీకార మం దీ నిషేధము లేదనియుఁ జెప్పఁబడి యున్నది. (౧. ౮౬)

ప్రకృత నిషేధ వ్యవస్థకు బలవత్తరము లయిన దూషణములు గలవు. పుత్రుని జన్మమే పున్నామ నరకమునుండి తండ్రికి విముక్తి పుట్టించెడు ననుటచేత జ్యేష్ఠపుత్రుఁడుగాని యేకపుత్రుఁడుగాని పుట్టిన తోడనే తన తండ్రికి విమోచనము బుట్టించెడు. కాఁబట్టి వాఁడు పునర్విమోచనము పుట్టింపఁడు. పుత్రజన్మముయొక్క ఫలము జనక పిత యందు వినియోగించినది. అన్యునకు వినియోగింప నేరదు. అన్యునకుఁ బున్నామనరకమునుండి రెండవ మోచనము పుట్టింపనేరదు. పూర్వమే చెల్లిపోయిన ప్రయోజనము జనక పిత వలన మరల *గ్రహించి యన్యున కియ్యఁగూడదు. కాఁబట్టి యేక పుత్ర జ్యేష్ఠ పుత్ర స్వీకారము స్వీకర్తకుఁ బున్నామనరక ముక్తిరూప ఫలము పుట్టింపనేరదు. ఇట్లు స్వీకారము నిష్ఫలము గావునఁ జెల్ల నేరదు. ద్వ్యాముష్యాయణుఁడను నిమిత్తముఁబట్టి సోదరుని యేక పుత్ర జ్యేష్ఠపుత్రుల స్వీకారము చేయవచ్చునను విశేష విధి యేర్పడి యున్నదిగాని యీ యేర్పా

కెట్టిదయినను ప్రకృతమం దాచారములేదు. ఈ స్వీకార మాచారమందుఁ గలదను పాటిగా లోక మందు వ్యాపించియున్నదిగాదు. ఈ యాచార మరుదు. కాఁబట్టి తుదకీ స్వీకారముయొక్క నిషే ధము దుర్వారము. ఈ స్వీకార మెట్లు నడచినను జెల్ల నేరదు.

స్వీకారము నకుఁ దగిన వాఁడు. ౧౦౦. మునుపు చెప్పిన నిషిద్ధకోటి దప్పఁ బురుషుని నేదిష్ఠబంధువు స్వీకారమునకు మిక్కిలి యర్హుఁడు. ఇట్టివాఁ డేకోదరుఁడయిన భ్రాతయొక్క పుత్రుఁడు. ఈ స్వీకార మనుజ్ఞాతమేకాని యవశ్య విధేయముగాదు. (౧. ౮౪, ౮౫)

చేరుగొండి కొడుకును స్వీకరిం చుట. ౧౦౧. చేరుగొండియొక్క కొడుకు వర్ణ వ్యవ స్థకు మీఱిన వాఁడు గావున స్వీకారమున కర్హుఁడు కాఁడు. (స. అ. పం. ౧౮౫౩ జూలై ౧౮)

పుత్రికా స్వీకారము. ౧౦౨. పుత్రిక పున్నామనరక విమోచనము చేయనేరదు. (మనువ్యాఖ్యయయిన కుల్లూక భట్టీయ మందు ౯అ. శ్లో. ౧౩౩) కాఁబట్టి పుత్రికా స్వీకార మంగీకరింపఁబడ్డదికాదు. (స. అ. ప్రా. ౧౮౪౭ నవంబర్ ౨౩)

స్వీకారము. ౧౦౩. వేశ్య పుత్రికా స్వీకారము చేయ వచ్చును గాని పుత్ర స్వీకారము చేయఁగూడదు. (స. అ. పం. ౧౮౫౩ సెప్టెంబర్ ౧౨)

౧౦౪. వేశ్యలు హిందువుల వర్ణ వ్యవస్థకు లోపడిన వారు కారు. వారికి వివాహము లేదు. పడుపు చేతనే జీవనము. నికృష్ట వర్ణునితోడి సంపర్కమునఁ దప్పఁబడుపుచేత వారికి జాత్యవమానము లేదు. వీరికి భర్త లేదు కాఁబట్టి పురుషవర్గమందు స్వీకారము కూడదు. వీరు తమ ద్రవ్య మిచ్చుటకయి తామే స్వీకరింపవచ్చును. వీరికి స్త్రీ పరంపర ప్రధానము కాఁబట్టి పుత్రికా స్వీకారమే చేయవలసినది. వేశ్య పుత్రిక లేనిపక్షమందే యీ స్వీకారము చేయవచ్చును. దానికిఁ బుత్రుఁ డున్నాఁడు లేఁడని నిమిత్తము లేదు.

౧౦౫. తన భర్త నిమిత్తము వితంతువు స్వీకరించు బాలుఁడు భర్తయొక్క జీవితకాలమందు జనించికాని గర్భస్థుఁడై కాని యుండవలెనని యక్కఱ లేదు. (స. అ. పం. ౧౮౪౯ అక్టోబర్ ౮; ౧౮౫౧ జూలై ౧౦) స్వీకార కాలము.

౧౦౬. బ్రహ్మ క్షత్రియ వైశ్యులలో వడుగు చేసిన బాలుని స్వీకరింపఁగూడదు. (బం. స. ది. అ. ౫. ౫౧; సదర్లాన్డు ౨౨౭) ఉపనయనమునకు ముందు.

౧౦౭. ఉపనయనమనునది బాలునియొక్క బ్రహ్మచర్యాశ్రమ ప్రవేశమునకు గుఱుతు. ఉపనయనమనగా సమీపించుట. వేదాధ్యయనమునకై యాచార్యుని సమీపించుట యని తాత్పర్యము.

చౌలాది కర్మములు దీనికిముందు నడచుచున్నవి. ఇవి నడచుట స్వీకారమునకుఁ బ్రతిబంధకము కాదు. ఈ క్రియలు మరల స్వీకర్త చేయించికో వచ్చును గాని నడచిన యుపనయనమును మానిపి మఱియొక యుపనయనమును జేయఁగూడదు. ఉపనయనము జరిగియుండెనా యది స్వీకారమునకు బలవత్తర మయిన ప్రతిబంధకము.

౧౦౮. ఉపనయనము బ్రాహ్మణుల కెనిమి దేండ్ల ప్రాయములోపల, క్షత్రియులకుఁ బదొకొండేటి లోపల, వైశ్యులకుఁ బన్రెండేటిలోపలను జరుగ వల సినది. (స. అ. ౧౮౧౪ అ. నం. ౧౮లో

వివాహము నకుముందు. ౧౦౯. ఉపనయనము శూద్రులకు లేదుగావున వివాహమునకు మునుపు స్వీకార మెప్పుడయినను జరుగవచ్చును. వివాహానంతరము కూడదు. (౧. ౯౧)

౧౧౦. విద్యార్థి దశమీఁదిది వివాహ దశ గావున సర్వ వర్ణములయందును వివాహితుని స్వీక రింపఁగూడదనుట స్పష్టము. (౧. ౩౫, నోటు, ౯౧)

స్వీకార క్రమము. ౧౧౧. స్వీకారమునకు లిఖిత మక్కఱలేదు. బంధువులు వచ్చియుండవలెను. దేశాధికారులకుఁ దెలుపవలెను. ఈ క్రియలు నడవక పోయినను స్వీకార మునకు హాని లేదు. దత్తహోమము తప్పఁగూడదు. దత్తహోమ దాన పరిగ్రహములు ప్రకటముగాఁ

గావించుటయే పుత్రీకరణ సిద్ధికి మిక్కిలి యావశ్యకము. (౧. ౯౩, ౯౭; ౨, ౧౧౪ ఎ)

౧౧౨. దత్తహోమము తప్పి పోయెనేని మొదటి మూఁడు వర్ణములవారు చేయు స్వీకారము చెల్లదు. ఈ నియమము శూద్రుల కక్కఱలేదు.

౧౧౩. ఈ యుగమందు నిరపేక్షముగా బాలు నిచ్చుటవలె మఱియొక క్రియ స్వీకారమునకు దార్ఢ్యాపాదకముగాదు. వెలఁదీసి బాలుని స్వీకరించుట యశాస్త్రీయమనుట దాని కుదాహరణము. ఇట్లు చేసిన స్వీకారము నిలువనేరదు. (౧. ౭౫; ౨. ౧౩౩, ౧౮౮-౧౯౩)

౧౧౪. పుత్రీకరణమందు దాతృగ్రహీతలు ముఖ్యులుగాఁబట్టి వారిభార్యలు సహితము సమక్షమందుండవలెనని యక్కఱలేదని తీర్పు చేయఁబడినది. (స. అ. ౧౮౩౯అ. నం, ౮ లో తీర్పు) దత్తహోమము పత్నులులేక జరుపఁగూడదు గావున వారు సమక్షమందుండుట యావశ్యకము. (మితాక్షర ౨ కాం. ౧ అ. ౫ శ్లో) భార్యా సన్నిధానము.

౧౧౫. స్వీకారము చేతనే స్వీకృతుఁడు పూర్వ జనకునితో సంబంధము లేని వాఁడయి స్వీకర్తకు సర్వవిధములయం దౌరస తుల్యుఁడవును. (౧, ౪౧, ౯౭) స్వీకృతాధికారము.

౧౧౬. స్వీకర్త యొక్క దాయమం దధికారము స్వీకృతుని సప్రతిబంధమై కాని యప్రతిబంధమయి కాని పొందును. (౧.౯౭) అంతటితోనే స్వీకృతునకు జనకపితయొక్క దాయమందు సంబంధము నివర్తించును. (మనువు ౯. ౧౪౨)

౧౧౭. వితంతువు స్వీకారము చేసినతోడనే దాని భర్త యొక్క ద్రవ్యము దాని యొద్దనుండి స్వీకృతునిఁ జేరును. (౧. ౧౦౧)

స్వీకృతుని వివాహము నకు వావి లేని వారు.

౧౧౮. స్వీకృతుఁడు స్వీకర్తయొక్క బంధువులలోఁ దగని వావి వారిని వివాహము చేసికోఁ గూడదు. (౧. ౪౧) తన జనక పితయొక్క బంధువులందు సహిత మట్లు చేయఁగూడదు. (నిర్ణయ సింధువు)

స్వీకృతుఁడు స్వీకరింపఁదగని వారలు

౧౧౯. దత్తుఁడు కాకముందు తాను స్వీకరింపఁదగని వారిని దత్తుఁడయిన వెనుక సహితము స్వీకరింపఁగూడదు.

చెల్లుబడి లేని స్వీకృతుని యొక్క దశ.

౧౨౦. దత్తుఁడయినతోడనే జనక పితతో సంబంధము విడిచిపోయినది గావున వీని స్వీకారము శాస్త్రీయమయి చెల్లకపోయినను వీఁడు జనక పితయొక్క దాయమందు భాగాధికారిగాని వానికి మరలఁ బుత్రుఁడుగాని కాఁబోఁడు. ఇరు పక్షములయందు వీఁడు దాయము పోఁగొట్టుకొని స్వీకర్తకుఁ బోష్యమాత్రుఁడయి యుండును. (౧. ౮౨)

౧౨౧. న్యాయ్యమయిన స్వీకారమొకసారి చేసినది యసిద్ధి గానేరదు. (౨. ౧౧౧ క్లో) స్వీకారము మా ఱు పడదు.

౧౨౨. స్వీకారానంతర మౌరసుఁడు గలిగె నేని స్వీకృతునకు నాలవపాలే వచ్చును. (ఎల్బరిడ్జ్ ౭౧; మితాక్షర ౧. ౧౧, ౨౪) నాలవ పాలనఁగా నౌరసునకు వచ్చు పాలిలో నాలవ పాలితో సరిపాలని యర్థము. దాయ మయిదు పాళ్ళుచేసి యొక పాలు స్వీకృతుఁడును నాలుగు పాళ్ళౌరసుఁడును బొందవలెనని తాత్పర్యము. (సరస్వతీ విలాసమందు దాయభాగము) స్వీకారము నకు వెనుకఁ బుట్టిన పుత్రుఁడు.

౧౨౩. అనంతరము పుత్రు లెందఱు గలిగినను మునుపు చెప్పినట్లె భాగము చేయవలసినది. (స. అ. పెద్దపం. ౧౮౫౩ సెప్టెంబర్ ౧)

# ౪. ప్రకరణము

## రక్షకత్వము.

పౌగండదశ.

౧౨౪. బాల్యదశ పదియాఱవ సంవత్సరమందు నివర్తించును. (౨. ౭౬ కో)

౧౨౫. ఆ దశ పురుషులకట్లు స్త్రీలకు. (స. అ. పం. ౧౮౫౫ జూన్ ౧౯)

౧౨౬. బాల్యదశ పదునెనిమిదవయేఁటి తుదనఱకు గ్రహింపవలెనని కోర్టు ఆఫ్ వార్డ్సు వారి కృత్యములకయి దొరతనమువారిచేత విధి యేర్పఱుపఁబడినది. (౧౮౦౪ ౫ రిగ్యులేషన్ ౪ ప్ర)

సంరక్షకులు.

౧౨౭. తండ్రి మొదట, వెనుకఁ దల్లి, జ్యేష్ఠభ్రాత, తండ్రి బంధువులు, తల్లి బంధువులును బాలునికి సహజముగా సంరక్షకులు. సహజమయిన సంరక్షకుని వారించి క్రొత్తగా సంరక్షకుని నిర్ణయింపవలసినప్పు డాయధికారము దొరతనము వారిది. (చిన్న మెక్నాటన్ ౧. ౧౦౩, ౧౦౪)

౧౨౮. ఉన్మాదాదులచేతఁ దండ్రి యోగ్యుఁడుగాని పక్షమందు బాలుని సంరక్షించు పని తల్లిది. (స. అ. ప్రొ. ౧౮౪౩ సెప్టెంబర్ ౧౮)

౧౨౯. ఉయిలుచేత సంరక్షకుని నియమించుటకు శాస్త్రమందు వచనముఁ గానము. (౨. ౭౩ కో)

౧౩౦. తన ద్రవ్యమునకు సంబంధించిన యే కార్యముగాని బాలుఁడు చేసినది చెల్ల నేరదు. (మితాక్షర వ్యవహార కాండము) బాలుని చేఁతలు.

౧౩౧. బాలుని యాస్తికి హానికరమైన కార్యముగాని వాడచ్చుకోవలసిన దానికిఁ జేయు కార్యముగాని చెల్ల నేరదు. వాని యక్కఱకుఁగాని లాభమునకుగాని చేసిన కార్యము చెల్లును. (కుల్లూకభట్టీయమందు మనువు ౮. ౨౭) బాలునికను కూలమైన కృత్యములు.

౧౩౨. తగిన యీడు రాకమునుపు బాలుఁడు తన తండ్రి ఋణమునకయి యుత్తరవాది కాఁడు. (౨. ౨౭౯ కో) అయినను బాలకుల మీఁద వివాదము తేవచ్చును. వారు తమ సంరక్షకుల మూలముగా నెదురుతగ వాడవచ్చునని కోర్టువారొప్పుకొనియెదరు. (౨. ౮౦ కో) బాలుని పూఁట కాఁపుతనము.

౧౩౩. సముదాయ ద్రవ్యమందు బాలుని భాగమునకు హాని ప్రాప్తించు పక్షమందు దానికై సంరక్షకుఁడు వివాదము జరుపవచ్చును. లేనిపక్షమందుఁ గూడదు. (స. అ. ౧౮౫౦ అ. నం. ౪౯లో తీర్పు) సముదాయ ద్రవ్య మందు బాలుని భాగము.

స్త్రీ పరతంత్రురాలు.

౧౩౪. స్త్రీలకు సర్వదా పారతంత్ర్యమే కాని స్వాతంత్ర్యము తగదు. (౧. ౨౮౪; చిన్న మెక్ నాటన్ ౧. ౧౦౪)

కొన్ని జాతులందు దీని కపవాదము.

౧౩౫. చాకలి, గొల్ల, యీడిగ, గాండ్ల, నట్టువులయందును, వీరివంటి కర్మోపజీవుల యందును కుటుంబ సంరక్షణ కుపకరించు స్త్రీలొడంబడికలు చేయవచ్చును. అది కుటుంబ నిమిత్తమయి యుండవలె. ఆ యొడంబడికలకు భర్త కట్టుపడవలసినది. (స్మృతి చంద్రికయందు యాజ్ఞవల్క్య నారద వచనములు)

పెండ్లి లేని స్త్రీ.

౧౩౬. పెండ్లి లేని స్త్రీ యెంత యీడుగలదైనను దండ్రియొక్క రక్షణమం దుండవలసినది. తండ్రిలేని పక్షమందు వారి జ్ఞాతుల సంరక్షణమందుండవలసినది. (చిన్న మెక్ నాటన్ ౧. ౧౦౪)

పెండ్లియయిన స్త్రీ.

౧౩౭. పెండ్లియయిన స్త్రీ తన భర్త సంరక్షణమందుండ వలసినది. అతఁడు లేనిపక్షమందుఁ బుత్ర, పౌత్ర, ప్రపౌత్ర, భర్తృజ్ఞాతి, స్వపితృమాతృ సంబంధుల రక్షణమందుండవలసినది. (చిన్న మెక్ నాటన్ ౧. ౧౦౪)

౧౩౮. బాలద్రవ్యమందుఁ గార్యనిర్వాహకురాలయిన స్త్రీ తనయొక్క సంరక్షకుల యాజ్ఞకు లోఁబడి యుండవలసినది. (చిన్న మెక్ నాటన్ ౧. ౧౦౩) ముదియీాడు వచ్చిన స్త్రీ చేయు కార్యములకు దాని సంరక్షకుని సమ్మత్యసమ్మతులు కోర్టువారు పాటించు నాచారము లేదు. బాలద్రవ్యమునకు రక్షకురాలు.

# ౫. ప్రకరణము

## సొమ్ము.

స్థావర జంగమ శబ్ద నిర్వచనము.

౧౩౯. స్థావరమని, జంగమమని ద్రవ్యము ద్వివిధము. భూ, నదీ, గృహ, తటాకములు మొదలయిన యిట్టి పదార్థములు స్వరూపముతో స్థానాంతరము పొందింపరానివి స్థావరము లనఁబడును. ఇతరములయిన వస్తువులన్ని జంగమము లనఁబడును. విక్రయముచేతఁగాని దానముచేతఁగాని శాశ్వతపు గుత్తచేతఁగాని సంపాదింపఁబడి శాశ్వతభోగ్యము లయిన భూములు స్థావరము లనఁబడును. శాశ్వత శాసనముచేత లభించిన రుసుములును, వచ్చుబళ్లును స్థావరములని చెప్పఁబడును. వీనికే నిబంధములని పేరు. కుదువలు, గడువు గుత్తలును జంగమములని చెప్పఁబడును. సస్యములు, వనమృగములు, పక్షులు, మీనములును శాశ్వతభోగ్యమయిన పదార్థముతోఁ గలిసియుండియు, జంగమములని చెప్పఁబడును.

పిత్రార్జిత స్వార్జితములు.

౧౪౦. ద్రవ్యము పిత్రార్జితమని స్వార్జితమని మరల రెండు విధముల విభాగింపఁబడియుండు. పితృద్రవ్యముగాని దానిచేత సంపాదించినదిగాని జంగమస్థావరములం దేదయినను పిత్రార్జిత మనఁ

బడు. పితృద్రవ్య నిరపేక్షముగా స్వప్రయాసము చేత సంపాదించిన ద్రవ్యము స్వార్జిత మనఁబడును.

౧౮౧. పితృద్రవ్యమందుండి యిచ్చినదానికి మాఱుగాక యూరకవచ్చినద్రవ్యము స్వార్జితము. (ఎల్బర్లిజ్ ౯౨)

౧౮౨. పెద్దలు పోఁగొట్టిన ద్రవ్యము పితృద్రవ్య సాహాయ్యములేక స్వప్రయాసముచేత మరల సంపాదింపఁబడెనా యది స్వార్జితము. ఈ పునరార్జనము దాయాదుల యనుమతిపొందికాని వారు దానియందుఁ దమ సంబంధము మానినారని తెలిసికొనికాని చేయవలసినది. ఆ ద్రవ్యమును సంపాదించు యత్నము దాయాదులకుఁ గలదని యెఱిఁగియు వారికంటె ముందు సంపాదించెనా యిది వారిని మోసపుచ్చుటే యని భావింపవలెను. ఇట్లు సంపాదించినది దాయాదుల పొత్తుల ద్రవ్యముగాని స్వార్జితము గానేరదు. (౧. ౧౯౨, ౨౧౭)

౧౮౩. పితృదత్తమయిన విద్యచేత వచ్చిన ద్రవ్యము స్వప్రయాసలబ్ధమైనను పైతృకద్రవ్యము చేత సంపాదితమని యెంచఁబడును. (తిరునల్వేల్లి జి. కో. పం. ౧౮౨౧. ఆగష్టు ౧౭) ఈ శాస్త్రార్థము

ఋజువైనది కాదు కాఁబట్టి న్యాయమునకు యోగ్యతకు విరుద్ధమయిన యిది యాచారమునకుఁ దగదు.

విభక్తావిభక్త ద్రవ్యము.

౧౨౨. పైతృక ద్రవ్యము విభక్తమని యవిభక్తమని ద్విప్రకారము.

స్త్రీధనము.

౧౨౩. మఱియు వివాహమయినదానికిఁగాని కానిదానికిఁగాని స్త్రీకిచ్చినధనమునకుఁగాను విశేష శాస్త్రమేఁర్పడియున్నది. దానికి స్త్రీధనమని పేరు. ఈ పేరు యౌగికము కాఁబట్టి యర్థము స్పష్టము. పతి తద్బంధు స్వబంధు పితృదత్తముగాని తనంత దొరకినదిగాని కనిపట్టినదిగాని స్త్రీధన మనఁబడును. (మితాక్షర ౨. ౧౧. ౧-౩)

౧౨౬. తన ప్రయత్నములచేతఁగాని తన చుట్టాలుకానివా రిచ్చుటచేతఁగాని వచ్చినద్రవ్యము సమస్తము తనభర్తదిగాని తనదిగాదు. (స్మృతి చంద్రిక)

౧౨౭. స్త్రీకిఁ దల్లిదండ్రి దోఁబుట్టువు లిచ్చిన ద్రవ్యము స్థావరముగాని జంగమముగాని సౌదాయిక మనఁబడును. ఆ ద్రవ్యమం దామెకే యధికారము. భర్తకుఁగాని తక్కిన బంధువులకుఁ గాని సంబంధములేదు. (మితాక్షర ౨. ౧౧. ౩;

సరస్వతీవిలాసమందు; వ్యవహారమయూఖమందు ౪. ౭. ౧; ౪. ౧౦. ౮)

౧౪౮. సంబంధము లేక మునిఁగిపోయిన ద్రవ్యమును మరల సంపాదించుకొనుట కింతకాలములోఁ దగవు తేవలసినదని హిందూశాస్త్రము విధించిన కాలావధి యింగిలీషుదొరతనమువారిచేతఁ ద్రోపడిపోయినది. (౧౮౦౨ సం॥ ౨ వ రెగ్యులేషన్ ౧౮ వ ప్ర. ౪ వ లో భాగము) కాలావధి నిబంధనము.

# ౬. ప్రకరణము

## వినియోగము

స్థావర ద్రవ్య మందు దండ్రికిఁగల స్వాతంత్ర్యము.

౧౪౯. పుత్రులతో విభాగించుకొని తండ్రి తన పిత్రార్జితముగాని స్వార్జితముగాని స్థావరద్రవ్యమును బుత్రులయనుమతిలేక వినియోగింపఁగూడదు. (౨. ౯. ౧౧ శ్లో) పుత్రులు లేనిపక్షమందు వారి పుత్ర పౌత్రుల యనుమతి కావలసినది. వీరు తమ తండ్రితో సమానాధికారులయి యుందురు. (మితాక్షర ౧. ౧. ౨౭)

౧౫౦. వీరు బాలకులయియుండఁగానే త్రోయఁగూడని యక్కఱ వచ్చినప్పుడు వారి యనుమతి యున్నట్లు భావింపఁబడును. (౧. ౨౦)

౧౫౧. పుత్రసంతతి లేనివాఁడు పిత్రార్జితమునుగాని స్వార్జితమునుగాని స్థావరద్రవ్యమును దన పాలివారికిఁ బ్రతికూలముగాఁ దనయిచ్ఛవచ్చినట్టు వినియోగింపవచ్చును. (౨. ౪౩౬ శ్లో)

జంగమ ద్రవ్య మందు.

౧౫౨. పిత్రార్జితమందుఁగాని స్వార్జితమందుఁగాని జంగమద్రవ్యమందుఁ బుత్రసంతానము కలవాఁడైనను లేనివాఁడైనను దానే సర్వ స్వతంత్రుఁడు. (మితాక్షర ౧. ౧. ౨౪)

కుటుంబ పోషణము

౧౫౩. పోష్యుల పోషణమునకయి పుత్రికల వివాహమునకయి వెచ్చమావశ్యము గనుక దానికిఁ

జాలినంత ద్రవ్యము నిలుపుకోక స్థావరమునుగాని జంగమమునుగాని ద్రవ్యమును వినియోగించుట చెల్లదు. (౧. ౧౮. ౧౯; స. అ. పం. ౧౮౫౨ ఏప్రిల్ ౧౦, ౨౬) నకుఁ జాలినంత యుంచుకోవలెను.

౧౫౪. తండ్రి కొడుకు దప్ప నితర దాయాదు లందఱు పరస్పర సమ్మతిచేత స్థావరమునుగాని జంగమమునుగాని ద్రవ్యమును వినియోగింపవచ్చును గాని పరస్పర సమ్మతిలేక చేసిన వినియోగము చెల్లదు. (౧. ౧౯) దాయాదుల చేతవినియోగము.

౧౫౫. దాయాదుల సమ్మతివడయక దాను దన భాగము కొలఁది ద్రవ్యమును వినియోగించుట చెల్లును. (౧. ౨౦౧) పుత్రులున్న పక్షమందు వారి భాగము త్రోపుడుపెట్టి వినియోగింపవలసినది. (మితాక్షరదత్తాప్రదానికమందు)

౧౫౬. దాయాదులు బాలకులయి యుండు నప్పుడు తమకయి యవశ్యముగా జరుగవలసిన పనులకుఁగాని స్పష్టమయిన తమ ప్రయోజనమునకుఁ గాని యొప్పుకోవలసినది. (౧. ౨౦౩)

౧౫౭. విభాగానంతరము దాయాదులెవ్వరు గాని యొండొరుల కెఱుకచేయకయే తమ తమ భాగమును వినియోగింపవచ్చును. (స. అ. పం. ౧౮౩౩ నవంబర్ ౬; ౧౮౫౦ అక్టోబర్ ౨౪) విభక్తుల చేత—

వితంతువు చేత—

౧౫౮. వితంతువు తన భర్తవలన వచ్చిన ద్రవ్యమును జీవించువఱకు ననుభవింప వచ్చును. అనంతర మది యుత్తరాధికారులను జెందవలసినది. (౧. ౨౪౬)

౧౫౯. వితంతువు తన భర్తయొక్క ఋణములకుఁగాని తన జీవనమునకుఁగాని పుత్రికల వివాహమునకుఁగాని భర్తయొక్క యాత్మోర్జ్జీవనమునకుఁగాని చేయువెచ్చ మాస్తిచేత జరుపవలసినదికాఁబట్టి యక్కఱయినప్పుడు దానికయి స్థావరద్రవ్యమును వినియోగింపవచ్చును. తక్కిన విషయమందుఁ దన ముఖ్య జ్ఞాతుల యనుమతిలేక చేసిన వినియోగము చెల్లనేరదు. (౧. ౨౪౬, ౨౪౭; ఎల్ బర్లిజ్ ౭౪)

౧౬౦ ఇందుల కుదాహరణము, దౌహిత్రులుండఁగా వారి యనుమతిలేక పుత్రికల యనుమతిచేతనే వితంతువు వినియోగము చేయఁగూడదు. (స. అ. పం. ౧౮౫౧ ఏప్రిల్ ౩)

౧౬౧. ఆమెకు జంగమద్రవ్యమం దధికతరమయిన స్వాతంత్ర్యము గలదు. (౧. ౨౪౭, ౨౪౮) తాను స్వతంత్రముగా జంగమద్రవ్యము వినియోగింపవచ్చును. (స. అ. ౧౮౪౯ అ. నం ౫ లో తీర్పు)

౧౬౨. దీనిచేతఁ గాజమాలిన యిచ్ఛము కయి వితంతువున కనుజ్ఞ యిచ్చుటగాదు. ఆమె తగుపాటి వస్త్రము గట్టుకొని సొమ్ము సింగారము మాని భోగములేక యుండవలసినది. జంగమద్రవ్యమును వినియోగించుటయందుఁ దన సంరక్షకులు మేర యేర్పఱుప వలసినది. పాలివారు తమకుఁ బ్రత్యక్ష విరుద్ధముగా నామె చేయు వినియోగమును నిలుపుటకుఁ దగవుతెచ్చి యామెకు జీవనమున కిప్పించి యాద్రవ్యమం దామెయొక్క యధికారమును మాన్పవచ్చును.

౧౬౩. దూరపు దాయాదులు సహితము లేనిపక్షమందుఁ దనద్రవ్యమెల్లా వచ్చినదిగాని యెట్టిదిగాని వితంతువు యథేచ్ఛముగా వినియోగింపవచ్చును.

౧౬౪. తన భర్త జీవించియుండఁగా ద్రవ్య మందు భర్తకే యధికారము. సౌదాయికముగా వచ్చిన ద్రవ్యము మాత్రము స్త్రీ తన యిచ్ఛకు వచ్చినట్లు వినియోగించుకో వచ్చును. (స్మృతి చంద్రిక) భార్యాద్రవ్యము.

౧౬౫. సౌదాయిక ద్రవ్యముచేతఁ జేయ గోరిన ఋణప్రయోగాది వ్యాపారములు తన భర్త చేతఁ జేయింపవలసినది. అతఁడామె యిష్టమవశ్యము నెఱవేర్పవలసినది. (సరస్వతీ విలాసమందు)

పెండ్లిగాని స్త్రీ చేత వినియోగము.

౧౬౬. పెండ్లిగాని స్త్రీలు తమకుఁ జేరిన స్థావర జంగమద్రవ్యములను సంరక్షకుని యనుమతి లేక వినియోగింపఁగూడదు.

చిత్తవశత లేని వారి చేత—

౧౬౭. బుద్ధిమాంద్యముచేతఁగాని యున్మాదము చేతఁగాని బాల్యముచేతఁగాని ముదిమి రోగముల వలనఁ గలిగిన బుద్ధివైకల్యముచేతఁగాని నిర్బంధముచేతఁగాని కామముచేతఁగాని ద్వేషముచేతఁగాని చిత్తవశత లేనివాఁడు చేయు వినియోగము చెల్లనేరదు. (౧. ౨౩)

# ౮. ప్రకరణము

## ఉయిల్లు

ఉయిలు ధర్మశాస్త్రమందు లేదు.

౧౬౮. ఉయిలుచేత ద్రవ్యమును వినియోగించు నధికారము ధర్మశాస్త్రమందుఁ గానఁబడ లేదు. ఉయిలను సాధనమునకు ధర్మశాస్త్రమందు వాచకములేదు. ఈ విషయము ప్రామాణికులయిన సర్ ఉల్లియం జోన్స్, మేస్టర్ కోల్. బ్రూక్, మేస్టర్ ఎల్లిస్, సర్ తామస్ స్ట్రేంజి, వీర లేక కంఠముగాఁ జెప్పుచున్నారు. (౧. ౨౫౮, ౨౫౯; ౨, ౮౧౯, ౮౨౮, ౮౩౧)

ఉయిలు అనావశ్యకము.

౧౬౯. ధర్మశాస్త్రమందే ద్రవ్య వినియోగముకయి కావలసిన నియమము లేర్పడియున్నవి కాఁబట్టి యుయిలు వ్రాయుట కెడము లేదు. ఆస్తి యనుక్రమమున దూర బంధువు వఱకుఁ జేరవలసినదని, తుదకు దొరతనము వారికిఁ జేరవలసినదని, పోష్యులైన వారందఱియొక్క జీవనమున కేర్పడ వలసినదనియు ధర్మశాస్త్ర మూర్జితముగ నిర్ణయించుచున్నది. (౧. ౨౫౮, ౨౫౯)

౧౭౦. ధర్మశాస్త్ర విరుద్ధమయిన యుయిలు చెల్లదు. అవిరుద్ధమక్కఱ లేదు. (౨. ౮౨౧ ఎ)

ఉయిలు కోర్టువారు సమ్మతించెదరు.

౧౨౧. అయినను హిందువుల యుయిలు ప్రివి కౌన్సల్ వారు సుప్రీంకోర్టువారు సదరు కోర్టువారును సమ్మతించెదరు. (౧. ౨౬౮ నోటు; మూర్లి ౧. ౬౧౨-౬౧౮)

దొరతనము వారు-

౧౨౨. ఇంగ్లీషు దొరతనమువా రీవిషయము చూచువారికి సందేహము కలుగునట్లు చేసి పెట్టిరి. ఉయిలు విషయము ధర్మశాస్త్రమందు లేదని తెలియక చేసిన పూర్వపు చట్టమును దిద్దుకొని ఇప్పుడు ధర్మశాస్త్రమందుయిలు చెప్పఁబడినది కాదని యొప్పుకొనిరిగాని ఎంతదూరము ధర్మశాస్త్రాను సారి యయియుండు నంతమాత్రముదప్ప గడమ చెల్లదని చెప్పిరి. (౧౮ ౨౯ ౫ రిగ్యులేషన్)

ఉయిలు వ్రాయు నధికారవ్యవస్థ.

౧౨౩. ఎవ్వఁడుగాని తను జీవించునపుడు స్వతంత్రుఁడయి యియ్యఁదగినది యుయిలు వ్రాసియేల యియ్యరాదను యుక్తిచేత హిందువుల యుయిళ్లాపాటికి మాత్రము చెల్లునని యొప్పుకోఁబడియె. (౨. ౪౩౬, ౪౪౫ కో. సదర్ లాన్డు)

ఉయిలునకాకరము గలదా.

౧౨౪. హిందువుల యుయిలునకే నిమిత్తము చేతఁగాని యాకరము గలదా యని యింక విచారింతము.

౧౨౫. దత్తద్రవ్యమునకుఁ బునరాదానము ధర్మశాస్త్రమందు నిషిద్ధము. ఉయిలట్టిది గాదు. ఉయిలు వ్రాసినవాఁడు వ్రాసినదానికి మరలఁ బడఁ

వచ్చును. ఇట్టి దానము శాస్త్రసమ్మతము గాదు. (ఎల్ బర్లిజ్ ౧౩౭, ౧౪౦)

౧౭౬. ద్రవ్యము కొంతపాటి యయినను భోగమునకు రాని వాని కా ద్రవ్యమం దధికారము చెల్లదు. (౧. ౩౨, ౨౯౧)

౧౭౭. ద్రవిడ శాస్త్ర సంప్రదాయమునకు సరియయిన మైథిల శాస్త్ర సంప్రదాయమందు దత్త ద్రవ్యమునకు భోగములేక చెల్లుబడి లేదు. (౧. ౨౬౭; బం. స. డి. అ. ౨. ౭౬)

౧౭౮. దానమునకుఁ బ్రతిగ్రహమావశ్యకము గావున దత్తద్రవ్య సిద్ధికి భోగమావశ్యకము. ప్రతిగ్రహములేక దానప్రతిజ్ఞా మాత్రము చాలదు. (స. అ. పం. ౧౮౫౫ అక్టోబర్ ౧౩)

౧౭౯. ధర్మకార్యములకయి చేసిన దాన ప్రతిజ్ఞ మాత్రము తప్పక నెఱవేర్పవలసినది. (స. అ. పం. ౧౮౫౫ అక్టోబర్ ౧౩) ఈ యర్థము న్యాయమునకు సాక్షాద్విరుద్ధము గావున వ్యవహారమందుఁ జెల్లుట యరుదు.

౧౮౦. ఉయిలున వ్రాసిన ద్రవ్యము పుచ్చుకొనువాఁడు ముందుగా మరణించిన పక్షమం దా ద్రవ్యము వ్రాసినవానికే చేరును. (౨. ౪౪౫ సదర్లాన్డు) కాఁబట్టి యుయిలు వ్రాయుటచేత దాన ప్రతిగ్రహములు సిద్ధింపవనుట స్పష్టము. ఇందు

చేతనే యుయిలు దానమునకు సమానమని యెంచి వ్యవహారమందుఁ జెల్లుబడికిఁ దేఁగూడదు.

౧౮౧. ఉయిలు శాస్త్రసమ్మతము గాదు. ఎవ్వఁడుగాని తాను జీవించునపుడు దానము చేయ వచ్చునుగాని ప్రతిగ్రహము లేనిపక్షమందా దానము దానముగాదు. అవసానదశయందున్న ద్రవ్యము సమస్తము మరణించినవాని యుత్తరాధికారులకుఁ జేరవలసినది. కావున హిందువుల యుయిళ్లు చెల్ల నేరవు. (స. అ. ప్రా. ౧౮౫౫ జూలాయి ౩౦)

౧౮౨. పురుషుఁడు తన ద్రవ్యమందు భార్యకు జీవనాంశముంచి తక్కిన యంశమూను జోలిమాన్చి యథేచ్ఛముగా వినియోగింపవచ్చును. తన మర ణము తోనే తన ద్రవ్యమం దధికారము భార్యది గావునఁ దన పరోక్షమందిది యిట్లు వినియోగింపు మని నియోగింపఁ గూడదు (స. అ. పం. ౧౮౫౨ జూలాయి ౧౯)

౧౮౩. కాఁబట్టి హిందువుల యుయిళ్ళు చెల్లుట కవకాశము లేదు. తన జీవించు కాల మందు దాన పరిగ్రహములు లేక చేసిన వినియో గము దత్తరూపము గానేరదు. మరణానంతరము దాయభాగ విధి చొప్పునఁ జెల్లును.

# ౮. ప్రకరణము

## సొమ్ములోఁ జేయవలసిన వ్యయములు

౧౮౪. న్యాయ్యములయిన ఋణములకు మాసిక షాణ్మాసికాబ్దిక శ్రాద్ధముల కుపనయనాంత క్రియలకు వివాహములకు భరణమునకుఁ జేయవలసిన వ్యయము లాస్తిలోనివి. (౧. ౧౬౬-౧౭౧)

సొమ్ములోఁ జేయవలసిన వ్యయముల రీతి.

౧౮౫. పితృ ద్రవ్యము పొందికాని పొందక కాని పుత్రుఁడు తండ్రియొక్క ఋణమవశ్యము తీర్చుట శాస్త్ర చోదితము. (౧. ౧౬౭) ఈ విధి పారమార్థికముగాని వ్యవహార యోగ్యము గాదు. పైతృక ద్రవ్యము పొందనివాఁడు తండ్రి ఋణ మువేక్షింపవచ్చును. (౨. ౨౭౫, ౨౭౬ శ్లో)

తండ్రి ఋణము పుత్రుఁడు తీర్చవలసినది.

౧౮౬. పైతృక ద్రవ్యము పొందని వాఁడయ్యును బుత్రుఁడు తండ్రియొక్క ఋణము తీర్ప వలెనని చెప్పిన శాస్త్రాంశమును దొరతనమువా రేర్పఱిచిన కోర్టువారు చెల్లుబడిచేఁ దేవలెనని నియమము లేదు. పారంపర్య స్వత్వము దాయభాగము వివాహము వర్ణాచార మతాచారములు ధర్మ కార్యము లనియెడు వీనియందు మాత్రము హిందువుల వ్యవహారమును ధర్మశాస్త్రానుసారిగా జరుప

వలసినదని ౧౮౦౨ వ సం ౩ వ రెగ్యులేషన్ ౧౬ ప్ర. ౧ కలమున విధించిన ప్రకారము కోర్టువారు నడవ వలసినవారు. ఋణమున నుత్తర వాదము చేయుట ఋణాదానశాస్త్రవిషయమయి యుండును. ఇట్టి వివాదములయందు న్యాయమును విచారించి తీర్పు చేయవలసినది. ఆ చొప్పుననే పుత్రుఁడు తండ్రియొక్క ద్రవ్యము పొందిన కొలఁదికిఁ దండ్రియొక్క ఋణము తీర్పవలసినవాఁడని నిర్ణయింపఁబడినది. (స. అ. ప్రొ. ౧౮౩౭ ఫిబ్రవరి ౨౭; సర్క్యులర్ ఆర్డర్ ౭౩; స. అ. ౧౮౪౧ అ. నం. ౧౨ లో ...)

ఆస్తిమీఁద దగవు దెచ్చుట.

౧౮౭. ఉత్తమర్ణుఁ డధమర్ణుని ద్రవ్యమెవ్వని వశమందుండినను దానిమీఁదఁ దగవాడ వచ్చును. (౨. ౨౮౨ కో)

వితంతువు నుత్తర వాదము.

౧౮౮. వితంతువు భర్తయొక్క ద్రవ్యము పొందనిది వాని ఋణము తీర్పవలసినది గాదు. (౨. ౨౮౦, ౨౮౧ కో. ఎ) ఈ విధి వాని వెనుక జీవించియున్న బంధువుల కందఱికి సమానము.

కుటుంబ నిర్వాహకునియొక్క—

౧౮౯. సముదాయ ద్రవ్యము వశపఱచుకొని కుటుంబ నిర్వాహకుఁ డయిన కుటుంబి కుటుంబము మీఁద వచ్చు తగవుల కన్నిటికి నుత్తర వాదియై యుండవలసినది. (౨. ౩౩౪ ఎ)

౧౯౦. కుటుంబములోని యొక్కఁడు తన కయి చేసిన ఋణమునకు సముదాయ ద్రవ్యమీఁదు గాదు. (స. అ. పం. ౧౮౫౪ నవంబర్ ౧౩) కుటుంబ ద్రవ్యము యొక్క-

౧౯౧. అయినను వాని ఋణమునకు వాని భాగముమాత్ర మీఁదవు చున్నది. (స. అ. ౧౮౫౫ అ. నం. ౧౧౩, ౧౧౪ లో తీర్పులు) వానికిఁ బుత్రులున్న పక్షమందు వారి భాగములు ద్రోపుడు పెట్టవలసినది. (మితాక్షరయందు దత్తాప్రదానికము)

౧౯౨. విభర్తురాలయిన వితంతువు చేసిన ఋణ మామె ద్రవ్యములోఁ జెల్లింపఁదగిన దయిన పక్షమందా ఋణమున కామె యుత్తరాధికారు లుత్తరవాదు లగుదురుగాని తక్కిన ఋణమునకుఁ గారు. (బం. స. ది. అ. ౭. ౧౧౪; బం. స. ది. అ. ౧౮౪౬ అ. నం. ౧౭౯ లో తీర్పు) వితంతువు నుత్తరాధి కారుల యొక్క-

౧౯౩. సోదరుల యుపనయన విద్యారంభములకు సముదాయ ద్రవ్యమందు వ్యయము చేయవలసినది. ఉపనయనాదులకు వ్యయ నియమము.

౧౯౪. భగినీ, సోదరులకు వివాహ మాచొప్పుననే చేయవలసినది. (మితాక్షర ౧. ౭. ౪. ౫) వివాహములకు-

౧౯౫. స్వార్జిత ద్రవ్యము మాత్రము కల వాఁడు తన సోదరుల యుపనయన విద్యాభ్యాస

ములు నడపవలసినది. వివాహము చేయఁబనిలేదు. చెల్లెండ్రకు వివాహము జరుపవలసినది. (స్మృతి చంద్రిక)

౧౯౬. పుత్ర పౌత్ర ప్రపౌత్రుల యుపనయన విద్యాభ్యాస వివాహములకును బుత్రికల వివాహమునకును బితృభాగ ద్రవ్యమందే వ్యయాంశ మేర్పడి యుండవలెను.

జీవనము నకు- ౧౯౭. కుటుంబ భరణమనునది బహు జన విషయకమై యుండును. కుటుంబమందు జ్యేష్ఠుఁడగు వాఁడు సమస్త కుటుంబమును భరించవలెను. (౧. ౬౭)

౧౯౮. పోషింపవలసినది తన భార్యా పుత్రులను మాత్రము గాదు. తండ్రిని దల్లులను దండ్రియొక్క తల్లిదండ్రులను వివాహము లేని చెల్లెండ్రను వితంతువులయి గత్యంతరము లేని చెల్లెండ్రను దనచేరుగోండ్లను వారిబిడ్డలను దోషము చేత దాయార్హతమాలిన వారిని వారి భార్యా పుత్రికలను భరింపవలసినది. (౧. ౬౭, ౧౭౧, ౧౭౪)

౧౯౯. స్వీకారమునకు వెనుక దానికనర్హుఁడని తెలియఁబడిన దత్తుని వాని పుత్రుని భరింపవలసినది. (౧. ౮౨, ౯౭, ౯౮)

౨౦౦. న్యాయ్యమయిన నిమిత్తములేక విడువఁబడిన భార్యను భరింపవలసినది. (౧. ४౬) అయినను స్వల్ప నిమిత్తముచేతఁ దన్ను విడిచి పోయిన భార్యను భరింపవలసినది లేదు. (స. అ. ౧౮౭౩ అ. నం. ౨ లో తీర్పు)

౨౦౧. పుత్రుఁడు గతించిన వెనుక వాని భార్యా పుత్రికలను భరింపవలసినది. (స. అ. పం. ౧౮४౫ ఏప్రిల్ ౧౦)

౨౦౨. భ్రాతయొక్క ద్రవ్యము పొందిన వాఁడు భ్రాతృ కుటుంబమును భరింపవలసినది. (స. అ. పం. ౧౮౫४ నవంబర్ ౧౩)

౨౦౩. వైధవ్యమును జెందిన కోడలు మామను భరింపవలెను. (స. అ. పం. ౧౮౫౩ డిసెంబర్ ౧)

౨౦४. అవిభక్త భ్రాతృ పుత్రులు పుత్రుఁడు లేక గతించిన పితృవ్యుని భార్యను భరింపవలసినది. (స. అ. పం. ౧౮४౫ ఆగస్టు ౩౦)

౨౦౫. వ్యభిచారముచేత వితంతువునకుఁ దన జీవనాంశమందు స్వత్వము నివర్తించును. (౧. ౧౨౨)

౨౦౬. అయినను దానికి జీవనాంశమియ్య వలసినది. ఆ రీతినే వ్యభిచారిణియైన భార్యకు నయిత మియ్యవలసినది. (౧. ౫౮; ౨. ౩౯) అది

పేదపోఁడిమికిఁ దగుపాటి చాలును. తమ దుశ్చరితము మానుకొన్న పక్షమందే వారికి జీవనాంశ మియ్యవలసినది. (స. అ. పం. ౧౮౩౦ ఆగస్టు ౧౯; ౧౮౪౨ జనవరి ౨౬)

౨౦౭. వితంతువునకు స్వద్రవ్యముండినను లేకుండినను జీవనాంశ మియ్యవలసినది. భర్తకు జీవితకాలమందు భార్య యీలాగుననే పోష్యురాలను నిమిత్తమునఁ జేసి యట్లు చెప్పఁబడినది. (స. అ. పం. ౧౮౪౩ ఫిబ్రవరి ౨౮) అట్టి సాహాయ్యము కోరవలసిన యక్కఱలేని పసిమిగల వితంతువు తన జీవనాంశముఁ గోరుట పరులకు నిర్బంధరూపమై దుర్భరమయిన పక్షమందు దానిని ధర్మసూక్ష్మము విచారించి వారింపవచ్చును.

౨౦౮. స్వార్జితముదప్ప నితరము లేనివాఁడు వృద్ధులయిన తల్లిదండ్రులను భార్యను బాలకులయిన పుత్రులను దప్పక భరింపవలసినది. (మితాక్షరయందు దత్తాప్రదానికము)

భరణమిచ్చువారితో వాసము నిర్బంధ నియమము గాదు.

౨౦౯. జీవనాంశము పుచ్చుకొనువార లిచ్చువారితో వసింపవలెనని నిర్బంధము లేదు.

౨౧౦. దీని కుదాహరణము. వితంతువు తన మామతోఁగాని పెనిమిటి సోదరులతోఁగాని వసింపనక్కఱలేదు. (స. అ. పం. ౧౮౩౯ ఫిబ్రవరి ౧౬; ౧౮౪౪ ఫిబ్రవరి ౨౬) కొడుకుతోఁగాని సవతి కొడు

కుతోఁగాని సాధారణముగాఁ దన భర్తయొక్క బంధువులతోఁగాని వసింప నక్కఱలేదు. (స. అ. ౧౮౧౭ అ. నం. ౧౩ లో, ౧౮౪౬ అ. నం. ౭ లో తీర్పులు; స. అ. ప్రొ. ౧౮౫౧ సెప్టెంబర్ ౧౮)

౨౧౧. అవిధేయత పుత్రుల దాయార్హత పోఁగొట్ట నేరదు. కాఁబట్టి వారు భార్యకుఁ బుట్టిన వారుగాని చేరుగొండికిఁ బుట్టినవారుగాని తండ్రితో వసింప నక్కఱలేదు. (స. అ. ౧౮౨౧ అ. నం. ౨ లో తీర్పు)

౨౧౨. వేఱు వేఱుగా భరించుట యావశ్యకము గాక యది నిర్బంధ రూపమయి దుర్భరమైన పక్షమందు దానిని ధర్మసూక్ష్మము విచారించి మానుప వచ్చును.

౨౧౩. అన్న వస్త్రములకు వాసస్థానము లకుఁ గావలసినది భరణ మనఁబడు. అది యిచ్చు వారియొక్క పుచ్చుకొనువారియొక్క దశ కనురూప మయి యుండవలసినది. భరణమనఁగా నేమి.

## ౯. ప్రకరణము

### దాయానర్హత

దాయానర్హుల లక్షణము.

౨౧౪. జడుఁడు వెఱ్ఱివాఁడు పుట్టు చెవిటివాఁడు పుట్టు గుడ్డివాఁడు మూఁగవాఁడు పిచ్చుకుంటువాఁడు చేతులు లేనివాఁడు దీర్ఘరోగి క్షయరోగి కుష్ఠరోగి నపుంసకుఁడును దాయమునకర్హులుగారు. (౧. ౧౫౨–౧౫౬; మితాక్షర ౨. ౧౦. 3)

౨౧౫. రోగము పురాకృత పాపమున కడియాలమయి ఫలమయి యుండునను భావముచేత దాయానర్హతకు వ్యాధియొక నిమిత్తమని చెప్పుదురు. (౧. ౧౫౫, ౧౫౬) వ్యాధినివృత్తితో దాయానర్హత నివర్తించును.

౨౧౬. దౌర్జన్యము వికర్మత్వము వృథావ్యయమును దాయానర్హతకు నిమిత్తములు. వృథావ్యయము చేసినవాని కంతపాటియే తన భాగమందు నష్టమవును. అయిన నీ విషయములు చెల్లుట సందిగ్ధము. (౧. ౧౫౭–౧౬౦)

దాయానర్హత్వ

౨౧౭. దాయానర్హత్వమునకు నిమిత్తములు భాగార్హమయిన కాలమునకు ముందుండ

వలెను. భాగించుకొన్న వెనుకఁ బ్రాప్తించిన నిమిత్తములు దాయార్హత మాన్పఁ జాలవు. (౧, ౧౬౩) నిమిత్త మెప్పుడుం డవలెను.

౨౧౮. ఆ దోషములన్ని పురుషులకువలెనే స్త్రీలకుఁ బాటింపఁబడును (౧. ౧౬౪) గొడ్డాలితనము మాత్రము దోషముగాదు. ఈ దోషములు పురుషుల కట్లు స్త్రీలకు.

౨౧౯. ఔషధములచేతఁగాని ప్రాయశ్చిత్తము చేతఁగాని యీ దోషములు నివర్తించెనేని దాయమందు స్వత్వము మరలఁ గలుగును. (మితాక్షర ౨. ౧౦. ౭) అవి నివర్తించినపుడు స్వత్వము మరలఁగలుగును.

౨౨౦. దాయానర్హుల సంతతివారికి దోషములు లేని పక్షమందు దాయానర్హత పోనేరదు. (౧. ౧౬౩) స్వీకృత పుత్రునకీ యర్హతలేదు. (మితాక్షర ౨. ౧౦. ౨) అంశానర్హుల సంతతివారు.

౨౨౧. సన్న్యాసికి దాయార్హతలేదు. (౧. ౧౬౪)

౨౨౨. శూద్రులందుఁదప్ప జేరుగొండిదాని కొడుకులకు దాయార్హత లేదు. (౧. ౧౬౫) చేరుగొండిదాని కొడుకులు.

౨౨౩. జాతిభ్రంశము దాయానర్హతకు నిమిత్తము. ఈ విధి యింగిలీషు దొరతనము వారిచేత వారింపఁబడ్డది. (౧౮౫౦ ౨౧ ఆక్టు) జాతిభ్రష్టులు.

జారిణులు. ౨౨౮. అట్లు జారిణి విషయమందు వారింపఁ బడదు. ఇంగిలీషు శాస్త్రము చొప్పున వివాహ బంధముక్తికయి తెచ్చిన వ్యవహారమునకు లోబడి తన భర్తకు వెనుక రాఁగల స్వత్వము జారిణి పోఁగొట్టుకొనును. హిందూశాస్త్రము చొప్పున వివాదము జోలిలేక తోడనే వివాహ బంధము పోఁగొట్టుకొనును. కాఁబట్టి వ్యవహార పర్యంత మవకాశము కయే జారిణికి ద్రవ్యమందు స్వత్వము నివర్తించును.

# ౧౦. ప్రకరణము

## దాయభాగము

౨౨౫. హిందువులయందు ద్రవ్యము సమస్వత్వము గల దాయాదులకు మెట్టువరుసను సముదాయముగాఁ జేరును. కొందఱు దాయాదుల యొక్క స్వత్వము కొన్ని తరముల వఱకు వారి సంతతివారిని జేరునట్లుజీవించియుండు.

సమానులైన యుత్తరాధికారుల సముదాయ స్వత్వము.

౨౨౬. పితామహాదుల ద్రవ్యమందుఁ దండ్రితోడఁ గొడుకులు సమాన స్వత్వము గలవారు. పుత్రులు లేనిపక్షమందుఁ బౌత్ర ప్రపౌత్రులు సమస్వత్వము గలవారు.

పితాపుత్రులు.

౨౨౭. చిరప్రవాసియయినవాఁడుగాని వాని సంతతిగాని యున్నచో టెది యని తెలియని పక్షమందు వాని దాయస్వత్వము వానిఁ బుత్ర పరంపరయం దాఱవ తరము వఱకు జీవించి యుండును. (౧, ౧౮౭, ౧౮౮)

కానఁబడని వారియొక్క స్వత్వము.

౨౨౮. పితా పుత్ర పౌత్ర ప్రపౌత్రులు సరిమెట్టువారు; అట్లు భ్రాతృ తత్పుత్ర పౌత్ర ప్రపౌత్రులు; ఆ రీతిని పితృవ్య పుత్ర పరంపరవారు, ఆ చొప్పున వారి వితంతువులు; ఆ విధమునఁ బుత్రికలు; ఆ ప్రకారమునఁ బుత్రికా పుత్రులు; అట్లు

సరిమెట్టు సముదాయభాగులు.

దాయార్హులయిన పుత్రికా పుత్రికలును దమలోఁ దాము సహజముగాఁ బాలివారు.

అంశభాగులు. అంశాంశ భాగులు. ౨౨౯. వీరిలోఁ బుత్రులు సోదరులు (మితాక్షర ౧. ౨. ౫) వితంతువులు (స్మృతి చంద్రిక) తండ్రివలన ద్రవ్యము పొందు పుత్రికలును (మితాక్షర ౨. ౨. ౧) సమాంశ భాగులు. మఱియుఁ గొడుకుల కొడుకులు, కొడుకుల మనమలు, సోదరుల కొడుకులు, వారి కొడుకుల కొడుకులు, కొడుకు మనమలు, పితృవ్య పుత్రులు (మితాక్షర ౧. ౫. ౧) పుత్రికయొక్క పుత్రులు, మాతృ ద్రవ్యము పొందు పుత్రికలు, (మితాక్షర ౨. ౧౧. ౧౬) పుత్రికల మనమరాండ్రు నంశాంశ భాగులు.

పుత్రికలు. ౨౩౦. పుత్రికలయందు వివాహితకంటె ముందు వివాహము లేనిదానికిని బుత్రహీనురాల కంటె ముందు పుత్రవతికిని స్త్రీ ధనము గలదాని కంటె ముందు స్త్రీ ధనము లేని దానికిని దాయము చేరును. (౧. ౧౩౧; మితాక్షర ౨. ౧౧. ౧౩)

సమాంశకుల పరంపరా స్వత్వము. ౨౩౧. పుత్ర పౌత్ర ప్రపౌత్రులు లేనివాని యొక్క భాగము వాని సోదరులను జెందును. ఈ తీరుననే పుత్రిక పుత్ర రహితురాలయిన పక్షమందు దాని యంశ మితర పుత్రికలకుఁ జేరును. తక్కిన సమాంశకులయొక్క వర్గములయందొక్క సమాంశ

కుని స్వత్వము వాని సంతతివానిని జెందక మునుపు జీవించియున్న తన సరిమెట్టువారికి జెందును.

౨౩౨. ఒక్క సమాంశకునియొక్క స్వార్జితము తక్కిన సమాంశకులకుఁ జేరదు వాని సంతతి వారికిఁ జేరును. (౧. ౧౨౦) స్వార్జితము.

౨౩౩. సోదరులు తమ యార్జితములకయి యొండొరులతో నిర్ణయము చేసికోవచ్చును. (కోయంబుత్తూరు సీవిల్ కోర్టు ౧౮౫౨.అ. నం. ౧౭౯ లో

౨౩౪. తనతోఁగూడి కాఁపురము చేయుచున్న కొడుకుల యార్జితమందుఁ దండ్రికి సమభాగము గలదు. (౧. ౬౩, ౬౪)

౨౩౫. తండ్రి కనంతరము కూడి వసించు కుటుంబము వారియందు జ్యేష్ఠుఁడయినవాఁడు తక్కిన వారిచేత యోగ్యుఁడు గాఁడని నిర్వాహకుఁడు గాఁడని మాట దెచ్చుకోనివాఁడయిన పక్షమందు సముదాయ ద్రవ్యముంచుకొని కుటుంబ కార్యములు నడపవచ్చును. (౧. ౧౯౯) సముదాయ ద్రవ్యము నిర్వాహకుఁడు.

౨౩౬. అట్టి జ్యేష్ఠుఁడు కుటుంబము మేలుకయి చేయు కార్యములు చెల్లును గాని ద్రవ్యవినియోగమందు మాత్రము సమాంశకుల యొక్క యనుమతిని వచనముచేతఁగాని లేఖ్యము చేతఁ గాని నిర్వాహకుని యధికారము.

హేత్వంతరము చేతఁ గాని పొందవలసినది. (౧. ౧౯౯, ౨౦౦)

విభాగానుమతి. ౨౩౭. సముదాయ ద్రవ్యము దాయాదులు తమతమ పాళ్ళ మేరకు విభాగించుకోవచ్చును. దానితోనే యవిభక్తత్వము నివర్తించును. విభక్త ద్రవ్య మాయాపాలివానికే చేరి పిమ్మట వాని సంతతి వారికిఁ జేరుట విభాగమునకు ఫలము.

పుత్రులు దాయము భాగింపుమని తండ్రి నడుగు నధికారము. ౨౩౮. పుత్రులు పితామహ ద్రవ్యమును దమతో భాగించుకొమ్మని తండ్రియొక్క దశ పాటింపకయే తమ యిచ్చను వానిని బలాత్కరింప వచ్చును. (మితాక్షర ౧. ౫. ౮)

౨౩౯. పుత్రులు గతించిన యనంతరము వారికి మాఱు పౌత్ర ప్రపౌత్రులు భాగముకయి యట్లు బలాత్కరింప వచ్చును. (మితాక్షర ౧. ౧. ౩. ౨౩)

౨౪౦. తండ్రి సన్యాసి యయినవాఁడు మృత ప్రాయుఁడు గావున వాఁడు లేకయే పుత్రులు భాగించుకో వచ్చును. (౧. ౧౭౯)

౨౪౧. జాతి భ్రష్టుఁడు మృత ప్రాయుఁడని శాస్త్రము చెప్పుచున్నది గాని యింగిలీషు దొరతనము వారు జాతి భ్రంశము ద్రవ్య స్వత్వమందుఁ బ్రతిబంధకము కాదని చట్ట మేర్పఱిచిరి. (౧౮౫౦ ఆక్టు ౨౧)

పితాపుత్రులు సరిగా భాగించుకొనుట.

౨౪౨. తండ్రి గొడుకులు పైతృక ద్రవ్యమును సమముగా భాగించుకొనవలసినది. (మితాక్షర ౧. ౫. ౫) తండ్రి స్వార్జితము మాత్రము తనకే యుంచుకోవచ్చును. (౧. ౧౯౬)

౨౪౩. పుత్రుల కందఱికి భాగములు తుల్యములు. తల్లుల సంఖ్యఁబట్టి హెచ్చు దక్కువలు కానేరవు. (౧. ౧౯౩, ౨౦౫)

౨౪౪. శూద్ర జాతియందుఁ బుత్రులకు మాతృ సంఖ్యఁబట్టి విభాగమని యెంతురుగాని యీ యభిప్రాయము సరిగాదు. పుత్రుల కందఱికి సమభాగవిధి యెల్లవర్ణముల వారికి సమానమై యుండును. (స. అ. ౧౮౪౬ ఆ. నం. ౨౦లో తీర్పు)

పుత్రస్వీకారానంతరము పుట్టిన పుత్రులు.

౨౪౫. దత్తస్వీకారము పిమ్మట జన్మించిన పుత్రులం దొక్కనికి వచ్చిన భాగములో నాలవపాలి సరిపాలు దత్తునికి రావలసినది. (ఎల్ బర్లిజ్ ౭౧)

శూద్రుల దాసేరులు.

౨౪౬. శూద్రులలోఁ గులస్త్రీ పుత్రునకు వచ్చు భాగములో సగము కొలఁదిపాలు దాసేరులకు రావలసినది. తండ్రి దాను జీవించునపుడు వారికిఁ దనకుఁ దోఁచినట్లు భాగమియ్య వచ్చును. తండ్రి పోయిన వెనుక మా భాగ మిమ్మని కుల స్త్రీ పుత్రుని నడుగు నధికారము వీరికిఁ గలదు. (మితాక్షర ౧. ౧౨. ౧, ౨)

స్వార్జిత విభాగము.

౨౮౭. స్వార్జితమును బుత్రులకుఁ దనకు భాగించుకొనఁ గోరిన తండ్రి పుత్రులకు సమభాగ మియ్యవలెను. అయినను దనకు రెండు పాళ్లుంచుకో వచ్చును. (స్మృతి చంద్రిక)

అదిమరలఁ బుచ్చుకొనుట.

౨౮౮. పేదఱికము వచ్చినప్పుడు ముందు పుత్రులకుఁ బంచియిచ్చిన స్వార్జిత ద్రవ్యమును మరలఁ బుచ్చుకో వచ్చును. (౧. ౧౯౬)

ఒక పుత్రుఁడుభాగించుకోవచ్చును

౨౮౯. అవిభక్తులయిన యితరులుండగా భాగ మొక పుత్రునికి మాత్ర మియ్యవచ్చును. (౧. ౧౯౩, ౧౯౪) తమతమ భాగ మిమ్మని పుత్రులం దొక్కఁ డొక్కఁడు తండ్రి నడుగ వచ్చును. అందఱు గూడి వానిమీఁద వ్యవహారము తేవచ్చును.

భాగము మానుకొనుట.

౨౯౦. విభాగమందుఁ గోరిక లేనివాఁడు తక్కినవారి తృప్తికయి యేదో కొంచెము పుచ్చుకొని భాగము మానుకో వచ్చును. వాఁడు చేసిన దానికి వారి యుత్తరాధికారులు కట్టు పడవలసినది. (౧. ౧౯౫) తన జీవనమునకు సంపాదించుకొను శక్తి లేని వాఁడట్లు మానఁగూడదు. (మితాక్షర ౧. ౨. ౧౧, ౧౨)

విభాగానంతరము పుట్టిన పుత్రులు.

౨౯౧. తండ్రి కొడుకులతో విభాగించుకొన్న వెనుకఁ గన్న కొడుకులకు వాని భాగమందే పాలు వచ్చును. (మితాక్షర ౧. ౬. ౨)

౨౫౨. విభాగానంతరము పుట్టిన పుత్రునకుఁ దండ్రి పాలిలో భాగము వచ్చును గాని ముందు విభక్తులైన తోఁబుట్టువుల పాలిలో రానేరదు. వీరియం దెవ్వరైనఁ దండ్రితో మరలఁ గూడి యుండిరేని వారు వానితో సమముగా భాగించుకో వలసినది. (౧. ౧౮౨)

౨౫౩. తదనంతరము పుత్రులు పుట్టని తండ్రియొక్క భాగమును విభక్తులైన పుత్రులు పొందుదురు. (౧. ౧౮౩)

విభక్త పుత్రులు.

౨౫౪. తండ్రిపోయిన వెనుక వాని స్వార్జితము భాగించుకో వలసి ప్రసక్తించి నప్పుడు పుత్రులు పితామహ ద్రవ్యమువలెనే సమానముగా భాగించుకోవలసినది. (౧. ౨౦౮)

పిత్రార్జితము.

౨౫౫. తల్లిదండ్రుల మరణానంతరము వారి ద్రవ్యము పుత్రులు పంచుకోవలసినదని మనుస్మృతి యందు (౯. ౧౦౪) చెప్పబడినది. దీనిచేతఁ దల్లిదండ్రులిద్దఱును గతించిన పిమ్మటనే పుత్రులు భాగించుకోవలెనని తాత్పర్యము గాదు. పుత్రులుండగాఁ దల్లిదండ్రులలో నొకరి ద్రవ్యమందొకరి కధికారము లేదు గాఁబట్టి వారిలో మరణించిన వారి ద్రవ్యము భాగించుకోవచ్చుననుట తాత్పర్య మని స్మృతిచంద్రికయందు వివరింపఁబడినది. (౧. ౨౦౪) తల్లి ద్రవ్యమందు స్వత్వము పుత్రికలది

తల్లిగాని తండ్రిగాని పోయిన వెనుక విభాగము.

కాఁబట్టి వారు లేనిపక్షమందే యాద్రవ్యము పుత్రులు పంచుకోవచ్చును. (మితాక్షర ౧. ౩. ౧౩)

ఒకయంశకుఁడు తన భాగముపంచి యిమ్మని యడుగవచ్చును.

౨౫౬. ఒక యంశకుఁ డవిభక్తులై కూడి యున్న తక్కిన వారిని దనభాగము పంచియిమ్మని కక్కసింపవచ్చును. (౧. ౨౦౪)

బాలునికై భాగమడుగవచ్చును.

౨౫౭. బాలుఁడు తన యంశమునకు దుర్వ్యయము చేత హాని రానిపక్షమందు దానికై తగవాడఁ గూడదు. హాని వచ్చు పక్షమందు వాని సంరక్షకుఁడు దానికై తగవు తేవచ్చును. (౧. ౨౦౬)

వెనుకఁబుట్టిన పుత్రుఁడు.

౨౫౮. అపుత్రకుఁడై గతించిన సోదరుని భార్య గర్భిణియై యుండఁగా బ్రసక్తించిన విభాగమందొక భాగము పుట్టఁగల పుత్రుని కని యెత్తి యుంచవలసినది. (౧. ౨౦౭; మితాక్షర ౧. ౬౧౧)

భాగవిసర్జనము.

౨౫౯. విభాగించు నపుడొక సమాంశకుఁ డల్ప మంగీకరించి తన స్వత్వము మానుకోవచ్చును. ఇది యెప్పటికిఁగాని తగవు తెచ్చుటకుఁ బ్రతిబంధమవును. (౧. ౨౦౭)

భాగవైషమ్యము.

౨౬౦. సోదరులు భాగించుకొనుటయందు సంభవించు న్యూనాధికతల కుదాహరణములు మీఁద వ్రాయఁబడును–

౧ది-అ బ స అనువారు సోదరులు. అ అనువాఁడు డ ఇ ఫ అను ముగ్గురు పుత్రులను గని గతించినాఁడు. ద్వితీయుం డౌ కఁడు డ అనువాఁడు గ హ ఐ అను ముగ్గురు కొడుకులను గని గతించినాఁడు. బ స అను మొదటి సోదరులు జ క అను వారిని జేటియొకనిఁ బుత్రస్వీకారము చేసి గతించినారు. ఇట్లుండగా దాయభాగము ప్రసక్తించినది. అప్పుడు ద్రవ్యము మూఁడు పాళ్లు చేసి జ క అను వారికిఁ జేటి యొక్కొక్క పాలియ్యవలసినది. మిగిలిన యొక భాగమును మూఁడు పాళ్లు చేసి ఇ ఫ అను వారికిఁ జేటి యొక పాలియ్యవలసినది. అందు నిలిచిన భాగమును మూఁడు పాళ్లు చేసి గ హ ఐ అను వారికిఁ జేటి యొక్కొక్క పాలియ్యవలసినది. ఫలితార్థము. జ క అనువారికిఁ జేటి మూఁడవ యంశము సముదాయ ద్రవ్య మందియ్య వలసినది. ఇ ఫ అనువారికిఁ జేటి తొమ్మిదవ భాగమియ్య వలసినది. గ హ ఐ అనువారికిఁ జేటి యిరువది యేడవ పాలియ్యవలసినది (౨. ౩౧౨, ౩౧౩)

౨వది-అ బ స అనువారు సోదరులు. అ అనువాఁడు డ అను పుత్రుని గని గతించినాఁడు. డ తన తండ్రికి రావలసిన దాయ తృతీయాంశ మడిగి పుచ్చుకొన్నాఁడు. ఆ వెనుక బ సంతులేని వాఁడై గతించినాఁడు. వాని భాగము జీవితుఁడైన యవి

భక్తుఁడైన స అనువానికిఁ జేరినది. విభక్తుఁడైన డ అనుజ్ఞాతికి దాని మీఁదఁ దగవు లేక పోయినది. (గంజాము జి. కో. పం. ౧౮౦౬ ఫిబ్రవరి ౮) డ అనువాఁడు బ అనువాని మరణమునకు ముందు విభక్తుఁడు కాకుండి వెనుక క అనువానితో విభాగించుకొన్న పక్షమందుఁ దనతండ్రి భాగముతో గతించినవాని సగము పాలు చెందియుండును.

పుత్రికలు.

౨౬౧. సమాంశక లయిన పుత్రికలు తమకు వచ్చిన ద్రవ్యము పుత్రులవలెనే భాగించుకో వచ్చును. (ద. ఖం. ప్రా. కో. పం. ౧౮౧౭ సెప్టెంబర్ ౧౦.)

విభక్తద్రవ్యము స్వవంశ పరంపరనుండి తప్పిపోవుట.

౨౬౨. సోదరులకు వచ్చిన విభక్త ద్రవ్యము తమ వంశ పరంపరనుండి తప్పిపోనుగాని పుత్రికల కట్లు దప్పదు. (పెద్ద మెక్‌నాటన్ ౫౫) దీనికుదాహరణము. అపుత్రకుఁడైన విభక్త సోదరునియొక్క ద్రవ్యము వాని పత్నికిఁగాని పుత్రికలకుఁగాని చేరును. పుత్రికలయందు విభాగమిట్లుగాదు. వివాహితురాలై గతించిన సమాంశకురాలియొక్క ద్రవ్యము దాని పరంపరవారికిఁ జేరును. అవివాహితురాలి ద్రవ్యము దాని సోదరులు మొదలైన వారికిఁ జెందును. (మితాక్షర ౨. ౧౧. ౧౨, ౩౦)

విభాగ సిద్ధి క్రమము.

౨౬౩. పంచాయతివారి వలనఁగాని పరస్పర సమాధానము వలనఁగాని చీట్లు వేయుటవలనఁగాని

విభాగము చేసికోవచ్చును. (౧. ౧౯౦) ఇట్టి యే కుదురుబాటుగాని యనుకూలింపని పక్షమందు విభాగము వ్యవహారముచేతనే సిద్ధింపవలసినది.

౨౬౪. విభాగమడిగి నిరాకరింపఁబడినవాఁ డప్పుడు మొదలుకొని వ్యవహారకాలావధి లోపల వ్యవహారము తేనిపక్షమందు వాని దాయభాగ స్వత్వము నశించును. అడుగని పక్షమం దెంత కాలమునకుఁగాని నశింపదు. (స. అ. ౧౮౧౫ అ. నం. ౧౧ లో తీర్పు) కాలావధి.

౨౬౫. విభాగదశయందు ఋణ వ్యయముల కాస్తిలోనే యేర్పాటు చేయవలసినది. (౧. ౧౯౧, ౧౯౨) ఈ ఋణవ్యయాంశములు సమాంశకులు భాగించుకోవచ్చును. (౨. ౨౮౩ కో) లేదా వలసిన పక్షమందు జీవనమునకు భాగమేర్పఱిచినట్లు ఋణ వ్యయములకు భాగమెత్తి యుంచవలసినది. ఆస్తిలోని వ్యయముల కేర్పాటు.

౨౬౬. ఆస్తియందు దుర్వ్యయముఁగాని చెల్లని వినియోగముఁగాని చేసిన సమాంశకుఁడా నష్టాంశము తగ్గించి భాగముఁ బుచ్చుకోవలసినవాఁడు. ఈ నష్టము వాని భాగమునకు మీఱి యున్న పక్షమందు దాని మిగతకై వానిమీఁద వ్యవహారము తేఁగూడదు. (౧. ౨౨౪, ౨౨౫) సమాంశకు నివలనవచ్చిన నష్టమున కుఁ బరిహారము.

౨౬౭. ఒక సమాంశకుఁడు తక్కిన వారిని మోసపుచ్చవలెనని యాస్తియందే మాత్రముగాని సమాంశకుఁడు దాఁ

చిన ద్రవ్య మునకు— దాఁచిన ద్రవ్యము కొలఁది దనభాగమందు నష్ట మొప్పుకోవలసినది. (మితాక్షర ౧. ౯. ౪. ౫)

వెలిపడిన ద్రవ్యమునొక్క విభాగము. ౨౬౮. ఒకసారి చేసిన విభాగము సాధారణముగాఁ జెడనేరదుగాని విభాగమునకు రాని వస్తువులు వెలుపడిన పక్షమందవి సహితము వెనుక విభాగించుకోవచ్చును. (౧. ౨౩౦, ౨౩౧)

మరలవిభాగము. ౨౬౯. విభాగ కాలమందు నిమిత్తము తెలియక భాగములు హెచ్చు తక్కువలైన పక్షమందు మరల విభాగించుకో వచ్చును. (౧. ౨౩౨) ఈ కార్యము సమాంశకుల సమ్మతి మీఁద జరుగవలసినది. మోసము జరిగియున్న పక్షమందు ధర్మస్థానమువారది పరిహరింతురు.

సముదాయ ద్రవ్యవృద్ధి. నవీనార్జితము. ౨౭౦. సముదాయ ద్రవ్యమును వృద్ధి బొందించిన సమాంశకునకు భాగమధికము కలుగ నేరదుగాని (౧. ౨౧౩) సముదాయ ద్రవ్య సాహాయ్యముచేత వేరుగా సంపాదించిన ద్రవ్యమందు మాత్రము రెండంశములు వానికి వచ్చును (౧. ౨౨౦; స. అ. ౧౮౧౪ అ. నం. ౭లో

స్వాత్వము వాని పుత్ర సంతతికి సహితము కలదు.

కుటుంబ నష్టార్జిత ద్రవ్యము. ౨౭౧. నష్టమైన కుటుంబ భూస్థితిని కుటుంబ ద్రవ్య సాహాయ్యము లేక యుద్ధరించి యది కుటుంబమునకుపయోగింపఁ జేసిన సమాంశకున కా ద్రవ్యమందు విశేషముగా నాలవ భాగము చేరవలసినది.

మిగిలినది యితర సమాంశకులును వాఁడును భాగించుకోవలసినది. (మితాక్షర ౧. ౪. ౩)

౨౨౨. ఆస్తియందు గొంత యంశము భాగించుకొని శేషము తర్వాత భాగించుకొనుటకు నిలిపి యుంచవచ్చును. (౧. ౧౯౫) అంశ విభాగము.

౨౨౩. అంశ భాగులు విభాగానంతరము సంసృష్టులై యుండవచ్చును. పిమ్మటఁ గ్రొత్తగానే విభాగము చేసికో వచ్చును. (౧. ౨౩౩) ఇట్టి సంసృష్టత పితాపుత్రుల యందును సోదరులయందును పితృవ్య భ్రాతృ పుత్రులయందు మాత్ర మను జ్ఞాతమై యున్నది. (మితాక్షర ౨. ౧౧. ౩) విభాగానంతరము సంసృష్టి.

౨౨౪. స్వార్జిత ద్రవ్య మల్లు మీఁదఁ జెప్పఁబడు ద్రవ్యములు విభాజ్యములు గావు. అవిభాజ్యమైన ద్రవ్యము.

(౧.) ధర్మార్థము విడిచిన భూములను ధర్మార్థ మేర్పరచిన సమస్త వస్తువులును. (౧. ౨౦౮, ౨౧౦)

(౨.) జ్యేష్ఠపుత్రునకు లభించిన రాజ్యమును ప్రాచీనము లైన జమీనులును. (౧. ౧౯౮, ౨౦౮: స. అ. ౧౮౪౬, అ. నం. ౨౦ లో తీర్పు)

(౩.) కుటుంబము యొక్క సమ్మానమునకై పరువుకై యిచ్చిన భూమి. (స. అ. ౧౮౫౦ అ నం. ౫ లో తీర్పు)

(౪.) దొరతనము వారి శాసనము చేత లభించి నవీనముగా జ్యేష్ఠపుత్రుని పేరఁ జేసిన జమీనులు. (స. అ. ౧౮౧౬ అ. నం. ౧౧ లో తీర్పు)

(౫.) పుత్రులతో విభాగానంతరము పుట్టిన పుత్రులకే తండ్రియొక్క స్వార్జితము చేరును. (౧. ౧౮౨, ౧౮౩)

(౬.) సముదాయ ద్రవ్యములోని దయినను వధూసహితుఁడయి గ్రహించిన యౌతక ద్రవ్యము. (౧. ౨౧౫, ౨౧౬)

(౭.) వాడుకగా ధరింపఁబడు స్వీయము లయిన వస్త్రాభరణములు. (౧. ౨౧౧)

(౮.) కరణికము పిత్రార్జిత మయినను దాని వలని స్వత్వము. (౧. ౨౧౯)

యోగ్యము లయిన కొన్ని విషయములు.

౨౭౫. ధర్మార్థమిచ్చిన భూములు విభాజ్యములు కావు గాని తద్విచారణ కార్యము విభాజ్యమయి యుండవచ్చును. (౧. ౨౧౦)

౨౭౬. జ్యేష్ఠపుత్రునకు లభించిన రాజ్యములు ప్రాచీనములయిన జమీనులు విభాజ్యములు గావు గాని రాజు యొక్క గాని జమీన్దారుని యొక్క గాని జంగమ ద్రవ్యము విభాజ్యము (౨. ౩౨౯, ౩౩౦ ఎ; స. అ. ౧౮౧౬ అ. నం. ౧౧ లో ౧౮౪౮ అ. నం. ౬౪ లో తీర్పులు)

౨౭౭. జాగీరులు, శ్రోత్రియములు, పౌరోహిత్యము, గుడియూడిగము మొదలైనవి విభాజ్యములు. (౧. ౨౧౦)

౨౭౮. తండ్రియొక్క వర్షాశనము పుత్రులకు విభాజ్యము. (౧. ౨౦౯)

౨౭౯. భాగహారులు తమతమ లాభములు కాపాడుకొనుట కొఱకు వివాదము రాకుండుట కొఱకు నొకరిచేత నొకరు భాగ పత్రికలు పుట్టించుకో వలసినది. లిఖితపురస్సరమైన విభాగము యుక్తము.

౨౮౦. ఈ భాగ పత్రికలయందు వానివాని విభాగమునకు వచ్చినవి యీ, యీ వస్తువులని యేర్పడి యుండవలసినది. జ్ఞాతులుగాని తుదకన్యులుగాని సాక్షి చేవ్రాలు చేసియుండ వలసినది. (౧. ౨౨౨, ౨౨౩)

౨౮౧. ఇట్టి సాధనము లపేక్షణీయములైనను మిక్కిలి యావశ్యకములు గావు. (౧. ౨౨౨)

౨౮౨. కుటుంబమందు విభాగము గలిగిన దనుటకు గుఱుతు పాలివారికిఁ దమ తమ భాగములు చేరియుండవలెను. విభాగ పత్రములు మాత్రము కలిగియుండుట దానికి గుఱుతుగాదు. (స. అ. ౧౮౩౮ అ. నం. ౬, ౮ లో; ౧౮౫౨ అ. నం. ౧౦ లో; ౧౮౫౪ అ. నం. ౫౭, ౮౬ లో తీర్పులు) భాగనిరూపణ.

౨౮౩. క్షేత్ర విభాగము లేక సస్యము మాత్రము భాగించుకొనుట చేత విభక్త కుటుంబ మని చెప్పఁగూడదు. (నెల్లూరు జి. కో. వం. ౧౮౨౪ అక్టోబర్ ౮)

౨౮౪. భాగముకయి తగవాడుచున్న వాఁడు వ్యవహారము జరుగుచుండఁగా గతించెనేని వాఁ డవిభక్తుఁడని యెంచవలసినది. కాఁబట్టి వాని భార్యకు వాని భాగ్గ మడుగుట కధికారము లేదు. (స. అ. ౧౮౫౪ అ. నం. ౮౬ లో తీర్పు)

౨౮౫. కుటుంబ ద్రవ్యమందు భాగస్వత్వము కలవాఁడని తీర్పుఁ బొందినవాఁడు తీర్పు చొప్పున విభాగించు కొనక ముందు గతించెనేని వాఁ డవిభక్తుఁడని యెంచవలసినది (స. అ. ౧౮౫౫ అ. నం. ౬౮ లో తీర్పు)

౨౮౬. సముదాయ ద్రవ్యమందుఁ గొంత యంశము భాగించుకొని మిగిలిన యంశము గొంత కాలము వఱకుఁ గార్యార్థముగా నిలిపి యుంచుకొన్న పాలివారు విభక్తులని యెన్నఁబడుదురు. పాలి వారిలో గతించిన వానియొక్క భార్య యా మిగిలిన రాశియందుఁ దన భర్తకు రావలసిన భాగ మడుగ వచ్చును. (స. అ. వం. ౧౮౫౫ ఏప్రల్ ౧౯)

అవిభక్తులని యూహించుట.

౨౮౭. హిందువులలోఁ గుటుంబమువారు గూడి వసించుట స్వాభావికముగావున విభాగము

వివాద గ్రస్తమయిన పక్షమందుఁ గుటుంబమువారు విభక్తులయినారనుట రుజువగువఱకు విభాగము కలుగలేదనియే యెంచవలసినది. (౧. ౨౨౫)

౨౮౮. విభక్తత్వమునకుఁ బ్రత్యక్ష ప్రమాణము లేని పక్షమందది యనుమాన ప్రమాణము చేత నిశ్చయింప వలసినది. ఇట్లు నిర్ణయించుట కష్టము. విభాగనిశ్చయమునకను మాపకలక్షణములు.

౨౮౯. కుటుంబమువారు నివాస భోజన శుభాశుభకృత్యములయందు వేఱు పడియున్నను విభక్తులు కాక యుండవచ్చును. చెప్పిన నివాసాదులందు వేఱు పడకున్నను విభక్తులయి యుండవచ్చును. (౧. ౨౨౫, ౨౨౬)

౨౯౦. వైశ్వదేవాది కర్మములయందు భిన్నులయి యుండుట; భిన్నపాకులయి యుండుట; ఒడంబడికలు ఋణక్రయ విక్రయము లొండొరులతో జరుపుట; యొకని కొకఁడు పూఁటపడుట; ద్రవ్య విషయమం దొకని కొకఁడు ప్రతికూలముగాఁ గాని యనుకూలముగాఁ గాని సాక్ష్యము చెప్పుట; విభక్తులని పొరుగు వారికిఁ దెలియఁబడి యుండుట; గ్రామముయొక్క వచ్చుబళ్ళు వేఱు వేఱుగాఁ

రాఁబట్టుకొనుటయు; విభక్తత్వమున కనుమాపక లక్షణములు. (౧. ౨౨౭)

౭౯౧. కుటుంబ సముదాయముతో సంబంధించిన కర్మము వేఱుగాఁ జేసికొనుట విభక్తత్వమున కనుమాపక లక్షణ మగును గాని వాఁడు వాఁడు తన యిచ్ఛకు వచ్చినట్లు చేసికొను పృథక్కర్మము లట్లు కానేరవు. అయినను సముదాయ కర్మమందు వేఱుపడకుండుట చేత నేయవిభక్తత్వలక్షణము నుగిసినది గాదు. (౧, ౨౨౭, ౨౨౮) శ్రాద్ధ వైశ్వదేవ గృహదేవతార్చనములు కుటుంబ సముదాయముతో సంబంధించిన కృత్యములు. త్రిసంధ్యమందుఁ జేయఁదగిన కర్మములు బ్రహ్మయజ్ఞము నవగ్రహపూజ యౌపాసనము మొదలైనవి పృథక్కర్మములు.

౭౯౨. విభక్తత్వమునకు దృఢమయిన ఋజువుండఁగా నపర క్రియలు సముదాయమువారు కూడి చేసిన మాత్రాన విభక్తులు గారని చెప్పఁగూడదు. (౨. ౩౯౧, ౩౯౨ కో. ఎ)

౭౯౩. మునుపు చెప్పిన లక్షణములు సర్వము సాధక ప్రమాణములై యున్నవి గాని యవి యన్నియు నుండవలె నని యక్కఱ లేదు. (౨. ౨౨౮)

౨౯౪. ఏక గృహమందు వసించుచు భాగహరులు భిన్నపాకులయి యుండుట విభక్తతకు ముఖ్యమయిన యనుమాపక లక్షణమని విశ్వసింపఁదగినది. ఇదియు హేత్వంతరములచేతఁ బరిహార్యము కావచ్చును. (౧. ౨౨౮, ౨౨౯; ౨. ౩౯౭ కో)

# ౧౧. ప్రకరణము

## దాయాధికారము.

దాయవిభాగమున కుపక్రమము.

౨౯౫. ఒక్కఁడు మృతుఁడుగాని సన్న్యాసిగాని యునికి తెలియరాక గతించినాఁడని సంభావింపఁదగినంతకాలము చిరప్రవాసిగాని యయిన పక్షమందుఁ దక్కిన దాయాదులు దాయము విభాగించుకోవచ్చును. (౧. ౧౨౨)

౨౯౬. జాతిభ్రష్టుఁడు సహితమట్టివాఁడే (౧. ౧౨౨) కాని, యింగ్లీషు దొరతనపువారు దాయ విభాగ స్వత్వమునకుఁ బ్రతిబంధకమయిన యీ విధి నిషేధించిరి. (౧౮౫౦ ఆక్టు ౨౧)

మరణసంభావనఁ బుట్టించుకాలపరిమితి.

౨౯౭. పోయినపోకు దెలియఁబడక కానఁబడని వాఁడు గతించినవాఁడని సంభావించుటకు వాని వయసుకొలఁదిని గాలపరిమితి భిన్నమయియుండును. ౩౦ ది మొదలుకొని ౩౫ ఏండ్ల వయస్సు గలవాఁడట్లు గానఁబడకపోయిన పక్షమందు మీఁద ౨౦ ఏండ్లకు గతించినవాఁడని సంభావింపఁబడును. ౪౦ మొదలుకొని ౪౫ ఏండ్లవాఁడయిన పక్షమందు మీఁద ౧౫ ఏండ్లకును ౬౦ మొదలుకొని ౬౫ లోని

వాఁడయిన పక్షమందు మీఁద ౧౨ సంవత్సరముల కును వాఁడట్లు సంభావింపఁబడును. (౨. ౨౩౭, ౨౩౮ శ్లో)

౨౯౮. గతించినవాని కపరక్రియలు చేయు వారికి వాని దాయమందధికారము కలుగును. వానికి స్వబంధువులయం దపరక్రియలుచేయ నర్హులయిన వారే యుత్తరాధికారులు.అట్లు కాని వా రుత్తరాధి కారులు కారు. (ఎల్ బర్లిజ్ ౬౭) — అపర క్రియా కర్తృత్వము చేత వచ్చు దాయాధి కారము.

౨౯౯. అనర్హుఁడయిన బంధువు గతించినవాని కపరక్రియలు చేసిన పక్షమందు వానికి దాయభాగ స్వత్వము లేదు. (౧. ౧౨౯, ౧౩౦)

౩౦౦. బంధువులైన స్త్రీలు కొందఱు మాత్ర మపరక్రియలు చేయునుగాని చేయింపనుగాని వచ్చును.

౩౦౧. దాయాధికారసిద్ధికి దాయాధికారి పుట్టి యుండవలెనని యక్కఱలేదు. వాఁడు గర్భస్థుఁడై యుండుట చాలును (ఎల్ బర్లిజ్ ౮౦) — పితృపరోక్షమందు జాతునకు దాయసిద్ధి.

౩౦౨. సపిండులని సమానోదకులని బంధువులని దాయాదులు మూఁడు విధములవారు.సపిండులనఁగా గతించినవారికి జలముతోఁ బిండ దానము చేయు వారు. సమానోదకులనఁగా జలమాత్ర దానము — పలుమెట్టు వారు సల దాయాధి కారము.

చేయువారు. తక్కిన జ్ఞాతులు బంధువులనఁబడు దురు. (మితాక్షర ౨. ౫. ౬; ౨. ౬) సపిండులు లేనిపక్షమందు సమానోదకులు పిండదానము చేయు దురు. వారు లేనిపక్షమందు బంధువులు చేయుదురు.

303. సపిండులు రెండువిధములవారు. పిండ ముల దానగ్రహణ సంబంధముగలవారు సమీప సపిండులు. చేతులయం దంటుకొన్న పిండ లేపము యొక్క దానగ్రహణ సంబంధముగలవారు దూర సపిండులు. సమానోదకులు సహితము రెండు విధ ములవారు గాని వారి యుదకప్రదానమందు భేదము లేదు. (మన్వర్థముక్తావళియందు మనువు ౫. ౬౦)

సపిండుల యొక్క యవధి.

304. ఒకనికి వెనుకటి యాఱవ తరమువఱకుఁ బుత్రపరంపరవారును ముందాఱవ తరమువఱకుఁ బితృపరంపరవారును దత్పితృపరంపర యొక్క యాఱవ తరమువఱకుఁ బుత్రులును సపిండు లనఁ బడుదురు. సోదరులును వారి నైదవ తరము పర్యం తము పుత్ర పరంపర వారును మూలపురుషుఁడైన తండ్రికి సంతతి వారగుదురు. భార్య పుత్రికలు దౌహి త్రులు తల్లి పితామహియు సపిండవర్గములోని వారు. (సరస్వతీ విలాసము; వరద రాజీయము; స్మృతి ముక్తాఫలము) ఇంతకంటె స్త్రీవర్గమందు సపిండులు లేరు. సపిండ వర్గమందుఁ గడపటి సపిం డుఁడు పుత్రపౌత్ర ప్రపౌత్రుఁడు.

౩౦౫. ఒక పురుషునకు వెనుకటి మూఁడు తరముల వారును ముందు మూఁడు తరములవారును రెండవసారి చెప్పిన మూఁడు తరములవారి రెండవ తరమువఱకు సంతతివారును సమీప సపిండులు. (స్మృతిచంద్రిక) భార్య పుత్రికలు పుత్రికాపుత్రులు తల్లి పితామహియు సమీప సపిండవర్గములోని వారు. (స్మృతి ముక్తాఫలము) పురుషునకుఁ బ్రపౌత్రునివఱకు సమీప సపిండులు. తక్కినవారు దూర సపిండులు, — సమీప సపిండుల యొక్క—

౩౦౬. సపిండులగు పురుషులకు వెనుకటి యేఁడు తరముల పురుషులును ముందాఱుతరముల పురుషులును వీరి వెనుకటి యేఁడుతరముల పురుషులును సమానోదకులు. (మితాక్షర ౨. ౫. ౬; స్మృతి చంద్రిక; స్మృతిముక్తాఫలము) — సమానోదకుల యొక్క—

౩౦౭. ముందు చెప్పిన వర్గములోని పక్క దాయాదులందఱు కర్మకర్తతోడఁగూడి తమ కందఱికి సామాన్యముగా మూలభూతుఁడయిన యొకానొక పురుషునికిఁ బైతృక కర్మము చేయువారు కాఁబట్టి వీరిందఱని ముందు పరిగణించితిమి. ఇట్లు చేయు పైతృక కర్మమే కూడి పిండోదక దానము చేయుట యనఁబడును. — కూడిపిండోదక దానము చేయుట.

బంధువులు.

౩౦౮. బంధువులు మూఁడు మెట్టువరుసలవారయి యుందురు. మేనత్తకొడుకులు తల్లితోడఁ బుట్టినదానికొడుకులు మాతుల పుత్రులును దనతోడి సరిమెట్టువారు. తండ్రియొక్క యీ వరుసవారు తండ్రి సరిమెట్టువారు. తల్లి యొక్క యీ వరుసవారు తల్లి సరిమెట్టువారు. వీర లీచెప్పిన చొప్పునఁ బరస్పర సంబంధముగలవారు. (మితాక్షర ౨. ౬)

దాయాధికారము యొక్క యానుపూర్వి.

౩౦౯. ఒక పురుషునియొక్క ద్రవ్యము మీఁద వివరించు ప్రకారాన ముందఱి సమీప సపిండులను బొందును—

పుత్రులు.

పౌత్రులు.

ప్రపౌత్రులు.

భార్య.

దుహితలు.

దౌహిత్రులు.

తల్లి.

తండ్రి.

సోదరులు.

సోదర పుత్రులు

పితామహి.

పితామహుఁడు.

పితామహుని పుత్రులు (అనఁగాఁ బితృవ్యులు)

పితామహుని పౌత్రులు (అనఁగా జ్ఞాతులు)

ప్రపితామహుఁడు.

వాని పుత్రులు.

వాని పౌత్రులు.

ముందు తరమువారయిన తక్కిన సపిండులును వారి పుత్ర పౌత్రులును ముందుచెప్పిన చొప్పుననే దాయార్హులు.

వీరికి వెనుక దూర సపిండులు తమతమ మెట్టు వరుసను దాయాధికారు లగుదురు. ఆ తీరుననే వెనుక సమానోదకులును వారికి వెనుక బంధువులును దాయార్హులగుదురు.

౩౧౦. ముందు చెప్పిన వరుసలోనివారు మూలపురుషుని ద్రవ్యమందు యథాపూర్వముగా స్వత్వము గలవారగుదురుగాని ద్రవ్యము పూర్వ సంక్రాంత మయిన యనంతర మనుక్రమముగా దాయార్హ పరంపరయున్న పక్షమందుఁ గానేరదు. ఇందుల కుదాహరణము. పుత్రాదులు లేనివాని ద్రవ్యము వాని సోదర పుత్రునికి వచ్చి పిమ్మట

వాని పుత్ర పరంపరకు వచ్చునుగాని మొదటివాని పితామహికి రానేరదు. మఱియుఁ బుత్రికకుఁగాని మఱియొక బంధువురాలికిఁగాని వచ్చిన ద్రవ్యము వక్ష్యమాణ విధి ప్రకారము దాని యుత్తరాధి కారులకు వచ్చును.

పుత్రులు. ౩౧౧. తండ్రితో విభక్తులైనను బుత్రులు తండ్రి పరోక్షమందు వాని ద్రవ్యమందు వీరు చేరువ యుత్తరాధికారులు కాబట్టి భాగ స్వత్వము గలవా రగుదురు. (౧. ౧౮౩)

౩౧౨. విభాగానంతరము పుత్రులు పుట్టి రేని వారికే తండ్రి భాగము వచ్చును. (౧. ౧౮౨)

౩౧౩. పుత్రుల కందఱికి భాగము తుల్యము గాని మాతృ సంఖ్యనుబట్టి విభాగమునకు వైషమ్యము కలుగదు. (౧. ౨౦౫) ఈ విధి సర్వ వర్ణముల వారికి సమానము. (స. అ. ౧౮౪౬. అ. నం. ౨౦ లో తీర్పు)

౩౧౪. ఈ కాలము జ్యేష్ఠపుత్రునికి భాగ మధికము లేదు. (౧. ౧౩౩) రాజ్యము పురాతనపు జమీనులును జ్యేష్ఠపుత్రునికి వచ్చును. (స. అ. ౧౮౪౬ అ. నం. ౨౦ లో తీర్పు.)

౩౧౫. పౌత్ర ప్రపౌత్రులును దమ తమ

తండ్రుల భాగానురూపముగా భాగములు పొందు దురు. (౧. ౨౦౭) పౌత్రులు ప్రపౌత్రులు.

౩౧౬. తండ్రిపోయిన పౌత్రుఁడు, తండ్రి తాతలు పోయిన ప్రపౌత్రుఁడును విభాగించుకొను పక్షమందు జీవించియున్న పుత్రునితో విభాగించుకో వలసినది. (౨. ౨౫౩; శ్రీకృష్ణుఁడు)

౩౧౭. విభాగకాలమందుఁ బుత్ర పౌత్ర ప్రపౌత్రులు లేక ప్రపౌత్ర పుత్రుడుండెనేని వీనికి దూరసపిండత వలని స్వత్వము గలదు. దాయము చచ్చిన వాని భార్యకు వచ్చును. ప్రపౌత్రుఁడు జీవితుఁడై దాయము పొందెనేని వాని పుత్రునికే యది చేరును. (౧. ౧౨౫) ప్రపౌత్రుడు.

౩౧౮. ఒకఁడు చిరకాలము పోయినపోకు తెలియక గతించినాఁడని సంభావింపఁబడి వాని సంతతి వారు సహిత మున్న సమాచారము తెలియఁ బడక యుండఁగా వాని యేఁడు తరముల లోపల సంతతి వాఁడెవ్వఁడు గాని వచ్చిన పక్షమందు దాయ హారిత్వము ముందుగా వానికి వచ్చును గాని యా వితంతువునకుఁ గలుగదు. (౧. ౧౨౫, ౧౩౨) ఈ పరంపర యందీ దూరసపిండునకు ముందు వాఁడెవఁ డయినను సమక్షమందు జీవించియుండి దాయము పొందిన పక్షమం దా దాయము వీనికే యను కానఁబడక పోయిన వాని దాయస్వత్వము నివర్తింపదు.

క్రమముగా వచ్చునను సంభావనచేత వీని దాయహారిత్వ మొప్పుకోఁబడియె.

గతించిన పుత్రుని యొక్క భాగము. ౩౧౯. విభాగ యోగ్యకాలమునకు ముందు గతించిన పుత్రునియొక్క భాగము వాని భార్యకు రానేరదు. (౨. ౨౩౧, ౨౩౨ కో, డోరిణ)

భార్యలు. ౩౨౦. ఒక్కని కనేక భార్యలున్న పక్షమందు వాని ద్రవ్యము ముందుగా మొదటి భార్యకు వచ్చుననియు దానికి వెనుకఁ దక్కిన భార్యలకుఁ బెండ్లి వరుస చొప్పున యథాపూర్వముగా వచ్చుననియుఁ దీర్పు చేయఁబడి యున్నది. (౧. ౧౩౬, ౧౩౭; స. అ. ౧౮౨౮ అ. నం. ౫ లో; ౧౮౩౫ అ. నం. ౧ లో తీర్పులు) ఈ తీర్పు ద్రవిడాచారమందు శాస్త్రీయము కాదు కాఁబట్టి భార్యలందఱు భర్తృ ద్రవ్య విభాగమందు సమానస్వత్వము గలవారై యుందురు. (మితాక్షర ౨. ౧. ఈ వచనము కోలు బ్రూక్ దొరగారు భాషాంతరము చేసిన గ్రంథమందు ౫ వ వచనమునకు ౬ వ వచనమునకు నడుమ విడిచిపోయినది; స్మృతిచంద్రిక)

పుత్రికలు. ౩౨౧. పుత్రికలయందు వివాహము లేనివారు ముందు దాయముఁ బొందుదురు. పిమ్మటఁ బుత్ర సంతతి గలవారేని పుత్రులను గనఁదగినవారేని సభర్తృకలును సపుత్రలయిన వితంతువులును

బొందుదురు. ఈ వెనుకటి మూఁడు తరగతులవారు సమాన స్వత్వము గలవారు. (స్మృతిచంద్రిక)

౩౨౨. వీరికి వెనుక వంధ్యలయి సభర్తృకలయిన పుత్రికలును బుత్రులులేని వితంతువులయిన పుత్రికలును దాయము పొందుదురు. వీరును సమాన స్వత్వము గలవారు. (మితాక్షర ౨. ౧౧. ౧౩)

౩౨౩. ఆయా తరగతియందు ధనము కల దానికంటె ముందు ధనము లేనిదానికి దాయము చేరును. (మితాక్షర ౨. ౧౧. ౧౩) ఇంతపాటి ధనము గలదానికి దాయము రానేరదని ధనము యొక్క పరిమితి చెప్పఁబడలేదుగాని తుద కా ధనము సహజముగా జీవనమునకుఁ జాలినంతపాటి యుండ వలసినది.

౩౨౪. ముందుచెప్పిన యాయా తరగతుల యందుఁ బుత్రిక లందఱు సమానముగా భాగ స్వత్వము గలవారు. (స. అ. పం. ౧౮౫౨ మే ౨౦) ఇది తండ్రివలన వచ్చిన దాయాధికారమును సంబంధించినదని తెలియవలసినది. తండ్రి కనేక భార్యలున్న పక్షమందుఁ బుత్రికలు తమ తమ తల్లి భాగముఁ బొందుదురు. (స. అ. పం. ౧౮౫౪ జూలై ౩)

౩౨౫. ఈ దాయ స్వత్వము పుత్రికల

పుత్రికాపు పుత్ర సంతతికి సంక్రమించునుగాని పుత్రికా సంత
త్రికలు. తికిఁ జెందదు. (పెద్ద మెక్నాటన్ ౬)

దౌహిత్రు 326. దుహితలయొక్క పుత్రులు తమ
లు. తమ తల్లులయొక్క భాగము కోలఁదిని భాగించుకో
వలసినవారు (౧. ౧౨౫) గాని పుత్రులు భాగిం
చుకో వలసినవారు గారు.

శూద్రుల 327. శూద్రులయందు దౌహిత్రులు లేని
దాసేరులు. పక్షమందుఁ జేరుగొండిదాని కొడుకులకుఁ జెందును.
(౧. ౧౩౭)

తల్లి. 328. పితృపరంపరయందుఁ దండ్రికి
ముందు తల్లి ద్రవ్యమును బొందును. (స. అ. పం.
౧౮౩౮ డిసెంబరు ౨౪; ౧౮౪౭ మార్చి ౨౬;
౧౮౫౪ ఫిబ్రవరి ౨౭, మార్చి ౨౭)

329. తండ్రి కనేక భార్యలున్న పక్ష
మందు వారిలో సవతి తల్లులకు గతించినవాని
ద్రవ్యము రానేరదు. వాని తల్లికే వచ్చును. (౧.
౧౪౪)

సోదరులు. 330. భ్రాతలయం దేకోదరులు ముందుగా
దాయాధికారము పొందుదురు. వారు లేనిపక్ష
మందు భిన్నోదరులు పొందుదురు. (౧. ౧౪౪)
ఆ యా తరగతియందు విభక్తులకంటె ముం దవి

భక్తులు పొందుదురు. విభక్తుఁడైన యేకోదరుఁడును విభక్తుఁడుగాని భిన్నోదరుఁడును గూడి సమానముగాఁ బొందుదురు. (౨. ౨౫౪; శ్రీకృష్ణుఁడు) ఆ యా తరగతివారు మాత్రు సంఖ్యవలని వైషమ్యము లేక సమానముగాఁ బొందుదురు. (౧. ౨౦౫)

331. తోఁబుట్టువులయిన స్త్రీలు భాగగ్రాహి పరంపరలోనివారు కారు. (౨. ౨౪3, ౨౪౪ కో, సదర్‌లాన్డు) భగినులు.

33౨. సోదర పుత్రులయందు ఏకోదర భ్రాతృ పుత్రులు భిన్నోదర భ్రాతృ పుత్రులకంటె ముందు పొందుదురు. (౧. ౧౪౫) మఱియవిభక్తులు విభక్తులకంటె ముందు పొందుదురు. (౨. ౨౫౪; శ్రీకృష్ణుఁడు) ఆయా తరగతివారు పితృసంఖ్యాను రూపముగా భాగము పొందుదురు. (మితాక్షర ౨. ౪. ౭-౯) సోదరుల పుత్రులు.

333. గతించినవాని ద్రవ్యము జీవితులయిన తన సోదరులకు వచ్చునుగాని యట్లు వచ్చుటకు ముందు గతించిన సోదరులయొక్క పుత్రులకు రానేరదు. (పెద్ద మెక్నాటన్ 3; ఎల్బర్లింజ్ ౭౮)

33౪. సోదర పౌత్రులు సాపిండ్యాయ

సోదర పౌత్రులు. ప్రాహి పరంపరలోని వారుకారు. (ఎల్బర్లింజ్ ౭౮) అయినను వెనుక వీరు దూర సపిండత్వము చేత నగుదురు.

సోదరుల పుత్రికలు. ౩౩౫. సోదరుల పుత్రికలకు దాయము రానేరదు. (౨. ౨౩౯, ౨౮౦; సదర్లాండు)

అవిభక్త కుటుంబములయందు దాయము వచ్చు క్రమము. ౩౩౬. అవిభక్తులయిన సోదరులయొక్క దాయము పొందు వారి పరంపర విభక్తుని దాయము పొందువారి పరంపరకంటెఁ గొన్ని విషయము లందు భిన్నమయి యుండును. ఆయా సోదరునకు రావలసిన భాగము క్రమముగా వాని వాని పుత్ర పౌత్ర ప్రపౌత్రులకు విభక్త ద్రవ్యమట్లు చేరును. వీరు లేనిపక్షమందు వాని భాగము వాని సోదరులకు సమానముగాఁ జేరును. గతించిన సోదరునియొక్క భాగము తన తండ్రికిఁగాని తాతకుఁగాని సంక్రమింపనిది ప్రపౌత్ర పుత్రునికి రానేరదు. సోదరులకు వచ్చిన భాగము వారి సంతతియందుఁ బ్రపౌత్రుని వఱకు వచ్చును. ఆ సంతతివారు లేని పక్షమందు వారిలోఁ గడపట గతించిన వాని యొక్క భార్యకు వచ్చును. ముందు గతించినవారి భార్యలకు భాగము రాదు. అవిభక్తులైన సోదరుల యొక్క పుత్ర పరంపరయందు దూరతములైన యవిభక్త జ్ఞాతుల వఱకు నా భాగము చేరును. వీరందఱు లేనిపక్షమందుఁ గడపట గతిం

చిన వాని భార్యకుఁ జేరవలసినది. అది లేనిపక్షమందు విభక్తులను జెందును.

332. అవిభక్తులైన దూర బంధువులు గతించిన వాని భార్యకంటె ముందు పొందుదురు. (స. అ. పం. ౧౮౭౯ సెప్టంబర్ ౧౭)

33౮. అవిభక్త సోదరులలో ముందొకఁడు గతించెరేని సముదాయ ద్రవ్యము సమస్తము జీవితునికిఁ జేరును గాఁబట్టి యట్టి సోదరులిద్దఱును సంతులేకయుండి వరుసగా గతించిరేని వాని భార్యలలోఁ గడపట గతించినవాని భార్యకే యా ద్రవ్యము వచ్చును. (౨. ౨౩౧, ౨౩౨ కో, డోరిన్)

33౯. అవిభక్తులయిన యిద్దఱు సోదరులలో గతించినవాని పుత్రికకు దాయము రానేరదు. ఆ ద్రవ్యము జీవితుఁడయిన సోదరునికి వచ్చును. వెనుక వాని పుత్ర పరంపరను జెందును. తుదను వాని యొక్క విభక్త పితృవ్య పుత్రులను జెందును. (స. అ. పం. ౧౮౫౩ అక్టోబర్ ౨౪)

3౪౦. ఒక యంశకునియొక్క స్వార్జిత ద్రవ్యము సర్వము స్థావరముగాని జంగమముగాని వాని ప్రపౌత్ర పర్యంతము పుత్ర పరంపరవారికిని జేరును. (స. అ. పం. ౧౮౩౮ జ్యూన్ ౧౫; అంశకుని యొక్క స్వార్జిత ద్రవ్యము.

౧౮౫౦ నవంబర్ ౭) పుత్రసంతతి లేనిపక్షమందు దా ద్రవ్యము వాని యవిభక్త సోదరులను జేరి వారి పరంపరను జేరును. (స. అ. పం. ౧౮౩౭ జనవరి ౧౬)

దత్తకుని ద్రవ్యము. ౩౮౧. దత్తకునియొక్క ద్రవ్యము స్వీకర్త యొక్క కుటుంబ పరంపర వారెవ్వరును లేనిపక్షమందు వాని జనక పితయొక్క కుటుంబములోని బంధువులను వర్గ క్రమానుసారిగాఁ జెందును. (స. అ. పం. ౧౮౫౫ అక్టోబర్ ౯)

స్త్రీలు దాయము పొందుట. ౩౮౨. విభక్త కుటుంబములయందు స్త్రీలు దాయము పొందుదురు. (ఎల్బర్ లింజ్ ౬౮) అవిభక్త కుటుంబములయందుఁ బురుష పరంపర లేని పక్షమందు దాయము పొందుదురు.

స్త్రీధనము సంక్రమించుట. ౩౮౩. స్త్రీ కేవిధమునఁగాని వచ్చిన ద్రవ్యము ముందుగాఁ దన పుత్రికలను జెందును. అందు వివాహితలకంటె ముందు వివాహము లేనివారికిని ధనము గలవారికంటె ముందు ధనము లేనివారికిని జెందును. పిమ్మట దాని పుత్రికా పుత్రికలకును; దౌహిత్రులకును; పుత్రులకును; పౌత్రులకును; (౧. ౫౧; మితాక్షర ౨. ౧౧. ౯. ౧౩) పుత్రులు లేని వారికంటె ముందు పుత్రవతులకును బుత్రవతులు కాఁగలవారికిని జెందును. (స్మృతి చంద్రిక) వీరు

లేనిపక్షమందు బ్రాహ్మ దైవార్ష ప్రాజాపత్య
గాంధర్వము లను వివాహములలో నొక వివా
హము జరిగిన స్త్రీ యొక్క ధనము (మనువు ౯.
౧౯౬; స్మృతి చంద్రిక; వ్యవహార మయూఖము)
భర్తను వాని సంతతివారికిని వరుసగా వచ్చును.
నిషిద్ధములైన యాసుర రాక్షస పైశాచములల
యం దొక్క వివాహము జరిగిన స్త్రీ యొక్క
ధనము దాని తల్లిదండ్రులను వారి సంతతివారిని
జెందును. (౧. ౫౧; మితాక్షర ౨. ౧౧. ౧౧)

౩౪౪. పుత్రికా పుత్రికలు మాత్ర పుత్రికా
సంఖ్యానురూపముగా దాయాంశము పొందుదురు. పుత్రికలు.
(మితాక్షర ౨. ౧౧. ౧౬)

౩౪౫. వివాహకాలమందు గృహోపకరణ పారితోషి
ములు పశువులు మొదలగువానిని గొనుటకయి కము.
వరుఁడు భార్యకిచ్చిన పారితోషిక ద్రవ్యము (స్మృతి
చంద్రిక; వ్యవహార మయూఖము) మాత్రము దాని
సోదరులకుఁ జేరును. (౧. ౫౧. ౨౫౦)

౩౪౬. కన్య గతించెనేని దానిని వివాహము కన్యక
చేసికొన నిశ్చయించిన వరుఁడు దాని పైఁడి ముడు ధనము.
పుకై యిచ్చిన ద్రవ్యమేదిగాని వానికి మరలింప
వలసినది. ఉభయ పక్షములవారి సెలవులు దాని
యందుఁ ద్రోపుడు పెట్టవలసినది. దానికి బంధువులు

ప్రత్యేకముగా నిచ్చిన పారితోషికములు దాని సోదరులకుఁ జేరును. పిమ్మటఁ దల్లిదండ్రులకుఁ జేరును. దానియొక్క తక్కిన ద్రవ్యము మొదట వివాహము లేని యవిభక్త భగినులకుఁ జేరును. వారు లేనిపక్షమందు దాని సోదరులు మొదలైన వారిని బొందును. (మితాక్షర ౨, ౧౧, ౧౨, ౩౦)

బంధువులు లేనిపక్షమందు దాయము వచ్చు క్రమము.

౩౭౭. బంధువు లెవ్వరును లేనిపక్షమందు బురుషుని ద్రవ్యము వాని యుపాధ్యాయునికిఁగాని శిష్యునికిఁగాని సతీర్థ్యునికిఁగాని వరుసగాఁ జేరును. ఆ ద్రవ్యము బ్రాహ్మణులయందు శ్రోత్రియుఁడైన గురువునకెవ్వనికిఁగాని చేరును. వాఁడు లేనిపక్షమందు సద్బ్రాహ్మణునికిఁ జేరును. దొరతనము వారికిఁ జేరదు. ఇతర వర్ణములయందు ద్రవ్యము సతీర్థ్యుఁడు లేని పక్షమందు దొరతనము వారికిఁ జేరును. (మితాక్షర ౨, ౭) బ్రాహ్మణికాని స్త్రీకి బంధువులు లేని పక్షమందు దాని ద్రవ్యము దొరతనము వారికిఁ జేరును. బంధువులు లేని బ్రాహ్మణియొక్క ద్రవ్యము బ్రాహ్మణులకుఁ జేరును.

విరక్తులయొక్క ద్రవ్యము.

౩౭౮. లోకబంధములు వదలిన విరక్తుల ద్రవ్యము వారి యాత్మసంబంధులైన తోడివారికిఁ జేరును. బ్రహ్మచారియొక్క ద్రవ్యము వాని యుపాధ్యాయునకుఁ జేరును. సన్న్యాసియొక్క

ద్రవ్యము గుణశాలి యయిన వాని శిష్యునకుఁ జేరును. వానప్రస్థుని ద్రవ్యము వానప్రస్థాశ్రమము పొందఁగలవాఁడైన వానితోడి వానికిఁ జేరును. తుదకెవరికిఁగాని సమాశ్రమము గలవానికిఁ జేరును. బంధువులకుఁ జేరనేరదు. (మితాక్షర. ౨. ౮. ౧-౬)

౩౮౯. వేశ్యయొక్క ద్రవ్యము దాని పుత్రికా పరంపర వారికిఁ జేరును. వారు లేని పక్షమందుఁ గులస్త్రీ ధనమువలె దాని పుత్రసంతతి వారికిఁ జేరును. వేశ్యల యొక్క-

౩౯౦. సంతులేని వేశ్యలయొక్క ద్రవ్యము వారు సేవించు గుడికిఁ జేరును. (స. అ. పం. ౧౮౯౩ సెప్టంబర్ ౧౨)

౩౯౧. చేరుగొండి బాంధవ్యము పోఁగొట్టుకొన్నది కాఁబట్టి దాని ద్రవ్యము కులమునందుఁ బుట్టిన బిడ్డలు మొదలయిన వారి కెవ్వరికిఁ గాని చేరదు. (స. అ. ప్రా. ౧౮౮౮ నవంబర్ ౧౧; స. డి. అ. ౭. ౨౭౩) వెనుకఁ బుట్టిన సంతతి వారికిఁ జేరును. చేరుగొండ్ల యొక్క-

# ౧౨. ప్రకరణము

## బంగాళశాస్త్ర సంప్రదాయము.

బంగాళ కాశీశాస్త్ర సంప్రదాయభేదము.

౩౫౨. బంగాళదేశమం దాచరించుచున్న శాస్త్ర సంప్రదాయమునకును ద్రవిడాది సంప్రదాయములతోఁ డిదియయిన కాశీ శాస్త్ర సంప్రదాయమునకు గల ముఖ్య భేదములు క్రింద వివరింపఁబడును.

పుత్రస్వీకారము సంబంధ వితంతువునకనుజ్ఞ.

౩౫౩. వితంతువునకుఁ బుత్రస్వీకారము చేయుటయందు భర్త యనుజ్ఞలేక బంధువుల యొక్క యనుజ్ఞ మాత్రము చెల్లదు. (దత్తక మీమాంస ౧. ౧౮) ఇది వ్యవహార మయూఖములో ౪. ౫. ౧౭ నకు విరుద్ధము. (౨. ౯౨ కో) శ్రీరామపండితుల దత్తక మీమాంసకు విరుద్ధము.

స్థావరద్రవ్యమందుఁ దండ్రి యొక్క యధికారము.

౩౫౪. పైతృకమైన స్థావర ద్రవ్యమందు నల్పాంశము తండ్రి తన యిచ్ఛకు వచ్చినట్టు వినియోగింప వచ్చును. (దాయభాగమందు ౨. ౨౪) ఇది మితాక్షర ౧. ౫. ౯, ౧౦. లో పుత్రులయనుమతి లేక యేమాత్రముగాని వినియోగింపఁగూడదని ప్రతిషేధింపఁబడినది.

౩౫౫. శాస్త్ర నిషిద్ధమైనను ద్రవ్య వినియోగము మించి కడచిపోయినది ప్రతిషేధింపఁ

బడదు. చేసిన పని నూఱు ప్రతిషేధముల చేత నయినను పాలింపఁబడెదు గదా. (దాయభాగము ౨. ౩౦) ఈ సిద్ధాంతము కాశీ సంప్రదాయమందు సమ్మతము గాదు. (౧. ౨౩. ౨౮; స్మృతిచంద్రిక) ఆశాస్త్రీయములైన వినియోగములు.

౩౪౬. తండ్రి జీవించియుండువఱకు వాని యొక్క పైతృక ద్రవ్యమందుఁగాని యితరమందు గాని పుత్రునకు స్వత్వము లేదు. (దాయభాగము ౧. ౩౦; ౨. ౯, ౧౧) ఇది మితాక్షరయందు ౧. ౧. ౩౨౩, ౨౭ కు విరుద్ధము. తండ్రి ద్రవ్యమందుఁ బుత్రులస్వత్వము.

౩౪౭. తమకు స్వత్వము లేదు గాఁబట్టి పుత్రులు తండ్రులను వారి పైతృక ద్రవ్యమునకు సహితము విభాగముకై బలాత్కరింపఁగూడదు. ఈ కార్యము తండ్రి యొక్క యిచ్ఛాధీనము. (దాయభాగము ౧. ౩౮; ౨. ౨౦) ఇది మితాక్షరయందు ౧. ౨. ౭నకు విరుద్ధము. (౧. ౧౭౯) పుత్రుఁడు విభాగమునకై తండ్రిని బలాత్కరించు నధికారము.

౩౪౮. పైతృకద్రవ్యము తండ్రి పుత్రులతో భాగించుకొన్నపుడు వానికి రెండు భాగములు రావలసినది. (దాయభాగము ౨. ౨౦) ఇది మితాక్షరయందు ౧. ౪. ౪లోఁ బితాపుత్రులకు సరిభాగములని చెప్పి ప్రతిషేధింపఁబడియున్నది. తండ్రి యొక్క భాగము.

౩౪౯. తండ్రి కొడుకులకు భాగము తీరిన వెనుకఁ బుట్టిన పుత్రునకు సోదరుల యొక్క భాగములయందు భాగము రావలసినది. (దాయ విభాగమునకు వెనుకఁ బుట్టిన

పుత్రుని భాగము.

భాగమందు ౭. ౧౦-౧౨) ఇది మితాక్షరయందు ౧. ౬. ౨ లో ఆ భాగము తండ్రి భాగమున రావలసినదని చెప్పిన పఙ్క్తులకు విరుద్ధము.

పాలివాఁడు ద్రవ్యము దాఁచుట.

౩౬౦. విభాజ్యమైన ద్రవ్యమొక యంశకుఁడు దాఁచుటచేత వానికి దాయాంశమునందు స్వత్వము పోనేరదు. (దాయభాగము ౧౩. ౨) ఇది మితాక్షర ౧. ౯. ౪, ౫ కు విరుద్ధము.

వంధ్యలైన పుత్రికలకుఁ బుత్రహీనలయి వితంతువులైన పుత్రికలకును.

౩౬౧. వంధ్యలైన పుత్రికలకును బుత్రహీనలై వితంతువులైన పుత్రికలకును దండ్రియొక్క ద్రవ్యమందు స్వత్వము లేదు. (దాయభాగము ౧౧. ౨. ౩) ఇది మితాక్షర ౨. ౨ లోను ౨. ౯. ౧౩ లోను బ్రతిషేధింపఁబడినది.

తల్లికిముందు తండ్రికి స్వత్వము.

౩౬౨. ఆరోహణ క్రమమందుఁ దల్లికంటె ముందు తండ్రిది స్వత్వము. అవ్వకంటె ముందు స్వత్వము తాతది. (దాయభాగమందు ౧౧. ౪. ౩, ౪) ఇది మితాక్షర ౨. ౩. ౫ లో సాక్షాద్విరుద్ధమయిన వచనము చెప్పి ప్రతిషేధింపఁబడినది.

సోదరుల పౌత్రులు.

౩౬౩. సోదరుల పౌత్రు లుత్తరాధికారులలోఁ జేరినవారు. (దాయభాగము ౧౧. ౬. ౬) ఇది మితాక్షర ౨. ౫. ౧ యందు వారుత్తరాధికారులు కారని ప్రతిషేధింపఁబడిరి.

భాగినేయులు.

౩౬౪. భాగినేయులు సహితము త్తరాధికారి పఙ్క్తిలోని వారు. (దాయభాగము ౧౧. ౬. ౮, ౯)

ఇది మితాక్షరకు విరుద్ధము. (౧. ౧౪౭) దీనియం దుత్తరాధికారుల పఙ్క్తిలో పీకెని గానము.

౩౬౫. తన పాలి వారితో భాగించుకొనికాని భాగించుకోక కాని పుత్రహీనుఁడై గతించిన వాని యొక్క ద్రవ్యము వాని భార్యకుఁ జేరును. (దాయ భాగము ౧౧. ౧. ౪౬) ఇది మితాక్షరయందు ౨. ౧. ౩౦ కి విరుద్ధము. దీనియందు విభక్తుఁడై గతించిన వాని ద్రవ్యమే వాని భార్యకుఁ జేరునని చెప్పఁబడి యున్నది. (౧. ౧౨౧) గతించిన యవిభక్తుని యొ క్క భార్య.

౩౬౬. స్త్రీ యొక్క ద్రవ్యమార్జన నిమిత్త భేదమువలన ద్వివిధము. అందొక విధమందు స్త్రీకి మాత్రము స్వత్వము గలదు. రెండవ విధమందు భర్తకు స్వత్వము. భర్తగాని బంధువులుగాని స్త్రీకి వివాహమందుఁగాని దానికి ముందు వెనుకగాని యిచ్చిన ద్రవ్యమును భర్త క్రొత్త పెండ్లి చేసికొనునప్పుడు పారితోషికముగా స్త్రీకిచ్చిన ద్రవ్యమును ప్రథమ విధము. ఇదియే స్త్రీధన మనఁబడును. స్త్రీ యొక్క తక్కిన ద్రవ్యము బాంధవేతరులిచ్చినదిగాని కష్టార్జితముగాని దాయప్రాప్తముగాని ద్వితీయ విధము. ఇది స్త్రీధనమని చెప్పఁబడదు. (దాయభాగము ౪. ౧. ౧౩, ౧౫, ౧౮-౨౧) ఇది మితాక్షరయందు ౨. ౧౧. ౨, ౩ నకు విరుద్ధము. దీనియందు స్త్రీ యొక్క ద్రవ్య మే విధముచేత వచ్చినదిగాని స్త్రీధనమని చెప్పఁబడినది. స్త్రీధనము.

౩౬౭. వివాహమందు భర్తవలన వచ్చినదియని యితరుల వలన వచ్చినదియని స్త్రీధనము మరల ద్వివిధము. మొదటిది యౌతక మనఁబడును. అయౌతకమని రెండవది చెప్పఁబడును. (దాయ భాగము ౪. ౨. ౧౩-౧౪) ఈ భేదము మితాక్షర యందుఁ గానము.

౩౬౮. స్త్రీ యొక్క యౌతక ద్రవ్యము పుత్రికలకుఁ జేరును. అందు మొదట వివాహము లేనిదానికిని వెనుక నిశ్చితార్థమైన దానికిని గడపట వివాహమైనదానికిని జేరును. పుత్రికలు లేని పక్షమందుఁ బుత్రులకుఁ జేరును. (దాయభాగము ౪. ౨. ౧౩, ౨౩, ౨౪) స్త్రీ యొక్క తక్కిన ద్రవ్యము దాని పుత్రులకును నిశ్చితార్థముగాని కన్యలైన పుత్రికలకును సమముగాఁ జేరును. వీరియం దొక్కరు లేని పక్షమందు మఱియొకరినిఁ జెందును. వారు లేనిపక్షమందుఁ బుత్రవతియయిన వివాహితకుఁగాని పుత్రవతి కాఁగలదానికిఁగాని చెందును. పిమ్మట దాని పుత్ర పుత్రునికిఁ జేరును. పిమ్మట దాని పుత్రికా పుత్రునకుఁ జేరును. పిమ్మట వంధ్యలయిన పుత్రికలకును వితంతువులైన పుత్రికలకును జేరును. (దాయభాగము ౪. ౨. ౯, ౧౧, ౧౨) భర్తయొక్క ద్రవ్యము స్త్రీకి వచ్చిన పక్షమం దా ద్రవ్యము పిమ్మట వాని యుత్తరాధికారులను జెందును. అందు ముందు పుత్రికలను జెందును.

ఈ ద్రవ్యము దాని స్వద్రవ్యము పొందు దాయాదులను జెందదు. (దాయభాగము ౧౧. ౧. ౫౬, ౫౭) ఇది మితాక్షరయందు ౨. ౧౧. ౯, ౧౩వను విరుద్ధము. ఏ విధముచేత వచ్చినదిగాని స్త్రీ ధనము పుత్రికలను జెందునని యందు వివాహితకంటె ముందు వివాహము లేనిదానిని ధనము కలదానికంటె ముందు ధనము లేనిదానిని జెందునని వీరు లేనిపక్షమందుఁ బుత్రికా పుత్రికలకుఁ బుత్రికా పుత్రులకును జేరునని వీరు లేనిపక్షమందుఁ బుత్రులకును బౌత్రులకును జేరుననియు మితాక్షరయందుఁ జెప్పబడినదిగాని ముందు చెప్పిన భేదము కానము.

బంధువులు లేని పక్షమందు ద్రవ్య సంక్రాంతి

౩౬౯. సతీర్థ్యుఁడు లేనిపక్షమందు ద్రవ్యము సగోత్రునకుఁ జేరును. వాఁడు లేనిపక్షమందు సమాన ప్రవరునకుఁ జేరును. వాఁడు లేనిపక్షమందు గురువులకు సమాన గ్రామవాసులైన బ్రాహ్మణులకును జేరును. వారు లేనిపక్షమందు బ్రాహ్మణేతరుల ద్రవ్యము రాజును జెందును. (దాయభాగము ౧౧. ౬. ౨౫—౨౭) ఇది సతీర్థ్యుఁడు లేని పక్షమందు బ్రాహ్మణ ద్రవ్యము బ్రాహ్మణులకే చేరునని యితర వర్ణములవారి ద్రవ్యము రాజును జేరునని చెప్పిన మితాక్షరయందు ౨. ౭. ౩౬ నవ విరుద్ధము.

# ౧౩. ప్రకరణము

## మళయాళ దేశ శాస్త్రము

స్త్రీ పరంపరకు దాయాధికారము.

౩౨౦. మళయాళ దేశపు జనులయందు దాయాద పరంపరకుఁ గన్న రాదేశముదప్ప నీ రాజధాని క్రింది యితర దేశములకంటె భిన్నముగా నియమ మేర్పడియున్నది. దాయాధికారము స్త్రీ పరంపరవారిదిగాని పురుష పరంపరవారిదిగాదు. ఒక పురుషుని పుత్రులుత్తరాధికార పరంపరలోనివారు గారు. పురుషుని ద్రవ్యము వాని భగినులకును భాగినేయులకును భగినీ పుత్రికలకును భగినీ పుత్రికల కొడుకు గూఁతులకును దల్లికినిఁ దల్లి భగినులకును వారి బిడ్డలకును మఱియు వానియొక్క మాతామహికిని దాని భగినులకును వారి బిడ్డలకును జేరును. ఇట్టి దాయాద పరంపర లేని పక్షమం దీ రాజధాని క్రింది తక్కిన దేశములవలెఁ బురుషునియొక్క శిష్యునకును సతీర్థ్యునికిని రాజునకును వరుసగాఁ జేరును.

ఈ నియమమునకు మూలము.

౩౨౧. మళయాళ దేశమునకు మొదటి రాజయిన పరశురాముఁ డా దేశమందు బ్రాహ్మణులను జేర్చి వారికి వృత్తులేర్పఱిచి యవి విభక్తములై చెడకుండునట్లు జ్యేష్ఠపుత్రులే యావృత్తులు

పొందవలసినవారనియు వారుమాత్రము వివాహము చేసికోవలసినవారనియు నియమ మేర్పఱిచినాఁడని చెప్పుదురు. వీరియొక్క పుత్రులు కుటుంబము వారందఱికి సంతతివారుగా గణింపఁ బడుదురు. తమ్ములు భార్యాహీనులు కాఁబట్టి వారికిఁ దక్కువ జాతి స్త్రీలతో సంసర్గ మనుజ్ఞాతమైయున్నది. ఇట్లు సంసర్గముచేతఁ గలిగిన సంతతివారు వివాహితునకుఁ బుట్టినవారు కారు కాబట్టి వీరికి బ్రాహ్మణ్యమును దండ్రి దాయము పొందు నధికారమును లేకపోయి నవి. ఇందుచేతనే వీరికి మాతృదాయమే వచ్చును. తక్కువ జాతులవారు తమలోఁ దా మిట్టి సంకీర్ణ సంసర్గ నియమమునకే లోపడిరి. వీరిలో సమర్తాడని స్త్రీల కొక విధమైన వివాహము కలదుగాని వరునికి నియతముగా భర్తృత్వాధికారము లేదు. సమ ర్తాడిన యనంతర మా స్త్రీలు తమ కిచ్చ వచ్చిన వారెందఱితోఁగాని సంసర్గింపవచ్చును. ఇట్టి సంస ర్గము సవర్ణులతోఁగాని యుత్తమవర్ణులతోఁగాని చేయవలసినది. ఇట్టి సంసర్గముచేతఁ గలిగిన సంతతి వారికిఁ దండ్రి యీ జాతివాఁడని యేర్పడకయుండుట వలనఁ దల్లులయొక్క దాయమందే సంబంధము గలిగియుండును.

౩౭౨. మరుమక్క దాయ నియమమును ఆ నియా సకల వర్ణములవా రాచరించెదరు. బ్రాహ్మణుల మా మున కు

లోపడిన జాతులు. కును గుడియూడిగములయిన యహాప్పాదువాళుల కును వడ్ల, కంచర, కమ్మర, కంసాల వాండ్రకును, చరుమలు, మలయరు, పాణరు మొదలైన యిట్టి కొన్ని తక్కువ జాతులవారికిని మాత్రమానియమము లేదు. వీరు పురుషపరంపరయందు దాయస్వత్వము గలవారు. ఉత్తర మళయాళమందలి తీయరను పర్యాయనామముగల యీండ్రలును ముక్కువలను పర్యాయ నామముగల బెస్తలును మరుమక్క దాయము గలవారు. అక్కడి దక్షిణ ప్రాంతము వారు మక్కదాయ నియమము గలవారు. మక్క దాయ మనఁగా బురుష పరంపరయందు దాయ స్వత్వము. ఉత్తర మళయాళమందు బహుతరముగా మాప్లా జాతివారందఱు తురకలయ్యును మరుమక్క దాయ నియమ మాచరించెదరు. ఈ యాచారము హిందువుల యేలుబడి కాలమందు వీరికిఁ గలిగినది.

కుటుంబముల సంఘము. 323. ఈ మరుమక్కదాయ మాచరించు కుటుంబము లనేకములు చేరి యేక కుటుంబమై యుండును. ఈ కుటుంబము తర్వాడీ యనఁబడును. దూరస్థుఁడు సహితము కుటుంబ జ్యేష్ఠునకు లోపడి తత్కుటుంబము వారితోఁగూడి కర్మానుష్ఠానము చేయువాఁ డాకుటుంబములోని వాఁడని యెంచఁ బడును. ఏ వంశ శాఖవాఁడు గాని వయసు చెల్లిన వాఁడు కుటుంబ జ్యేష్ఠుఁడు. వీఁడు కారనవనని

చెప్పఁబడును. కుటుంబములోని తక్కినవా రనంతరవరులనఁబడుదురు.

౩౨౭. గతించిన కారనవనుని యొక్క యధికారము వాని తరవాడీవారి బంధువులలో వయసు చెల్లిన వానికి వచ్చునుగాని సమీప బంధువులకు రాదు. దీని కుదాహరణము. తల్లి యొక్క భాగినేయునికంటె జ్యేష్ఠుఁడయిన తల్లి యొక్క భగినీ దౌహిత్రునకు ముందు దాయాధికారము వచ్చును. (కల్లికోట సబ్ కోర్టు ౧౮౭౩ అ. నం. ౩౬ లో తీర్పు) తన భాగినేయుఁడు తల్లి భాగినేయునికంటె సమీప బంధువయినను వానికి రా నేరదు.

కారనవను నియధికార స్వత్వము.

౩౨౯. కుటుంబ జ్యేష్ఠునకుఁ గుటుంబ కార్యములయందును గుటుంబ ద్రవ్యమందును సర్వాధికారము కలదు. అందఱి మేలుకొఱకు వాఁడు కార్యము చూడవలసినది. కుటుంబములో నెవ్వఁడైనను దన భాగముకై వివాదపడి భాగ మిమ్మని బలాత్కరించుటచేతఁగాని తానప్పుపడియా యప్పుద్రవ్యము మీఁదఁ జాటుటచేతఁగాని కుటుంబము యొక్క కూడిక చెడనేరదు. (స. అ. ౧౮౫౭ అ. నం. ౪౮ లో తీర్పు; మళయాళము జి. కో. ౧౮౭౪ స్పెషల్ అ. నం. ౧ లో తీర్పు; కల్లికోట సి. కో. ౧౮౭౮ అ. నం. ౩౬ లో తీర్పు; స. అ. ప్రో ౧౮౯౭ ఫిబ్రవరి ౧౩)

భాగమడుగఁగూడను.

సమ్మతిచేత విభాగము గలుగ వచ్చును.

౩౨౯. ధర్మస్థానమందు వ్యవహారము తెచ్చుటచేతనైనను ఋణమిచ్చినవాఁడు తగవు తెచ్చుటచేతనైనను విభాగము కలుగనేరదుగాని కుటుంబములోని వారు పరస్పర సమ్మతిచేత విభాగము చేసికోవచ్చును. ఆ విభాగము ధర్మస్థానము వారొప్పుకొందురు. అట్టి విభాగ విషయమందొకనికి హాని ప్రాప్తించు పక్షమందు ధర్మస్థానము వారు దానిని నిస్సందేహముగా మానుపుదురు.

విభాగము నకుఁ గారణము.

౩౨౭. అట్టి విభాగము తావళీలను కుటుంబ శాఖల కనురూపముగాఁ గుటుంబకూటస్థుని భగినుల యొక్క సంఖ్యానురూపముగా మొదట విభాగ మేర్పడవలసినది. వీరికి వచ్చిన విభాగము కుటుంబ శాఖలవారికి వచ్చి పిమ్మట వారి సంతతి వారికే వచ్చును.

కారనవను యొక్క వినియోగాధికారము.

౩౨౮. కారనవను తన పూర్వులదిగాని స్వార్జితముగాని జంగమ ద్రవ్యము తన యుక్తానుసారముగా వినియోగింపవచ్చును. పూర్వార్జితముగాని స్వార్జితముగాని స్థావరద్రవ్యము వినియోగించు పక్షమం దనంతరవరులలో ముఖ్యులయిన వారి యొక్క లిఖిత పురస్సరమయిన సమ్మతి కావలసినది. (వ. ఖం. ప్రా. కో. ౧౮౬౯ అ. నం. ౨౭లో తీర్పు; మళయాళము జి. కో. ౧౮౭౦ స్పెషల్ అ. నం.

౨౯ లో తీర్పు; స. అ. ౧౮౭౫ అ. నం. ౫ లో తీర్పు)

౩౭౯. కారనవనుతో విరోధించిన యొక యనంతరవను యొక్క సమ్మతిలేమి కారనవను చేయు స్థావర ద్రవ్య వినియోగమునకుఁ బ్రతిబంధకము గానేరదు. ఇట్టి వినియోగమున కనంతరవరుల సమ్మతి కావలెనని ముందు చెప్పిన విధి వాక్యమందుఁ గుటుంబమం దనుకూలించి కూడియున్న యనంతర వరుల సమ్మతి కావలసినదని తాత్పర్యము. (మళయాళము జి. కో. ౧౮౭౦ స్పెషల్ అ. నం. ౨౯ లో తీర్పు)

౩౮౦. అనంతవరుల యనుమతి లేకయే కుటుంబ కార్యముకై సొమ్ము తాకట్టుపెట్టి కారనవను ఋణము తీయవచ్చును. బొత్తిగా సొమ్ము వినియోగించు విషయమం దనంతరవరుల సమ్మతి కావలసినది. (స. అ. ౧౮౭౫ అ. నం. లో తీర్పు) అప్పుచేయుటకు—

౩౮౧. కారనవను వ్రాసియిచ్చు పత్రముల చెల్లుబడికయి యనంతవరుల చేవ్రాలు కావలెనని యక్కఱలేదు. (స. అ. ౧౮౭౬ అ. నం. ౭౧ లో తీర్పు; ౧౮౫౨ అ. నం. ౩౮ లో

౩౮౨. కారనవనుగాని వాని యనుమతి చేతఁ గార్యములు చూచు కుటుంబములోనివాఁడు గాని కుటుంబమునకుఁ గావలసి చేసిన ఋణములకుఁ కుటుంబద్రవ్య మీఁద గుట.

కుటుంబ ద్రవ్యమీఁదవును. కుటుంబములోనివాఁడు ప్రత్యేకముగాఁ జేసికొన్న ఋణమునకుఁ గుటుంబ ద్రవ్యమీఁదుగాదు. (కల్లికోట సి. కో. ౧౮౪౮ అ. నం. ౩౬ లో తీర్పు; స. అ. ౧౮౫౨ అ. నం. ౩౮ లో తీర్పు; ౧౮౫౪ అ. నం. ౪౮, ౪౯ లో తీర్పులు)

౩౮౩. కుటుంబ జ్యేష్ఠుఁడు స్వకార్యముకయి చేసికొన్న ఋణమునకుఁ గుటుంబ ద్రవ్యమీఁదుగాదు. (స. అ. ౧౮౪౪ అ. నం. ౩౭ లో తీర్పు)

౩౮౪. కుటుంబమందు వాఁడువాఁడు ప్రత్యేకముగాఁ జేసికొన్న ఋణములకుఁ గుటుంబ ద్రవ్యములోని తమ తమ యంశ మీఁదుగాదు. (స. అ. ప్రో. ౧౮౫౦ ఆగస్టు ౫)

౩౮౫. కారనవను తీసిన ఋణము కుటుంబ కార్యమునకుఁ గాదని ఋజువుగాని పక్షమందా ద్రవ్యము కుటుంబ కార్యముకై తీసినదని యెంచవలసినది. అనంతరవను తీసిన ఋణము స్వకార్యముకై చేసినదేయని యెంచవలసినది. స్వకార్యమునకుఁ దీసినది కాదని ఋజువయిన పక్షమందు దానికిఁ గుటుంబ ద్రవ్యమీఁదగును.

కారనవను వారింపఁబడుట.

౩౮౬. యోగ్యుఁడుకాని కారనవను వారింపబడవచ్చును. (కల్లికోట సి. కో. ౧౮౪౮ అ. నం.

3౬ లో తీర్పు) కారనవను యోగ్యుఁడు కాఁడను టకు జాతి భ్రంశము వార్ధకము చెవిటితనము గుడ్డి తనము మూఁగతనము వెఱ్ఱితనము నీచవర్తనము కుటుంబ ద్రవ్యము చెఱచుటయు నిమిత్తములు. కారనవనుస్వకుటుంబమువారిచేతఁగాని ధర్మస్థానము వారిచేతఁగాని వారింపఁబడినప్పుడు వయసుచేత వానికి రెండవ వాఁడై యోగ్యుఁడైనవానికి వాని యధికారము వచ్చును.

3౮౭. కుటుంబ ద్రవ్య సాహాయ్యము లేక స్వప్రయత్నముచేత సంపాదించిన జంగమ ద్రవ్యము సంపాదించినవానికే చేఁ వాని యిష్టవినియోగమున కర్హమై యుండును. పురుషులవలెనే స్త్రీలు సహితము స్వార్జిత ద్రవ్యము పొందవచ్చును. పురుషుల స్వార్జిత ద్రవ్యము తమకు వెనుకఁ దమ భాగినేయులకుగాని సమీపస్థులయిన యనంతరవరు లకుఁగాని చేరును. (కల్లికోట సబ్ కోర్టు ౧౮౫౭ అ. నం. 3౨౦ లో తీర్పు) స్త్రీలయొక్క స్వార్జి తము తమ పుత్రులకుఁ బుత్రికలకుఁ జేరును. స్వార్జితద్రవ్యము.

3౮౮. ఇతర దేశములలోని స్త్రీలవలె వీరికి వైధవ్యదశ లేదు. స్త్రీలు పురుషులతో సంసర్గము కలిగికాని లేకకాని తమ కుటుంబము నందే వసించెదరు. వైధవ్యదశ.

స్త్రీలు సముదాయ ద్రవ్య ముంచుకొని కుటుంబము నిర్వహించుట.

౩౮౯. శాస్త్రము చొప్పున స్త్రీలకే ద్రవ్యము చేరవలసినది. పురుషులు కుటుంబ కార్యములు నడపుకొని తమ జీవనాంశ మడుగుకొనుట కధికారముగలవారు. పురుషులకు స్త్రీలతో సరి పాలాచారమందుఁ గలిగియున్నది. పురుషులు లేని పక్షమందు స్త్రీలు సముదాయ ద్రవ్యముంచుకొని కుటుంబకార్యములు నడపెదరు. కొన్ని కుటుంబము లందుఁ గుటుంబ విచారణ స్త్రీలకుఁగాని పురుషులకు లేదు. ఈ విషయమునందుఁ గుటుంబ జ్యేష్ఠురాలి కాయధికారము.

భరణము.

౩౯౦. కుటుంబములోని దూరస్థులు మొదలయిన యెల్లవారును భరణమునకుఁ బాత్రులయి యుందురు.

అపత్యస్వీకారము.

౩౯౧. తోడఁబుట్టిన దానికిఁ బుత్రసంతతి గాని పుత్రికాసంతతిగాని లేని పక్షమందుఁ గుటుంబ మందు జ్యేష్ఠురాలుగాని జ్యేష్ఠుఁడుగాని స్వీకారము చేయవచ్చును. పారంపర్యస్వత్వము స్త్రీ పరంపరది కాఁబట్టి పుత్రికా స్వీకారము చేయవలసినది. ఇట్లు స్వీకృతురాలికిఁ గలుగఁగల పుత్రులకుఁ గుటుంబ విచారణాధికారము వచ్చునప్పటికి బాల్యదశయుండ వచ్చునను సంభావనచేత భావికాలమందుఁ గుటుంబ కార్యములు నిర్వహించుటకును గర్మములు నడుపు

టకును స్వీకృతురాలితోఁడనే వాని సోదరుని సహితము స్వీకరింపవచ్చును.

౩౯౨. మరుమక్కదాయవిధికి సమానమైన యళియసంతానమను విధి కనరా దేశమం దేర్పడియున్నది. మళయాళదేశమందు మరుమక్కదాయ విధివలెనే కనరా దేశమం దళియసంతాన విధి సహితము బ్రాహ్మణులాచరింపరు. అళియసంతాన విధి యొక్క వివరణము మరుమక్కదాయ విధి వివరణమునకు సమానము. దాయభాగస్వత్వము పురుషులకంటె స్త్రీలకు వచ్చుట శ్లాఘ్యమను విధి కనరా దేశమందుఁ దప్పక యాచరింపఁబడును. ఈ దేశమందుఁ గుటుంబద్రవ్య విచారణాధికారము సాధారణముగా స్త్రీలకుఁ గలిగియున్నది. మళయాళ దేశమం దాయధికారము పురుషులకు సాధారణముగాఁ గలిగియున్నది.

కనరాదేశమం దళియసంతానవిధి యొక్క చెల్లుబడి.

## ౧౪ ప్రకరణము

### క్రయవిక్రయాది వ్యవహారము.

ధర్మశాస్త్ర మందలి క్రయ విక్ర యాది వ్యవ హారమాద రింపవలసి నది.

౩౯౩. తాము స్థాపించిన ధర్మస్థానముల వారు ధర్మశాస్త్రానుసారిగా హిందువులయొక్కయీ యీ కార్యములు నడపవలసినదని ఈస్టిండియాకంపిని వారు బహు విషయములు నిరూపించిరిగాని క్రయ విక్రయాది వ్యవహారము చెప్పినవారు గారు. (౧౮౦౨. ౩ రిగ్యులేషన్ ౧౬ ప్రకరణము ౧ కలము) జను లొకరితో నొకరు చేయు వ్యాపారములు సహజ ముగాఁ గ్రయవిక్రయాది వ్యవహార శాస్త్రాంశము నకు లోపడియుండుటఁ బట్టియు సుప్రీంకోర్టువారీ విషయము పాటింపవలసినదని విధి యుండుటఁ బట్టియు దానియందు ధర్మసూక్ష్మమునకు విరుద్ధ ములుకాని యంశములను ధర్మస్థానములవా రాదరిం చెదరు (౧. ౪) కాఁబట్టి ధర్మశాస్త్రమందలి క్రయ విక్రయాది వ్యవహారములోఁ గొన్ని ముఖ్యాంశ ములు మీఁదఁ జెప్పఁబడును.

క్రయవిక్ర యాది వ్యవ హారమునకు దగనివారు.

౩౯౪. బాలుఁడు వెఱ్ఱివాఁడు వివేక శూన్యుఁడు మత్తతచేతఁగాని కష్టవ్యాధిచేతఁగాని వార్ధకముచేతఁగాని కామ క్రోధ భయ ఖేదాదుల

చేతఁగాని శక్తుఁడుగానివాడును జేయు వ్యవహారము చెల్లనేరదు. (౧. ౨౭౧, ౨౭౨)

౩౯౫. బలాత్కారముచేతఁగాని కపటము చేతఁగాని చేసిన వ్యవహారము చెల్లదు. అబుద్ధి పూర్వకముగాఁ జేసినదియుఁ జెల్లనేరదు.(౧. ౨౭౩) బలాత్కారము చేతఁగాని కపటము చేతఁగాని చేయు వి క్ర యాగాలు.

౩౯౬. క్రయ విక్రయాది వ్యవహారము శాస్త్రమున కనుకూలించియుండవలసినది. పక్షమందుఁ జెల్లదు. న్యాయవిరుద్ధముగాఁనిచ్చినది మరల రాఁబట్టుకోవచ్చును. (౧. ౨౭౪, ౨౭౫) న్యాయవిరుద్ధముగాఁ జేసిన—

౩౯౭. క్రయ విక్రయాదులకు లేఖ్యము కావలసిన యక్కఱ లేదు. (౧. ౨౭౭) అయినను లేఖ్యపురస్సరముగా నుండవలసిన వ్యవహార విషయ మందు నోటిసాక్షిచేతనే వ్యవహారము తీ ధర్మస్థానము వారు సంశయింతురు. క్రయ విక్రయాదులకు లేఖ్యమక్కఱ లేదు.

౩౯౮. లేఖ్యపురస్సరమయికలిగిన క్రయాది కము త్రోపుడుపడుటచేతఁగాని విశుద్ధిపత్రము చేతఁ గాని తీఱిపోవలసినది. (స. అ. ౧౮౫౫ అ. నం. ౧౨౭ లోని తీర్పు) క్రయ పత్రాదికము త్రోపుడుపడుట.

౩౯౯. ఒకని కొక కార్యము చేయుటకు న్యాయము చొప్పునఁ బూనుకొన్న వాఁడు దానిని నెఱవేర్పుటయందుఁ దనకొక లాభము కలుగునను నమ్మకము లేకపోయినను దనయందుంచిన నమ్మక ఒడఁబాటు లాభము లేకుండినను జెల్లింపవలసినది.

మునకుఁ దగిన ట్టాకార్య మవశ్యము నెఱవేర్పవలసి నది. (౧. ౨౮౪, ౨౮౫)

తనవశమం దుంచుకొన్న సరకులకైపూఁటకాఁపుతనము.

౪౦౦. ఉపనిక్షేపము మీఁదగాని ఋణము నకు మాఱుగాఁగాని తాకట్టుమీఁదఁగాని వేతన ముకై కాని యెగుమతికయి కాని తీసిన సరకులను దీసినవాఁడు కాపాడుటకుఁ బూటకాఁపయి యుండ వలసినది. ఆ సరకులు పదిలపఱుచుటకును వానికి వచ్చు హాని వారించుటకును బూఁటకాఁపయి యుండ వలసినది. స్వాభావికముగాఁగాని దైవికముగాఁగాని చోరకృతముగాఁగాని ప్రాప్తించిన నష్టికిఁ బూఁట కాఁపు కానేరఁడు. (౧. ౨౮౨, ౨౮౩, ౨౮౬, ౨౯౨, ౨౯౪, ౨౯౫)

గడువు మీఱియుంచుకొన్న సరకులకై-

౪౦౧. సరకులొప్పగింపుమని యడిగిన వెనుకఁగాని యొప్పగింపవలసిన గడువునకు వెనుకఁ గాని యొప్పగింపక నిలుపుకొన్నవ్వాడు సరకులకు వచ్చిన యెట్టి నష్టిగాని కట్టియ్యవలసినది. (౧. ౨౮౪, ౨౮౭)

విక్రయించిన సరకులకై—

౪౦౨. వెలపుచ్చుకొన్న వెనుక సరకొప్ప గింపని పక్షమందు సుంకునకు వచ్చిన హాని విక్ర యించినవాఁ డొప్పుకోవలసినది. (౧. ౩౦౩)

౪౦౩. వెల దీర్చుకొన్నవాఁడు సరకొప్ప గించుకోని పక్షమందు వానితోఁ జేసిన యొడఁబాటు మానుకొని విక్రేత మరల విక్రయింపవచ్చును.

ప్రాప్తించిన నష్టి మొదట వెలకీర్చుకొన్నవానిని జెందును. (౧. ౩౦౩) అయినను మరల విక్రయింప వలసి వచ్చినప్పుడు విక్రయించువాఁడు కాల విలంబము చేయక సరియయిన వెల వచ్చుటకు నలయు ప్రయత్నము చేయవలసినది.

**సంచకరము**

౪౦౪. వెల దీర్చుకొని సంచకరము మాత్ర మిచ్చినవాఁడొడఁబాటు తప్పిపోయిన పక్షమం దిచ్చిన సంచకరము విడిచిపెట్టవలసినది. ఒడఁబాటు దప్పుట విక్రయించినవానిదయిన పక్షమందు వాఁడు పుచ్చుకొన్న సంచకరము రెట్టిగా నియ్యవలసినది. (౧. ౩౦౩)

**భోగ్యఫలమైన తాకట్టు సొమ్ము కాలావధికి లోపడినది కాదు.**

౪౦౫. ఇంగిలీషు దొరతనమువారు తక్కిన విషయములయందుఁ గాలవ్యవస్థ యేర్పరచినట్లు తాకట్టు సొమ్మెంత కాలములో విడిపించుకోవలెనని కాల నియమ మేర్పఱిచినవారుగారు. దేశాచారము చొప్పునఁ గాలవ్యవస్థ యేర్పడియున్నది. (౧౮౦౨. ౨ రిగ్యులేషన్ ౧౮ వ ప్రకరణము ౪ వ కలము) ధర్మశాస్త్రము చొప్పున భోగ్యఫలమయిన తాకట్టు సొమ్మెంతకాలమునకయినను విడిపించుకోవచ్చును. (స. అ. పం. ౧౮౪౪ ఆగస్టు ౯)

**గుత్తకుఁ దీసిన నేలయందుఁ గట్టడపు**

౪౦౬. బాడిగకుఁ బుచ్చుకొన్న భూమి యందుఁగాని తాకట్టుంచుకొన్న భూమియందుఁగాని యిల్లు గట్టుకొన్నవాఁడు గడువు తీఱిన వెనుక దాని

వస్తువులు విప్పికొనుట. కట్టడపు వస్తువులు విప్పుకొని పోవచ్చును. (౧. ౫౯౨)

పూటకాండ్లయొక్క యుత్తరవాదము. ౪౦౭. చూపుడు పూటకుఁగాని నమ్మిక పూటకుగాని పూనుకొన్నవారు తామే యుత్తర వాదము చేయవలసినవారు. వారు గతించిన వెనుక వారి పుత్రులు త్తరవాదులుగారు. తల్లిదండ్రులు తమ పూటపడుట కీడు పెట్టుకొన్న పక్షమందుఁ బుత్రు లుత్తరవాదులగుదురు. (౧. ౩౦౧)

౪౦౮. అనేకులు కూడి యరువు పూట పడిన పక్షమందుఁ బూఁటపడిన ద్రవ్యమందుఁ దమ తమ కేర్పడిన భాగముకొలఁదికి నుత్తరవాదము చేయవలసినవారు. ఒడఁబాటు మఱియొక రీతినున్న పక్షమందు దాని చొప్పున నుత్తరవాదము చేయ వలసినవారు. (౧. ౩౦౧)